

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **శ్రీ విద్యా సారధి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **శ్రీ విద్యా సారధి** వారి వెబ్ సైట్: http://srividyasaradhi.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## శ్రీ విద్యా సారధి  వారి వెబ్ సైట్:

## http://srividyasaradhi.org/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శివపురాణము



రచన


కనకాభిషేక గ్రహీత, గండపెండెర సన్మానిత, సువర్ణ ఘంటాకంకణ

శ్రీవిద్యానిధి, చక్రవిద, శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యా విశారద

**క్రోవి పార్థసారథి**



ఋషి ప్రచురణలు

హనుమాన్‌పేట, విజయవాడ-520 003.



**SIVA PURANAMU**
Krovi Parthasaradhi

First Edition : November, 2002
Cover Design : N. V. Ramana
Printed at : Swamy Offset Printers, VJA
DTP : Monarch Graphics, VJA

Publishers
**Rushi Prachuranalu**
Main Road, Hanumanpet,
Vijayawada - 520 003
Ph : 2579190

Price : **30-00**

# ప్రణతులు

వేదాలను విభజించిన తరువాత వ్యాసుడు వేదాల సారాన్ని సామాన్యుల కందించాలనే ఉద్దేశ్యంతోనే అష్టాదశ పురాణాలు వ్రాశాడు. వేదాంత సారాన్ని ధర్మాల రూపంలో అందరికీ అందించాడు. వ్యాసుడి తదనంతరము అతడి శిష్యులు 18 ఉప పురాణాలు వ్రాశారు. వాటిలో శివ పురాణము ఒకటి.

అనాదిగా మన దేశంలో సూర్యుడు, గణపతి, అంబిక, శివుడు, విష్ణువు వీరు అయిదుగురూ పూజించబడుతున్నారు. వీరి ఉపాసన బాగా ప్రాచుర్యంలో ఉన్నది. వీరిని ఆరాధించేవారికి వీరే పరమేశ్వరుడు. అంటే వైష్ణవులకు విష్ణువే పరమేశ్వరుడు, కాగా శాక్తేయులకు అంబికయే పరమేశ్వరి, అలాగే శివుణ్ణి ఆరాధించే శైవులకు శివుడే పరమేశ్వర స్వరూపుడు.

ఆ రకంగానే శివపురాణం చెప్పబడింది. మార్కండేయుడికి నందీశ్వరుడు శివుని లీలలు వివరిస్తాడు. అయితే పాఠకుల ప్రయోజనం కోసం, విషయం పూర్తిగా అర్థం కావాలనే తలంపుతో గతంలో లాగానే రత్నాకరుడు అనే గురువుగారు తన శిష్యులకు చెబుతున్నట్లుగానే పురాణమంతా నడుస్తుంది. ఈ గ్రంథాన్ని ప్రచురిస్తున్న ఋషి ప్రచురణల వారికి నా కృతజ్ఞతలు.

సామాన్యుడికి కూడా అర్థం కావాలనే ఉద్దేశ్యంతోనే ఈ పుస్తకాన్ని అతి తేలిక భాషలో వ్రాస్తున్నాను. గతంలో లాగానే ఈ గ్రంథాన్ని కూడా పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తూ ...

బుధజన విధేయుడు

కొవి పార్థసారథి

## విషయసూచిక



# ప్రస్తావన

నమస్కారము గురువుగారూ!

తల ఎత్తి చూశాడు ధ్యానముద్రలో ఉన్న రత్నాకరుడు. ఎదురుగా నిలబడి ఉన్నారు తన శిష్యులు కృష్ణశర్మ, నారాయణభట్టు. చాలాకాలానికి వచ్చిన శిష్యులను చూసి అమితానందంతో వారిని ఆహ్వానించాడు. కుశల ప్రశ్నలు అయిన తరువాత వచ్చిన పని ఏమిటి? అని అడిగాడు.

'గురుదేవా! ఇప్పటివరకు మీ దగ్గర అనేకమైన గ్రంథాలను తెలుసుకున్నాం. లలితా సహస్రనామాలకు భాష్యం కూడా చెప్పారు. ఇప్పుడు శివపురాణము చెప్పించుకోవాలని వచ్చాము' అన్నారు శిష్యులు.

'మంచిది. ఇవ్వాళ్టికి సెలవు తీసుకుని రేపు రండి' అన్నాడు రత్నాకరుడు.

మరునాటి సాయంత్రం అనుకున్న ప్రకారమే వచ్చారు శిష్యులు. గురువుగారి ఎదురుగా దర్భాసనం ఆసీనులైనారు. వారిని చూసి చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

భారతదేశంలో బదిరికావనము అనే వనము ఉన్నది. అది పరమ పవిత్రమైనది. నరనారాయణులు అక్కడే తపస్సు చేశారు. ఒకసారి మునులందరూ కలిసి అక్కడ ఒక యాగం చెయ్యాలి అనుకున్నారు. ఆ యాగము చూద్దామని సూతమహర్షి కూడా వచ్చాడు. ఆయన రాకకు మునులంతా మహదానందం చెందారు. ఆయనను ఉచితరీతిన సత్కరించి "మహాత్మా ! శివపురాణము వినాలని మాకు చాలా కాలం నుండి కోరికగా వున్నది. కాబట్టి ఈ యాగ సమయంలో ప్రతిరోజూ మాకు శివుని లీలలను వివరించండి" అని అర్థించారు. ఆ మాటలకు ఆనందించిన సూతుడు మునివర్యులారా పూర్వకాలంలో మార్కండేయుడికి శివ మహాత్మ్యము గూర్చి విపులంగా తెలుసుకోవాలనిపించింది. అప్పుడు సత్యలోకానికి వెళ్ళి శివుని లీలలను గూర్చి చెప్పమని అడిగాడు. దానికి బ్రహ్మదేవుడు "ఈ విషయమంతా విష్ణువుకు బాగా తెలుసు. అతడి దగ్గరకు వెళ్ళు" అన్నాడు. వైకుంఠానికి వెళ్ళాడు మార్కండేయుడు. మార్కండేయుడు వచ్చిన పని తెలుసుకుని శ్రీ మహావిష్ణువు "మార్కండేయా! శివుని లీలలు శివునకు తప్ప ఇతరులకు తెలియవు. కాబట్టి నువ్వు కైలాసం వెళ్ళు. నీ కోరిక తీరుతుంది" అన్నాడు.

మార్కండేయుడు కైలాసానికి వెళ్ళి ఈశ్వరునికి నమస్కరించి "స్వామీ! దేవదేవా! తమ లీలలు వినాలని వచ్చాను" అన్నాడు. దానికి శంకరుడు "మార్కండేయా! నా లీలలను గురించి వివరించగలవాడు నందీశ్వరుడు ఒక్కడే. వెళ్ళి అతన్ని ప్రసన్నం చేసుకో" అన్నాడు.

మార్కండేయుడు నందీశ్వరుని సమీపించి పరిపరివిధాల నందిని, ఈశ్వరుని స్తుతించాడు. నందీశ్వరుడు ప్రసన్నుడై, 'భక్త శిఖామణీ! నీకేం కావాలి?" అని అడిగాడు. దానికి మార్కండేయుడు "భక్తాగ్రగణ్యా! నాకు ఈశ్వరుని లీలలను వినాలని వున్నది. నా కోరిక తీర్చ నీవే సమర్థుడవు" అన్నాడు. దానికి నందీశ్వరుడు సంతోషించి శివుని లీలలు ఒక్కొక్కటిగా చెప్పటం ప్రారంభించాడు. ఈ రకంగా శివ పురాణమంతా నందీశ్వరుడు మార్కండేయుడికి వివరించాడు అని సూత మహర్షి శౌనకాది మహామునులకు వివరిస్తాడు.

ముందుగా నా గురుదేవులకు నమస్కరించి, పీఠాధిపతులకు, స్వామీజీలకు, అవధూలకు వందనాలర్పించి హరితస గోత్రీకుడనైన క్రోవి పార్థసారధి అను నేను సామాన్యులకు కూడా అర్థం కావాలనే ఉద్దేశ్యంతో, అతి సులభశైలిలో శివ పురాణాన్ని వ్రాస్తున్నాను. శివ భక్తులు, పండితులు అందరూ నా యీ ప్రయత్నాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురు గాక.



## నారద గర్వభంగం

నాయనలారా! ఇంతవరకూ మాయను జయించినవారెవరూ లేరు. మాయకు ఎవరూ అతీతులు కారు. దీనికి ఉదాహరణగా ఒక కథ చెబుతా వినండి.

పూర్వకాలంలో నారదుడు ఒకసారి హిమాలయ పర్వతాలలోని మానస సరోవరం దగ్గర పర్ణశాల నొకదాన్ని నిర్మించుకుని భీకరమైన తపస్సు చేస్తున్నాడు. నారదుని తపస్సు భంగము చెయ్యమని దేవేంద్రుడు అప్సరసలను పంపించాడు.

అప్సరసలు నారదుని సమీపించి వీనులవిందుగా గానం చేశారు. కన్నులు పండువుగా నాట్యం చేసారు. మహర్షి చలించలేదు. చివరి అస్త్రంగా అప్సరసలు అంగాంగ ప్రదర్శనం చేశారు. నారదుడు 'శివశివా' అంటూ కనులు మూసుకుని తపస్సు కుపక్రమించాడు.

అప్సరాంగనలు దేవేంద్రుని వద్దకు పోయి నారదుని తపస్సు భంగము చెయ్యలేకపోయామని చెప్పి సిగ్గుతో తలలు వంచుకున్నారు. నారదుడు ఆ తపస్సును ఇంద్ర పదవి కోసం చెయ్యటం లేదు. పరమేశ్వరుని అనుగ్రహం కోసము చేస్తున్నాడు అని తెలుసుకుని దేవేంద్రుడు కూడా శాంతించాడు.

అప్సరసల వయ్యారములకు లొంగక ఇంద్రియ నిగ్రహము పాటించినందుకు నారదుడు తనను తానే అభినందించుకున్నాడు, లోలోన సంతసించాడు. క్రమంగా ఆ సంతోషము గర్వముగా మారింది. 'అప్సరాంగనలకు లొంగలేదు కాబట్టి మాయను జయించినట్లే' అని తీర్మానించుకున్నాడు.

ఇలా ఉండగా ఒక రోజున నారదుడు సత్యలోకానికి వెళ్ళి, బ్రహ్మదేవుడితో తను తపస్సు చేసిన విధానము, అప్సరాంగనలను జయించిన విధానము వివరించి "తండ్రీ! ఇదేకదా మాయ. ఆ మాయను నేను జయించగలిగాను" అన్నాడు. ఆ మాటలు విన్న పరమేష్ఠి నవ్వి ఊరుకున్నాడు. తరువాత నారదుడు కైలాసానికి వెళ్ళి, శివుడికి నమస్కరించి "దేవదేవా! శివ మాయను జయించటం వల్ల నేను ధన్యుడనైనాను" అన్నాడు. ఆ మాటలు విన్న ఈశ్వరుడు "నారదా! శివ మాయ అంటే ఏమిటో పూర్తిగా నాకే తెలియదు. దాన్ని జయించానంటున్నావు. ఎందుకయినా మంచిది, జాగ్రత్తగా ఉండు" అన్నాడు. తరువాత నారదుడు వైకుంఠం చేరి, విష్ణువుకు నమస్కరించి, తాను చేసిన తపస్సు గురించి తెలిపి, "తాతా! శివమాయను జయించాను. విష్ణు మాయ కూడా నన్నేమీ చెయ్యలేదు" అన్నాడు. ఆ మాటలు విన్న విష్ణుమూర్తి "నారదా! త్రిమూర్తులకు మించిన శక్తి ఇంకొకటి ఉన్నది. అదే పరమ శక్తి. మహామాయ. దానిని గురించి తెలియనివారు విష్ణుమాయ, శివమాయ అనుకుంటారు. కాని మహామాయ త్రిమూర్తులను కూడా బద్ధులను చేస్తుంది. మాయకు అతీతుడైన వారెవరూ లేరు. కాబట్టి నువ్వు మాత్రం జాగ్రత్తగా ఉండవలసినది" అన్నాడు. ఆ మాటలు విన్న నారదుడు సరే అని తల ఊపి భూలోకానికి బయలుదేరాడు.

భూలోకం లోక కళ్యాణ పురము అని పట్టణమున్నది. అది సస్యశ్యామలమై ఉన్నది. ఆ రాజ్యాన్ని పాలించే మహారాజుకు యుక్తవయస్కురాలైన కుమార్తె ఉన్నది. కుమార్తెకు వివాహం చేద్దామని నిశ్చయించి, దేశం నలుమూలలా చాటింపు వేయించాడు మహారాజు. రాజభవనముతో పాటు కళ్యాణపురమంతా అందంగా అలంకరించారు. అంత కోలాహలంగా ఉన్నది. ఆ రాజ్యానికి చేరాడు నారదుడు. రాజభవనానికి వచ్చాడు. మహర్షిని చూడగానే రాజు అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి స్వాగతం పలికాడు. సుఖాసీనుడైనాడు నారదుడు. మహర్షిని ఘనంగా సత్కరించాడు మహారాజు. చెలికత్తెలు రాకుమారిని తోడ్కొని వచ్చారు. రాజహంసలా వచ్చిన రాకుమారి అతి వయ్యారంగా నమస్కరించింది.

నిండు యవ్వనంలో ఉన్న రాకుమారి అపురూప సౌందర్యరాశి. ఆమెను చూడగానే నారదుని మనస్సు పరిపరివిధాల పోయింది. ఆమె పేరు రమాదేవి.

ఆమె అందచందాలకు ముగ్ధుడైన మహర్షి "రాజా! నీకు అభ్యంతరం లేకపోతే నీ కుమార్తెను నేను వివాహం చేసుకుంటాను" అన్నాడు. ఆ మాటలు విన్న రాజు "మునీంద్రా! అంతకన్నా నాకు అదృష్టం ఇంకేదైనా ఉంటుందా? నీ కోరిక తప్పక మన్నించాలి. కాని నా కుమార్తె "శ్రీహరిని తప్ప వేరెవరినీ వివాహమాడను" అంటోంది. అంతా భగవదేచ్ఛ. రేపే కదా స్వయంవరము? మీరు కూడా స్వయంవరానికి విచ్చేయండి" అన్నాడు. 'అలాగే తప్పనిసరిగా రేపటి స్వయంవరానికి వస్తాను" అని చెప్పి వైకుంఠానికి బయలుదేరాడు నారదుడు.

వైకుంఠంలో శ్రీమన్నారాయణుడు శేషశాయియై ఉన్నాడు. నారదుడు వైకుంఠం చేరి శ్రీహరిని చూసి "మహాప్రభో! సుఖాలు, భోగాలు అనుభవించటంలో నీకు మించినవాడు ఈ జగత్తులో మరెవరూ లేరు. నేను సన్యాసిని, ఏకాకిని. "స్వామీ! కళత్రసుఖము, స్వర్గసుఖము కన్నా కూడా మిన్న' అంటారు. భూలోకంలో కళ్యాణపురాధీసుడు తన కుమార్తెకు స్వయంవరం ప్రకటించాడు. ఆమె అందాల రాశి, అపరంజి బొమ్మ. నేను ఆమెను వివాహమాడాలనుకుంటున్నాను. మరి ఆమె శ్రీహరిని తప్ప అన్యులను వివాహమాడను అంటున్నది. కాబట్టి ఓ జగన్నాథా! నీ హరి రూపము నాకు ప్రసాదించి నన్ను ఒక ఇంటి వాణ్ణి చేసి పుణ్యం కట్టుకో!" అంటూ అనేక విధాల ప్రార్థించాడు. ఆ మాటలు విన్న విష్ణుమూర్తి "నారదా! వివాహము అంటే ఒక స్త్రీని కట్టుకుని ఆమెతో కాపురం చెయ్యటమే కదా? మాయలో పడ్డవాడు ఆ మాయ నుండి బయటపడే మార్గమున్నది. కాని సంసారంలో పడ్డవాడికి దానిలోనుంచి బయటపడే మార్గమే లేదు. "సారము లేనిది సంసారము" అని పండితులు చెబుతారు. సంసారివై మాయలో పడితే నిన్ను రక్షించేవారెవరు? ఒక్కసారి ఆలోచించు" అన్నాడు. ఆ మాటలకు కోపించిన నారదుడు "తాతా! వివాహం చేసుకున్నంత మాత్రం చేతనే మాయలో పడిపోతానా? శివ మాయ, విష్ణు మాయలను జయించినవాణ్ణి, ఇప్పటివరకూ నిన్ను ఏమీ అడగలేదు. ఈ ఒక్కటీ అడుగుతున్నాను. నీ హరి రూపాన్ని నాకు ప్రసాదించు" అన్నాడు. 'తథాస్తు' అన్నాడు విష్ణువు.

భూలోకంలో కళ్యాణపురం పెళ్ళిసందడితో కోలాహలంగా ఉంది. దేశవిదేశాల నుండి రాజులు, మహారాజులు, రారాజులు, లెక్కలేనంత మంది స్వయంవర మంటపానికి విచ్చేశారు. వారందరూ రతనాల హారాలు ధరించారు. వజ్రాలు పొదిగిన కిరీటాలు ధరించారు. వారు ధరించిన వజ్రవైడూర్యముల కాంతులతో స్వయంవర మంటపము కొత్త కాంతులీనుతోంది. స్వయంవర మంటపం ప్రవేశించాడు నారదుడు రాకుమారి కోరినట్లుగానే తాను హరిరూపము ధరించి వచ్చాడు. అందాల రాశి తప్పక తననే వరిస్తుంది అని ఆలోచిస్తూ ఒకచోట ఆసీనుడైనాడు.

రాకుమారి వరమాలను చేత ధరించి వరాన్వేషణలో బయలుదేరింది. ఆమెతో పాటు చెలికత్తెలు ముందు నడుస్తూ అక్కడ ఆసీనులైన రాజుల వివరాలు తెలియచేస్తున్నారు. రాకుమారి మౌనంగా ముందుకు సాగిపోతోంది. రాకుమారి దగ్గరకు రాగానే కూర్చున్న రాజులు మెడలు ముందుకు సాచుతున్నారు. మందంగా నడచిపోతోంది రాకుమారి. అలా నడచి నడచి నారదుని వద్దకు వచ్చింది. చెల్లికత్తెలు ఏమో చెప్పారు. వరమాల కోసం మెడను ముందుకు వంచాడు నారదుడు. చిరునవ్వు నవ్వింది రాకుమారి. ఘొల్లుమన్నారు చెలికత్తెలు. ఆ కోలాహలానికి అటువైపు చూసిన రాజులు కూడా పగలబడి నవ్వారు. రాకుమారి ముందుకు సాగిపోయింది. దూరంగా చివరన కూర్చున్నాడు శ్రీ మహావిష్ణువు. వరమాల ఆయన కంఠసీమనలంకరించింది. రాకుమార్తెను తీసుకుని గరుడ వాహనం మీద వైకుంఠానికి వెళ్ళిపోయాడు విష్ణుమూర్తి. ఆ విషయం ఎవరూ పట్టించుకోలేదు. స్వయంవర మంటపంలోని రాజులు అందరూ తననే చూసి ఇంకా నవ్వుతూనే ఉన్నారు. ఏం జరిగిందో అర్థం కాలేదు నారదుడికి. చివరకు ఉండబట్టలేక అడిగాడు "వారందరూ తనను చూసి ఎందుకు నవ్వుతున్నారని'? దానికి రాజులంతా "ఏమయ్యా! నువ్వెవరో పిచ్చివాడిలాగున్నావు. వంటి మీద ఉన్న వస్త్రాలు, ఆభరణాలు చూస్తే శ్రీనాధుడిలాగున్నావు. కాని నీ ముఖం ఒకసారి చూసుకో. కోతిలాగా ఉన్నది. అట్టి నిన్ను రాకుమారి ఏ రకంగా వరిస్తుందనుకున్నావు?" అంటూ ఎగతాళి చేశారు.

నారదుడికి విషయం అర్థం అయ్యింది. తనకు శ్రీహరి రూపాన్నిమ్మంటే, కోతిరూపాన్నిచ్చాడు విష్ణుమూర్తి. ఈ కారణంగా సభలో తీరని పరాభవం జరిగింది. తలవంపులయింది. దీనికి కారణమైన విష్ణువును క్షమించరాదు అనుకుంటూ, కోపంతో ఊగిపోతూ హుటాహుటిన వైకుంఠం చేరాడు. అక్కడ శ్రీ మహావిష్ణువుని చూసి, నారాయణా! నీవు ఇంత మోసం చేస్తావనుకోలేదు. దేశదేశాల నుంచి వచ్చిన రాజుల మధ్య నన్ను ఘోరంగా అవమానించావు. దీనికి ఫలితంగా నీకు శాపం ఇస్తున్నాను. "భార్య కోసం నేను ఏ విధంగా తల్లడిల్లిపోయానో, అలాగే నువ్వు కూడా నీ భార్య కోసం నానా కష్టాలు పడతావు. నాకు కోతి ముఖం ప్రసాదించావు కాబట్టి ఆ వానర మూకలే నీకు కష్టకాలంలో సాయంగా నిలుస్తాయి" అన్నాడు.

ఆ మాటలు విన్న శ్రీ మహావిష్ణువు "నారదా! శివ మాయ నిన్ను ఆవహించింది. హరి రూపము కావాలని కదా నువ్వు అడిగావు. హరి అంటే కోతి అని అర్థం నీకు తెలియదా? జ్ఞాన వైరాగ్యాలు కోల్పోయి ఈ రకంగా కోరటం నీకు తగినదా? ఒక్కసారి ఆలోచించు. నిన్ను నేను మోసగించానా? నువ్వు మాత్రం నన్ను అకారణంగా శపించావు. నీ శాపం

నిష్ఫలం కాదు. అయితే త్రేతాయుగంలో శ్రీరామ చంద్రుడుగా దశరథుని ఇంటపుట్టి, నీ శాపాన్ని అనుభవిస్తాను. నువ్వు నన్ను శపించినా, నేను మాత్రం నీకు వరమిస్తున్నాను. కలహప్రియుడవైనప్పటికీ ముల్లోకములందు గౌరవించబడుతూనే ఉంటావు" అన్నాడు.

ఆ మాటలు విన్న నారదుడు విష్ణుమూర్తి కాళ్ళపైబడి "స్వామీ! క్షమించవలసినది. నా తప్పులను మన్నించు. సదా నీ అనుగ్రహానికి పాత్రుడయ్యేటట్లు నన్ను అనుగ్రహించు" అని వేడుకున్నాడు.

ఆ తరువాత విష్ణుమూర్తి ఆశీస్సులందుకొని తీర్థయాత్ర చెయ్యటానికి బయలుదేరాడు నారదుడు.

కాబట్టి శిష్యులారా! ఈ రకంగా మాయను జయించానని విర్రవీగిన నారదుడికి గర్వభంగమైంది" అంటూ వివరించాడు రత్నాకరుడు.



# సృష్టి రహస్యం

'గురువర్యా అసలు సృష్టి ఏ రకంగా జరిగిందో వివరించండి' అన్నాడు కృష్ణశర్మ.

'నాయనా! శివపురాణంలోని సృష్టి రహస్యాన్ని వివరిస్తాను, వినవలసింది' అంటూ ప్రారంభించాడు రత్నాకరుడు.

సృష్టికి పూర్వము ఈ జగత్తంతా జలమయంగా ఉండేది. ఎటు చూసినా మహా సముద్రమే. దానికి ఎల్లలు లేవు. ఆ నీటి నుండి ఒక మహా తేజస్సు ఆవిర్భవించింది. క్రమంగా ఆ కాంతి పుంజము ఒక రూపు దాల్చింది. తేజోమయమైన ఆ కాంతి పుంజమే పరబ్రహ్మము. అదే పరమశివుడు.

ఆ పరబ్రహ్మ సృష్టి చేయాలి అని సంకల్పించినవాడై తన శరీరములోని ఎడమభాగము నుండి ప్రకృతి స్వరూపిణిని కల్పించాడు. ఆమే ఆదిశక్తి, పరాశక్తి, జగన్మాత, శక్తి ప్రాదుర్భావమైన తరువాత పరమేశ్వరుడు సృష్టి ప్రారంభించాడు. మొదటగా పరమేశ్వరుడు ప్రకృతి స్వరూపమైన ఆదిశక్తిని తన వామాంకముపైన ఆసీనురాలిని చేసి, ఆమెను కౌగిలించుకుని విహారానికి బయలుదేరాడు. ఆ సమయంలో పరమేశ్వరుని సంకల్పము వల్ల నీలమేఘశ్యాముడు, నాలుగు చేతులు కలవాడు, ఆ చేతుల యందు శంఖ, చక్ర, గదా, పద్మములను ధరించినవాడు, లక్ష్మీదేవితో కూడిన వాడు అయిన శ్రీమన్నారాయణుడు ఉద్భవించాడు. పరమేశ్వరుడు అతడికి పట్టువస్త్రములు, మణిమయ కిరీటము, కౌస్తుభము ప్రసాదించాడు.

అతడు పీత వస్త్రములు ధరించాడు కాబట్టి - **పీతాంబరుడు**,

లక్ష్మీ సమేతుడు కాబట్టి - **మాధవుడు**

విశ్వవ్యాప్తి కాబట్టి - **విష్ణువు**

సృష్టికి ముందుగా పుట్టాడు కాబట్టి - **పురుషోత్తముడు** అని ప్రసిద్ధి చెందాడు.

పరమేశ్వరుడు నారాయణుడికి "ఓం నమశ్శివాయ' అనే పంచాక్షరీ మహా మంత్రాన్ని ఉపదేశించి "నారాయణా! సర్వకాల సర్వావస్థలయందు ఈ మంత్రాన్ని జపించు. ఈ జగన్సృష్టిలో నీదే ముఖ్యపాత్ర" అని చెప్పాడు.

విష్ణుమూర్తి సముద్రంలో వటపత్రము మీద శయనించి పంచాక్షరీ మంత్ర జపం చేస్తుండగా అశరీరవాణి "ఓయీ! నారము నందుండట చేత నీవు నారాయణుడ వనబడుదువు" అని పలికింది. నారము అనగా నీరు, జ్ఞానము అని అర్థము. అందుకే శ్రీమన్నారాయణుడు జ్ఞాననిధి.

ప్రకృతి త్రిగుణాత్మకమైనది. అనగా సత్వరజస్తమోగుణములతో కలిసి ఉన్నది. పరబ్రహ్మ చిఛక్త్యాత్మకమగు తన వీర్యమును, గుణ సంచలనము లేనప్పుడు ప్రకృతి యొక్క యోని యందుంచాడు. దీనివల్ల మహత్తత్త్వము పుట్టింది. మహత్తత్త్వము వికారము పొందటం వల్ల అహంకారము జనించింది. ఈ రకంగా అవ్యక్తమైన పరబ్రహ్మ నుండి మహత్తత్త్వము, అహంకారము వచ్చినాయి. అహంకారము నుండి పంచతన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలు. వాటి నుండి పంచభూతాలు (పృధివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము), వాటి నుండి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము ఉద్భవించినాయి.

ఇప్పుడు శ్రీ మహావిష్ణువు సృష్టి చేయగోరి వేదములు, 24 తత్వ్తములు, త్రిగుణములను ఒక్కసారి స్మరించాడు. ఆ సమయంలో అతని నాభి నుండి మహా పద్మము ఒకటి ఆవిర్భవించింది. అందులో ఐదు ముఖాలతో బ్రహ్మ, సరస్వతీ సమేతుడై ఉన్నాడు. అప్పుడు బ్రహ్మ తమోగుణ ప్రధానుడు. కనుచూపుమేరలో బ్రహ్మకు జలము తప్ప ఏదీ కనిపించలేదు. అప్పుడు పరమేశ్వరుని ఆజ్ఞపై ఓంకార జపం చెయ్యటం మొదలుపెట్టాడు. బ్రహ్మ తపస్సుకు మెచ్చి లక్ష్మీ నారాయణుడు ప్రత్యక్షమైనాడు. విష్ణువును చూసి బ్రహ్మ "నీవు ఎవరవు? ఇచ్చటికేల వచ్చితివి?" అన్నాడు. దానికి నారాయణుడు "కుమారా! జగత్తును సృష్టించాలనే కోరికతో ముందుగా నాభికమలము నుండి నిన్ను సృష్టించాను. సృష్టికి ఆధారమైన వేదములను నీకు ప్రసాదిస్తున్నాను. నీకే వరం కావాలో కోరుకో" అన్నాడు.

అప్పుడు తమోగుణ ప్రధానుడైన బ్రహ్మ "నేను స్వయంభువును. ఆది పురుషుడను. నా పుట్టుకకు కారణం నువ్వు ఎలా అవుతావు?" అని అడిగాడు. విష్ణువు ఎంతగా నచ్చచెప్పాలని ప్రయత్నించినా బ్రహ్మ వినలేదు. దాంతో విష్ణువు పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

అప్పుడు పరమేశ్వరుడు ఓంకార నాదం చేస్తూ జ్యోతిర్లింగ రూపంలో బ్రహ్మ, విష్ణువుల మధ్య ఉద్భవించాడు. ఆ లింగాన్ని చూసి బ్రహ్మ, విష్ణువులు అమితాశ్చర్యము పొందారు. ఆ లింగానికి తుది మొదలు కనిపించలేదు. జ్యోతిర్లింగానికి అద్యంతములు కనుగొన్నవాడే అధికుడు అని నిర్ణయించుకున్నారు తండ్రీ కుమారులు. విష్ణు యజ్ఞవరాహ రూపంలో అధోముఖంగాను, బ్రహ్మ హంస వాహనం మీద ఊర్ధ్వముఖంగాను ప్రయాణం చేశారు. ఇలా వంద సంవత్సరాలు గడచినాయి. కాని బ్రహ్మ విష్ణువులు ఆ లింగము యొక్క అద్యంతములు తెలుసుకోలేకపోయారు. అప్పుడు ఆ ఇద్దరూ "ఇంతకాలమైనా జ్యోతిర్లింగము యొక్క తుది, మొదలు కనుక్కోలేకపోయినాము. మనలో ఎవరు గొప్ప అనేది తేలలేదు, కాబట్టి ఇద్దరం కలిసి ఆ పరమేశ్వరుణ్ణే ప్రార్థిద్దాము" అనుకుని పరమేశ్వరుణ్ణి భక్తిశ్రద్ధలతో పరిపరివిధాల ప్రార్థించారు.

వారి ప్రార్థన మన్నించిన పరమేశ్వరుడు పినాకపాణియై వారి మధ్యన సాక్షాత్కరించి బ్రహ్మను చూసి "బ్రహ్మదేవా! ఈ జగత్తును సృష్టించటం కోసం నువ్వు విష్ణువు యొక్క నాభికమలము నుండి పుట్టావు. సరస్వతీదేవి నీకు తోడుగా ఉంటుంది. ఇప్పుడు తమోగుణము చేత ఆవరించబడి ఉన్నావు. ఆ కారణంచేత నీవెవరివో నీకు తెలియటం లేదు. విష్ణుమూర్తి ఇచ్చిన వేదాల నాధారము చేసుకుని సృష్టి కార్యక్రమము కొనసాగించు" అన్నాడు.

తమోగుణుడై బ్రహ్మ, పరమేశ్వరుని లక్ష్యపెట్టలేదు. అంతేకాకుండా "నేను సృష్టికర్తను. నాకు ఐదు ముఖాలున్నాయి. మరి నాకు ఐదు ముఖాలెందుకున్నాయి?" అన్నాడు. దానికి పరమేశ్వరుడు కోపించి ఎడమచేతి చిటికెన వ్రేలి గోటితో బ్రహ్మ యొక్క ఐదవతలను ఖండించివేశాడు. బ్రహ్మను తమోగుణం వదలిపోయింది. చేసిన తప్పు తెలుసుకుని క్షమించమని పరమేశ్వరుని వేడుకున్నాడు. పరమేశ్వరుడు ప్రసన్నుడై "బ్రహ్మదేవా! వేదాలను తీసుకో. ఆ విజ్ఞానము వల్ల సృష్టి ప్రారంభించు"

బ్రహ్మదేవుడవయిన నీవు - సృష్టికర్తవు.

విష్ణుమూర్తి - స్థితికర్త

నేను రుద్రుని రూపంలో - లయము కావిస్తాను.

మనమే త్రిమూర్తులము. మనము మూడు రూపాలలో ఉన్నప్పటికీ, మనకు భేదములుండవు. నేను శివుడు, శంభుడు, మహేశ్వరుడు అని అనేక పేర్లతో పూజించబడుతుంటాను. నేను

1) సౌరాష్ట్రమున - సోమనాథుడు
2) శ్రీశైలంలో - మల్లిఖార్జునుడు
3) ఉజ్జయినిలో - మహాకాళుడు
4) ఓంకారములో - అమలేశ్వరుడు
5) హిమాలయాలలో - కేదారేశ్వరుడు
6) డాకినిలో - భీమశంకరుడు
7) వారణాశిలో - విశ్వేశ్వరుడు
8) నాశికలో - త్ర్యంబకేశ్వరుడు
9) పల్వార క్షేత్రములో - వైద్యనాథుడు
10) దారుకావనములో - నాగేశ్వరుడు
11) రామేశ్వరములో - రామేశ్వరుడు
12) శివాలయములో - ఘృష్ణేశుడు

అని ద్వాదశ స్థానాలలో జ్యోతిర్లింగ రూపంలో వెలసి పూజింపబడతాను" అని చెప్పి అంతర్ధానమైనాడు.

ఆ తరువాత బ్రహ్మదేవుడు ఈ జగత్తును ఏవిధంగా సృష్టి చేశాడో చెబుతాను వినండి. బ్రహ్మ సరస్వతీ సమేతుడై పద్మాసనం మీద కూర్చుని ఉన్నాడు. ఆ నీటిలో ఒక అండము తేలుతూ వచ్చింది. దాని నుంచి ఓంకారము వినవస్తోంది. బ్రహ్మ ఆ అండములో ప్రవేశించి తమోగుణ ప్రధానమైన శరీరాన్ని వదిలి న్నాలుగు ముఖాలు కలిగిన శరీరాన్ని ధరించాడు, బ్రహ్మ వదిలిన తమమే రాత్రి అనబడుతుంది.

బ్రహ్మ ముఖం నుంచి పరమేశ్వరుని అనుగ్రహం వల్ల ఓంకారము వచ్చింది. దాని నుంచి భూలోక, భువర్లోక, సువర్లోకాలు పుట్టినాయి. తరువాత సూర్యుడు, తపము, సత్యము మొదలైనవి ఏర్పడ్డాయి. బ్రహ్మ యొక్క తూర్పు ముఖం నుంచి - ఋగ్వేదము, దక్షిణ ముఖం నుండి - యజుర్వేదము, పశ్చిమ ముఖము నుండి - సామవేదము, ఉత్తర ముఖము నుండి - అథర్వణవేదము వచ్చినాయి. ఈ సృష్టి అంతా ఋగ్వేదాన్ని అనుసరించి జరిగింది. ప్రకాశవంతుడైన సూర్యుడే ఓంకార స్వరూపుడయిన పరబ్రహ్మ, సూర్యుని వేడికి నీరంతా ఎండిపోయింది. గ్రుడ్డు పై భాగము ఆకాశము, క్రింది భాగము భూమి అయినాయి.

బ్రహ్మ మొదటగా, సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను సృష్టించాడు. వారు ఈ సృష్టికార్యమునకు విముఖులై తపోవనానికి వెళ్ళిపోయారు. అది చూసి విచారములో మునిగిపోయాడు. అప్పుడు విష్ణువు, రుద్రుడు అక్కడికి వచ్చి సృష్టి కార్యములో తాము కూడా సహాయపడతామని చెప్పగా శ్రీమన్నారాయణుడు.

బ్రహ్మ, సరస్వతులకు - సత్యలోకము,

లక్ష్మీ నారాయణులకు - వైకుంఠము

ఉమామహేశ్వరులకు - కైలాసము

నివాస స్థానాలుగా ఏర్పాటు చేశాడు. అప్పుడు విష్ణువు పంచాక్షరీ మంత్రాన్ని, శివుడు అష్టాక్షరీ మంత్రాన్ని, బ్రహ్మ ఓంకారాన్ని జపించారు.

ఆ సమయంలో బ్రహ్మ మానసపుత్రులైన ప్రజాపతులు ఉద్భవించారు. వీరు 21 మంది.

1) బ్రహ్మ, 2) మనువు, 3) దక్షుడు, 4) భృగువు, 5) ధర్ముడు, 6) యముడు, 7) సురీచి, 8) అంగిరసుడు, 9) అత్రి, 10) పులస్త్యుడు, 11) పులహుడు, 12) క్రతువు, 13) కశ్యపుడు, 14) వశిష్ఠుడు, 15) పరమేష్టి, 16) సూర్యుడు, 17) సోముడు, 18) కర్దముడు, 19) క్రోధుడు, 20) ఆర్వాకుడు, 21) ప్రీతుడు.

దక్షప్రజాపతికి 64మంది కుమార్తెలు. వీరిలో అదితి, దితి, వినత, కద్రువ, స్వస, ముని, అరిష్ట, మాతంగి, తామ్ర, ఇల అనే పదిమందికి కశ్యపునికిచ్చి వివాహం చేశాడు. కశ్యపుడికి

| | | |
|---|---|---|
| అదితి యందు | - | ఇంద్రాది దేవతలు |
| దితి యందు | - | దైత్యులు |
| వినతకు | - | అనూరుడు, గరుత్మంతుడు |
| కద్రువకు | - | సర్పములు |
| స్వసకు | - | పక్షులు |
| మునికి | - | గంధర్వులు |
| అరిష్టకు | - | అప్సరసలు |
| మాతంగికి | - | ఐరావతము |
| తామ్రకు | - | పక్షులు |
| ఇలకు | - | వృక్షములు జన్మించాయి. |

ఇంద్రాది దేవతలు సత్యధర్మ పరాయణులు. ఇంద్రునికి స్వర్గాధిపత్యమిచ్చారు దేవతలు. అతడికి వేదకర్మలయందు అధికారము, యజ్ఞయాగాలలో హవిర్భాగము ఇచ్చారు.

దైత్యులు అధర్మపరులు, అసూయాపరులు. వీరికి కీకారణ్యములు, కొండగుహలు నివాస స్థానములయినాయి. మిగిలినవారికి వారి స్వభావాన్ననుసరించి నివాసము కల్పించబడింది.

బ్రహ్మ యొక్క అంశతో స్వాయంభవ మనువు జన్మించాడు. పద్మగంధి, శతరూప అతని భార్యలు. స్వాయంభవునకు 1) అగ్రియుడు, 2) ప్రియవ్రతుడు, 3) ఉత్తానపాదుడు కుమారులు. 1) రాకూతి, 2) దేవహూతి, 3) ప్రసూతి కుమార్తెలు.

రాకూతికి - రుచితోను, దేవహూతికి - కర్దమునితోను, ప్రసూతికి - దక్షునితోనూ వివాహం జరిగింది.

దేవహూతికి - కర్దముని వలన కపిలుడు జన్మించాడు. దక్షుని యొక్క పదముగ్గురు కుమార్తెలను ధర్ముడు వివాహం చేసుకోగా. భృగువు పదకొండు మందిని వివాహమాడాడు. శివుడు సతీదేవిని, మరీచి - సంభూతిని, అంగిరసుడు - స్మృతిని, పులస్త్యుడు - ప్రీతిని వివాహమాడారు.

ఈ రకంగా దక్ష ప్రజాపతి కుమార్తెలు తమ భర్తలతో కలిసి మూడు లోకాలలోనూ జీవరాశిని ఉత్పత్తి చేశారు. ఈ విధంగా దక్షప్రజాపతి సంతతి వలన పిపీలికాది బ్రహ్మ పర్యంతము 84 లక్షల జీవరాశులు జన్మించినాయి అంటూ సృష్టి రహస్యాన్ని తన శిష్యులకు వివరించాడు రత్నాకరుడు.

# గుణనిధి

"నాయనలారా! తెలిసిగాని తెలియకగాని పరమేశ్వరుణ్ణి ఆరాధించినట్లైతే, ఆ భక్తులను ఈశ్వరుడు చల్లగా చూస్తాడు. దీనికి ఉదాహరణ ఒక కథ చెబుతాను వినండి".

పూర్వకాలంలో కాంపిల్యనగరములో యజ్ఞదత్తుడనే బ్రాహ్మణుడుండేవాడు. ఆయన వేదవేదాంగవిదుడు, శాస్త్రవేత్త, పరమనిష్ఠాగరిష్టుడు. రాజాదరణతో పాటు ప్రజల మన్ననలు

కూడా పొందాడు. సదాచారసంపన్నుడని పేరు తెచ్చుకున్నాడు. అతని భార్య సోమిదమ్మ భర్తకు తగిన భార్య. వీరి కుమారుడు 'గుణనిధి'.

ఒకడే కుమారుడు కావటం చేత అతన్ని అల్లారుముద్దుగా పెంచారు. పిల్లవాడికి ఏడవయేడు రాగానే ఉపనయనము కూడా చేశారు. విద్యాభ్యాసానికి పంపారు. కాని అతడు చదువు సంధ్యలు మాని సోమరియై చెడు స్నేహాలకు అలవాటు పడ్డాడు. ఈ విషయం తెలిసినా ఒక్కగానొక్క కొడుకు కావటం చేత తల్లి గారాబం చేస్తుండేది. దండించేది మాత్రం కాదు. రాజుగారి కొలువు, పండిత చర్చలతోనే తండ్రికి కాలం సరిపోయేది. కుమారుణ్ణి గురించి పట్టించుకునేవాడు కాదు. గుణనిధి క్రమంగా పెరిగి పెద్దవాడయినాడు. అతడితో పాటే అతని చెడు అలవాట్లు కూడా పెరిగినాయి. దుర్జన సాంగత్యము, మద్యపానము, జ్యూదము వంటి వ్యసనాలు అలవడ్డాయి. రాత్రి, పగలు లేదు. ఎప్పుడో ఇంటికి వచ్చి అన్నంతిని పోయేవాడు. ఒకవేళ ఎప్పుడైనా తండ్రి కుమారుణ్ణి గురించి అడిగితే 'వేదాధ్యయనంలో తీరిక లేకుండా ఉన్నాడు' అని చెప్పేది తల్లి.

కుమారుడు ఇంటికి వచ్చినప్పుడు కంటతడి పెట్టుకునేది తల్లి. చెడు తిరుగుళ్ళు మాని చదువుకోమని చెప్పేది. అతడు వినేవాడు కాదు. కాని పుత్రప్రేమతో అతడు అడిగినంత డబ్బు ఇచ్చి పంపేది. ఈ రకంగా తల్లికి తెలిసి కొంత, తెలియకుండా కొంత తీసుకువెళ్ళి జూదమాడేవాడు గుణనిధి. ఈ రకంగా కొంతకాలం గడిచింది. ఒకనాడు గుణనిధి తల్లిని డబ్బిమ్మని అడిగాడు. అతడు అడిగినంత ఆమె ఇవ్వలేకపోయింది. ఆ కారణంగా తల్లికి తెలియకుండా లోపల పెట్టెలో ఉన్న వజ్రపుటుంగరాన్ని తీసుకుపోయాడు గుణనిధి.

గుణనిధి ఆ ఉంగరాన్ని జూదంలో ఓడిపోయాడు. గెలిచినవాడు ఆ ఉంగరాన్ని తీసుకుని రాజవీధిలో పోతుండగా యజ్ఞదత్తుడు చూశాడు. తన ఉంగరం ఇతడి చేతికి ఎలా వచ్చింది? వెంటనే అతన్ని నిలువరించి "ఈ ఉంగరం నీకెక్కడిది? ఎవరిచ్చారు? నిజం చెప్పకపోతే రాజాస్థానానికి తీసుకుపోతాను" అన్నాడు. ఆ మాటలకు భయపడ్డ జూదరి నిజం చెప్పేశాడు. అతడి మాటలు వినగానే స్థాణువులా చలనరహితుడైపోయాడు యజ్ఞదత్తుడు. అతనికి ఇవ్వవలసిన బాకీ చెల్లించి ఆ ఉంగరాన్ని తీసుకుని ఇంటికి వచ్చాడు.

భర్త ఇంటికి రాగానే కాళ్ళకు నీళ్ళిచ్చింది భార్య. యజ్ఞదత్తుడు హతాశుడై నేలమీద కూలబడ్డాడు. అతడి కళ్ళు బైర్లు కమ్మినాయి. భార్య అతని కాళ్ళు కడిగి "నాథా! నీ విచారానికి కారణము ఏమి?" అని అడిగింది.

యజ్ఞదత్తుడు కొద్దిగా తేరుకుని "రాజుగారు నాకు బహుకరించిన వజ్రపు ఉంగరం ఏదీ?" అన్నాడు.

"ఓస్! దానికోసమేనా ఇంత ఇది. ఆ ఉంగరం లోపల పెట్టెలో భద్రంగా ఉంది" అంది సోమిదేవమ్మ. 'ఒక్కసారి దాన్ని తీసుకురా!' అన్నాడు యజ్ఞదత్తుడు. 'ముందు స్నానం చేసి భోజనం చెయ్యండి. ఆ ఉంగరం ఎక్కడికీ పోదు, లేవండి" అంటూ మాట తప్పించటానికి ప్రయత్నించింది భార్య.

దానికి కోపగించిన యజ్ఞదత్తుడు "ఓసీ! పాపిష్టిదానా! నిజం చెప్పు. నీ కొడుకు వేదమంత్రాలు వల్లిస్తున్నాడా? అసలు గురువు దగ్గరకు వెడుతున్నాడా? స్నానము, సంధ్యావందనము, జపము, అగ్నిహోత్రము ఈ మాటలైనా వాడికి తెలుసా? నీ మాటలు నిజమని ఇంతకాలం నమ్మాను. నీ మూలంగా ఈ రోజున నా పరువు ప్రతిష్ఠలు పూర్తిగా పోయినాయి. ఎంత పనిచేశావు?" అంటూ గద్దించాడు. భార్య మారు మాట్లాడలేదు. కంట తడిపెట్టింది. ఈ విషయం గుణనిధికి తెలిసింది. ఇంటికి వెళ్ళే ధైర్యం చాలలేదు. ఏం చెయ్యాలో తెలియక ఊరు వదలి పారిపోయాడు. ఉన్నప్పుడు తినటం, లేనప్పుడు పస్తు. ఎక్కడికి వెళ్ళాలి? ఏం చెయ్యాలి? ఇలా ఆలోచిస్తూ, ఒక గ్రామం చేరాడు. ఆ ఊళ్ళో ఒక శివాలయం ఉంది. ఎక్కడికి వెళ్ళాలో తెలియని గుణనిధి శివాలయంలోకి వెళ్ళాడు.

ఆ రోజు శివరాత్రి. ఆ రాత్రంతా భక్తులు అక్కడ చేరి భజనలు చేస్తున్నారు. గత రెండు రోజులుగా భోజనం చెయ్యలేదు గుణనిధి. నీరశించి పోతోంది శరీరం. శరీరం తూలిపోతోంది. నిద్రపోదామంటే అంతా భజన గోలగా ఉంది. ఇంతలో భక్తుల పూజలు పూర్తయినాయి. భగవంతుడికి నివేదనలు చేశారు. వారంతా ఆ రోజు ఉపవాసమున్నారు కాబట్టి ఆ ప్రసాదమె ఎవరూ తినలేదు. తెలవారబోతున్నది. భక్తులు స్నాన సంధ్యలు పూర్తి చేసుకోటానికి బయటకు వెళ్ళారు. ఆలయంలో ఎవ్వరూ లేరు. దేవుని విగ్రహం దగ్గర అనేక రకాలయిన తినుబండారాలు. ఘుమఘుమ వాసనలు. ఆకలి బాధతో అలమటిస్తున్న గుణనిధికి శివుని అనుగ్రహం లభించినట్లనిపించింది. మెల్లగా లేచి గర్భాలయంలోకి ప్రవేశించాడు. అక్కడ దీపారాధన కొండెక్కింది. పైనున్న బట్ట చింపి నూనెలో ముంచి వెలిగించాడు. ఆ వెలుతురులో ప్రసాదమున్న పాత్రలు చేతిలోకి తీసుకున్నాడు. ఇంతలో బయట ఎవరో వస్తున్న అలికిడి అయ్యింది. వాళ్ళు వచ్చి తనని అడ్డగిస్తారేమో అని భయపడి పారిపోబోయాడు. అతన్ని చూసిన భక్తులు 'దొంగ దొంగ' అని అరిచి పట్టుకో ప్రయత్నించారు. ఆ ఖంగారులో గర్భగుడి బయటకు వచ్చి అక్కడ ఉన్న నందీశ్వరుడి మీద పడ్డాడు తలకు బలమైన , గాయమైంది. స్పృహ కోల్పోయి కొద్ది క్షణాలలోనే మరణించాడు.

గుణనిధి ప్రాణాలు తీసుకుపోవటానికి యమదూతలు వచ్చారు. అతని కోసం శివభటులు కూడా వచ్చారు. 'ఇతడు పాపి, జూదరి, దొంగ కాబట్టి యమ లోకానికి రావాలి' అన్నారు యమకింకరులు. 'మహాశివరాత్రి నాడు ఉపవాసం ఉన్నాడు. రాత్రంతా జాగారం చేశాడు. పైగా తెలవారకుండానే ప్రాణాలు కూడా వదిలాడు కాబట్టి కైలాసానికి రావాలి' అన్నారు శివభటులు.

ఈ రకంగా వీరి మధ్య వాదోపవాదములు జరుగుతుండగా ఆకాశం నుండి దివ్య విమానము ఒకటి వచ్చింది. అప్పుడు శివదూతలు "ఓ యమ భటులారా! లోకంలో ఎవరైనా సరే తెలిసిగాని, తెలియకగాని శివరాత్రి ఉపవాసముండి జాగారము చేసినట్లైతే వారికి కైలసప్రాప్తి కలుగుతుంది. ఇతడు ఆ రెండు పనులూ చేశాడు. పైపెచ్చు శివరాత్రి రోజున మరణించాడు. కాబట్టి ఇతడికి శాశ్వతంగా కైలాసంలో ఉండే యోగ్యత లభించింది. అందుచేత గుణనిధిని కైలాసానికి తీసుకుపోతున్నాము' అంటూ అతన్ని దివ్య విమానము ఎక్కించి కైలాసానికి తీసుకునిపోయారు.

గుణనిధి కైలాసములో చాలాకాలము ఉండి, తరువాత కళింగ దేశపు రాజకుమారుడుగా జన్మించాడు. తండ్రి తరువాత ఇతడే రాజయినాడు. ఇతని పేరు 'అరిందముడు' ఇతడు గొప్ప శివభక్తుడు. శివాలయాలు కట్టించాడు. యజ్ఞయాగాలు చేశాడు. పండితులకు అగ్రహారాలు దానం చేశాడు. శివకేశవులకు భేదం లేదు అని ప్రచారం చేశాడు. నిరతాన్నదానం చేశాడు. చివరకు అవసానకాలంలో అష్టాక్షరీ మంత్రాన్ని జపిస్తూ ప్రాణాలు వదిలాడు.

బ్రహ్మ మానసపుత్రుడు పులస్త్యుడు. అతని కుమారుడు 'విశ్రువు'. విశ్రువు భరద్వాజుని కుమార్తె దేవవర్ణిని వివాహమాడాడు. అరిందముడు మరణించిన తరువాత స్వర్గసుఖాలనుభవించి దేవవర్ణి గర్భాన వైశ్రావణుడుగా జన్మించాడు. ఇతడే కుబేరుడు.

కుబేరుని అందచందాలు, బలపరాక్రమాలు చూసి, ముచ్చటపడి పాతాళలోకంలో ఉన్న సుమతి, తన కుమార్తె కైకసిని పిలిచి, 'నువ్వు ఏ రకంగానైనా సరే విశ్రువుని వివాహమాడి అతడి వల్ల కుబేరుని వంటి కుమారుని కనవలసినది' అన్నాడు. తండ్రి మాట శిరసావహించి కైకసి విశ్రువు వద్దకు వెళ్ళింది. ఆమె మనోభీష్టాన్ని గ్రహించిన మహర్షి ఆమె కోర్కెను మన్నించాడు. అది అసురసంధ్య కావటం చేత ఆమెకు రాక్షసులు జన్మించారు. వారే రావణ కుంభకర్ణులు. కుబేరుడు శివుని గురించి తపస్సు చేసి వరాలు పొందాడు. విశ్వకర్మ లంకానగరాన్ని నిర్మించి కుబేరుడికిచ్చాడు. రావణుడు కుబేరుని ఓడించి లంకానగరాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

కుబేరుడు కాశీ నగరము చేరి, అన్నపానీయాలు విసర్జించి, శివుని గురించి ఘోరతపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి శివుడు 'అలకాపురి'పట్టణాన్ని ఇచ్చాడు. అందులో చైత్రరథము అనే మనోహరమైన ఉద్యానవనాన్ని నిర్మించాడు. కుబేరుణ్ణి యక్షులకు నాయకుడుగా చేశాడు. నవనిధులకు అధిపతిగా చేశాడు.

ఈ రకంగా గుణనిధి చెడ్డపనులు చేసినప్పటికీ ఈశ్వరానుగ్రహం వల్ల కుబేరుడైనాడు అంటూ వివరించాడు రత్నాకరుడు.



# అరుంధతి

బ్రహ్మదేవునికి అనేకమంది మానసపుత్రులు ఉన్నారు. వారి తరువాత 'సంధ్య' అనే పుత్రిక కూడా జన్మించింది. ఈమె అతిలోక సౌందర్యరాశి. బ్రహ్మ మానసపుత్రులైన నవబ్రహ్మలు కూడా ఆమె సౌందర్యాన్ని చూసి పరవశించిపోతున్నారు. అది చూసిన శివుడు కోపగించి సంధ్యాదేవిని కైలాస పర్వతము మీద తపస్సు చేయమని చెప్పాడు. ఆ తరువాత గౌతమాది మహర్షులు ధర్మశాస్త్రాలను వ్రాశారు.

సంధ్యాదేవి మీద మోహముతో బ్రహ్మకు వీర్యస్ఖలనము జరిగింది. అగ్నిష్వాత్తులు 64 వేలమంది, బర్హిషదులు 84 వేలమంది ఉద్భవించారు. వీరందరు పితృగణాలు అలాగే సంధ్యాదేవిని తలచుకున్న నవబ్రహ్మలకు పుట్టినవారు కూడా పితృగణాలలో కలిసిపోయారు. 'సంధ్యాదేవి 'పితృమాత' అయింది.

కొంతకాలానికి బ్రహ్మ వశిష్ఠుని పిలిచి, 'సంధ్యాదేవి కైలాస పర్వతముపైన తపస్సు చేస్తున్నది. నీవామెకి శివపంచాక్షరిని ఉపదేశించవలసినది' అన్నాడు. తండ్రి ఆజ్ఞను పాటించాడు వశిష్ఠుడు. కఠోర నియమాలతో పంచాక్షరీ మంత్రాన్ని జపించింది సంధ్యాదేవి. శివుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. అప్పుడామె "దేవదేవా! నా ఈ శరీరము అగ్నిప్రవేశం చేసి, నేను పునర్జన్మ ఎత్తాలి. నన్ను వ్యామోహముతో చూసినవారు నపుంసకులు కావాలి. పతివ్రతలలో నేను శ్రేష్ఠురాలను కావాలి" అని అడిగింది. దానికి శంకరుడు చంద్రభాగానదీ తీరమున 'మేదాతిథి' అనే ఋషి యజ్ఞం చేస్తున్నాడు. ఎవరి కంటా పడకుండా నువ్వు ఆ యజ్ఞకుండములో ప్రవేశించు. యజ్ఞకుండములో ప్రవేశించే సమయంలో నువ్వు ఎవరిని భర్తగా కోరకుంటే అతడే నీ భర్త అవుతాడు. నీ కోరికలన్నీ తీరుతాయి" అన్నాడు.

సంధ్యాదేవి శంకరుడు చెప్పినట్లుగానే యజ్ఞకుండములో ప్రవేశిస్తూ వశిష్టుని భర్తగా ధ్యానించింది. ఆ సమయములో సూర్యుడు ఆమె శరీరాన్ని రెండు భాగాలుగా చేశాడు. అందులో పైభాగము దేవతలకిష్టమైన ప్రాతఃసంధ్య, క్రింది భాగము పిత్రుదేవతలకిష్టమైన సాయంసంధ్య. అగ్నిలో అమె భస్మమైన తరువాత, ఆమె ఆత్మకు అగ్నిదేవుడు ఒక రూపం కల్పించాడు. ఆమే అరుంధతి. మేధాతిథి మహర్షి అరుంధతిని పెంచి పెద్ద చేసి వశిష్టుడికిచ్చి వివాహం చేశాడు అన్నాడు రత్నాకరుడు.



# దక్షవాటిక

శిష్యులారా! పూర్వకాలంలో పరమేశ్వరుణ్ణి ధిక్కరించి యాగము చేయబోయిన దక్ష ప్రజాపతికి గర్వభంగమైంది. మీకు అ కథను చెబుతాను వినండి.

దక్షప్రజాపతి బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు తన కుమార్తె సతీదేవిని శివునకిచ్చి వివాహం చేశాడు. సతీదేవిని తీసుకుని శివుడు కైలాసం చేరి జనుల యొక్క పూజలందుకుంటున్నాడు.

ఆ తరువాత బ్రహ్మలు ప్రయాగలో సత్రయాగము చెయ్య తలపెట్టారు. ఆ యాగానికి దేవతలు, దిక్పాలకులు, ప్రజాపతులు, త్రిమూర్తులు వారూ వీరూ అందరూ విచ్చేశారు. దక్షుడు యాగశాలలోకి ప్రవేశించగానే సభాసదులందరూ లేచి నిలబడి ఆయనకు గౌరవసూచకముగా స్వాగతము పలికారు. కాని శివుడు మాత్రం ఆసనం నుంచి లేవలేదు. అది చూచిన దక్షుడు అల్లుడు తనను అవమానించాడని భావించాడు. శివుని చర్యను సహించలేకపోయాడు.

శివుడు చేసిన పని వల్ల ధర్మము కుంటుపడుతున్నది. ఇతడు నా అల్లుడు, నన్ను గౌరవించవలసినవాడు. అది లేకపోగా కూర్చున్నచోట నుండి కదలక నన్నవమానించాడు. వేదమును శూద్రునకు చెప్పినట్లుగా, నా కుమార్తెని తనికిచ్చి అపాత్రదానం చేశాను. ఇప్పుడు విచారించి లాభమేమిటి? బూడిద పూసుకు తిరిగే ఇతడు నన్ను గౌరవించకపోతే నష్టము ఏమిటి? ఈ పిశాచ నాయకుడు నవమానించినందుకు గాను ఇక నుంచి ఇతనికి యజ్ఞ యాగములలో హవిర్భాగము లేకుండా ఉండుగాక అని శపించాడు. శివుడు మాత్రం మౌనం వహించి నిర్వికారంగా ఉండిపోయాడు. కాని శివుని శపించినందుకు అతని వాహనమైన నందీశ్వరునికి మాత్రం కోపం వచ్చింది. అతడు "సమస్త జగదాధారుడు,

సర్వలోకైక పూజ్యుడు, అయిన శివుని శపించిన దక్షుని ముఖము తేజోహీనమగుగాక" అన్నాడు. ఆ మాటలు విన్న దక్షుడు క్రుద్ధుడై "ఓరీ నందీ! శివునితో బాటు నీకు కూడా యజ్ఞ యాగాలలో హవిర్భాగముండదు" అని శపించాడు. ఆ శాపానికి రెచ్చిపోయిన నందీశ్వరుడు "ఓ బ్రాహ్మణోత్తములారా! దక్షుడు శివుని శపించినా చూస్తూ ఊరకున్నారు. కాబట్టి బ్రాహ్మణులు శూద్రులకు పురోహితులై దానధర్మాలు పట్టండి. దరిద్రంతో బాధపడండి. బ్రహ్మరాక్షసులు కండి" అని ప్రతి శాపం పెట్టాడు. సభలో ఉన్న బ్రాహ్మణులంతా గగ్గోలు పెట్టారు. అప్పుడు శివుడు కల్పించుకుని 'నందీశ్వరా! బ్రహ్మద్వేషము, అన్నద్వేషము పనికిరావు, శాంతించు' అన్నాడు. నంది శాంతించాడు. ఎవరి స్థానాలకు వారు కదలి వెళ్ళిపోయారు. దక్షుడు మాత్రం సమయం దొరికినప్పుడల్లా శివుని అవమానించటానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు.

ఒకసారి దక్షప్రజాపతి 'బృహస్పతి సవనము' అనే యాగాన్ని ఏర్పాటు చేసి, యాగానికి దేవతలను, యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్యులను, పన్నగులను అందరినీ పిలిచాడు. కాని శివుడిని, సతీదేవిని మాత్రం పిలవలేదు. కనీసం కబురు కూడా పంపలేదు.

యజ్ఞం ప్రారంభమైంది. ఋత్విక్కులు వేదమంత్రాలు చదువుతున్నారు. భృగువు, మరీచి, దధీచి మొదలైన శివభక్తులు 'ఈ యాగానికి శివుడు ఎందుకని రాలేదు' అని దక్షుడిని అడిగారు. దానికి "శివుడు భూతప్రేత పిశాచాలకు అధిపతి, అతడు ఇక్కడకు రావటానికి లేదు" అన్నాడు దక్షుడు. దానికి వారు "ప్రజాపతీ! శివుడు మంగళకరుడు. అతడు లేనిచోట అమంగళం జరుగుతుంది. కాబట్టి మేము ఇక్కడ ఉండము" అని వెళ్ళిపోయారు. వామదేవుడు, గౌతముడు, అలారుడు మొదలైనవారు కూడా వారిని అనుసరించారు. దక్షుడు వారిని లెక్కచేయలేదు. యజ్ఞము ప్రారభమైంది.

సతీదేవి కైలాసంలో చెలులతో కలిసి విహరిస్తూ ఉన్నది. పైనుండి విమానాలలో దేవగంధర్వులు వెడుతున్నారు. వీరంతా ఎక్కడికి వెడుతున్నారని చెలులను అడిగింది. దక్ష ప్రజాపతి యజ్ఞాన్ని గురించి వివరించారు చెలులు. తండ్రి చేసే యాగానికి తను కూడా వెళ్ళాలి అనుకుంది. కాని తండ్రి తనను పిలవలేదు, అయినా తనకు ఆహ్వానమెందుకు? తండ్రి ఇంటికే కదా? అనుకుని ఈశ్వరుని వద్దకు పోయి తన తండ్రి చేసే యాగాన్ని గురించి చెప్పి 'నాథా! మనం కూడా వెడదాము? అన్నది. పిలవని పేరంటానికి వెళ్ళద్దు అన్నాడు శివుడు. 'కాదు నేను ఒంటరిగానైనా వెడతాను అన్నది. ఇక కాదనలేక భూతగణాలను తోడిచ్చి పంపాడు శివుడు. సతీదేవి భూతగణాలు తోడురాగా దక్షయజ్ఞానికి వెళ్ళింది.

సతీదేవిని తల్లి మనసారా ఆహ్వానించింది. అక్కచెల్లెలు మాత్రం పొడిమాటలు మాట్లాడారు. ఈ వింత పరిణామానికి ఆశ్చర్యపోయింది సతీదేవి. తనతో ఎంతో ప్రేమగా ఉండే అక్కచెల్లెళ్ళు ఎందుకు అలా ప్రవర్తిస్తున్నారో అర్థం కాలేదు. యాగశాలలోకి వెళ్ళింది. తండ్రి తనను చూసి కూడా పలకరించలేదు. ఇక ఉండబట్టలేక 'తండ్రీ! నేను వచ్చాను' అన్నది. సతీదేవిని చూచి దక్షుడు 'సతీ! నీ భర్త భూతనాథుడు. పిశాచ నాయకుడు. శ్మశానములందు తిరుగుతాడు. పుర్రెలమాలలు ధరిస్తాడు. కాబట్టి అపవిత్రుడు. అతని భార్యవైన నువ్వు కూడా అపవిత్రురాలవే. కాబట్టి నీకు గాని, నీ భర్తకు గాని ఈ యాగశాల యందు ప్రవేశము లేదు" ఇక్కడ నుండి వెళ్ళిపో" అన్నాడు.

ఆ మాటలు విన్న సతీదేవికి ఏమీ తోచలేదు. పుట్టినింట్లో ఘోర అవమానము జరిగింది. భర్త మాట కాదని వచ్చినందుకు తగని శాస్తి జరిగింది. ఇంత అవమానభారంతో ఇంటికి వెళ్ళలేదు. ఇక్కడా ఉండలేదు. అందుచేత యోగాగ్నిని రగిల్చి అందులో దగ్ధమైపోయింది. ఆమెతో పాటు వచ్చిన పిశాచగణాలు యాగశాలను భీభత్సం చెయ్యటానికి పూనుకున్నాయి. భృగుమహర్షి దక్షిణాగ్నిలో అభిచారికా హోమము చేసి వాటిని శాంతపరిచాడు.

పిశాచగణాలు పరుగెత్తుకుపోయి శివునికి జరిగిన విషయాన్ని వివరించాయి. శివుడు కోపాగ్నితో హూంకరించి తన జటాజూటములోని జడనొకదానిని లాగి నేలమీద కొట్టాడు. అందులోనుంచి భద్రకాళి, వీరభద్రులు భయంకరంగా వికటాట్టహాసం చేస్తూ పుట్టారు. నంది, భృంగి తదితర పిశాచ గణాలు వెంటరాగా వీరభద్రుడు, భద్రకాళీ దక్షుని యజ్ఞవాటికకు బయలుదేరారు. వారి రాకతలో అకాల ప్రళయము వచ్చినట్లు అయ్యింది. యజ్ఞవాటికలో సభాసదుల మొహాలు కాంతిహీనములైనాయి. ఆకాశం నుండి నక్షత్రాలు నేలరాలినాయి. దక్షుని ఎడమకన్ను అదిరింది. ఈ అపశకునాలు చూసి సభాసదులు ఎక్కడివారక్కడ పారిపోబోయారు. కాని పిశాచగణాలు వారిని పట్టుకుని చితకబాదినాయి.

వీరభద్రుడు యాగశాలలోకి వెళ్ళి అక్కడ ఉన్నవారందరినీ హింసించాడు. చివరకు దక్షుని తలనరికి దక్షిణాగ్నిలో హోమం చేశాడు. ఇంకా కోపం చల్లారక విలయతాండవం చేశాడు. వికటాట్టహాసాలు చేశాడు. ఋత్విక్కులను కూడా క్రూరంగా హింసించాడు. యాగశాలనంతా చిన్నాభిన్నం చేశాడు.

దక్షుని భార్య, కొందరు దేవతలతో వచ్చి వీరభద్రుని, భద్రకాళిని శాంతించమని పరిపరివిధాల ప్రార్థించారు. వారు శాంతించి కైలాసానికి వెళ్ళిపోయారు.

బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతా ప్రముఖులంతా శివుని వద్దకు వెళ్ళి "ఈశ్వరా! యజ్ఞము పూర్తి కాకపోతే అశుభం జరుగుతుంది. లోకానికి ఈతిబాధలు తప్పవు. కాబట్టి

యజ్ఞాన్ని పూర్తి చేయించు" అని బ్రతిమాలి శివునిని యాగశాలకు తీసుకుపోయారు. అప్పుడు శివుడు తన దూతలను పంపి ఋత్విక్కులను పిలిపించాడు. దక్షుని తల యజ్ఞకుండములో మాడి మసి అయిపోయింది. కాబట్టి ఉత్తర దిశగా తల ఉంచి పడుకున్న ఏ ప్రాణిదైనా సరే తలనరికి తెమ్మన్నాడు శివుడు. అలా పడుకున్న ఒక మేక మాత్రమే కనిపించింది భటులకు. ఆ మేక తలనే తెచ్చినారు. దాన్ని దక్షుని శరీరానికి అంటించారు. దక్షుడు పునర్జీవుడై యాగము పూర్తిచేశాడు. దక్షుడు పరమేశ్వరుని క్షమించమని పరిపరివిధాల ప్రార్థించాడు. శంకరుడు అనుగ్రహించి దక్షుడు యజ్ఞము చేసిన స్థలము ఇక మీద 'దక్షవాటిక' అని పిలువబడుతుంది అని వరమిచ్చాడు అంటూ వివరించాడు రత్నాకరుడు.

## హరిహర స్వరూపము



శిష్యులారా! శివునకు,కేశవునకు భేదము లేదు. హరిహరులిద్దరూ ఒక్కటే. ఆ విషయం చెప్పేందుకు ఒక కథ ఉన్నది. దాన్ని మీకు వివరిస్తాను వినండి.

పూర్వకాలంలో 'క్షుపుడు' అనే మహారాజు రాజ్యం చేస్తున్నాడు. అతడు వేదవేదాంగ విధుడు. ధర్మనిరతుడు. గొప్ప విష్ణుభక్తుడు. భృగు వంశములో పుట్టిన 'దధీచి' అనే మహర్షి గొప్ప శివభక్తుడు. అయితే రాజు, మహర్షి తరచు కలుసుకుని ఆధ్యాత్మిక విషయాలపై విచారించేవాళ్ళు.

ఒకసారి మహరాజు దధీచి ఆశ్రమానికి వెళ్ళాడు. అప్పుడు ఆయనకు చిన్న సందేహం కలిగింది. దాంతో "మునీంద్రా! ఈశ్వరుడు దిక్పాలకులలో ఒకడు. విష్ణువు సర్వవ్యాప్తి, లక్ష్మీపతి. మరి విష్ణువును కాదని భిక్షమెత్తుకునేవాడు, ఇల్లు వాకిలి లేనివాడు అయిన శివుడిని ఆరాధించటం వింతగా లేదా" అన్నాడు.

ఆ మాటలు విన్న మహర్షి "రాజా! భిక్షాటన అనేది సంప్రదాయము. ఇల్లు వాకిలి లేకపోవటమంటే భవబంధనాలు లేనట్లే. శ్మశానంలో ఉంటాడు అంటే మరణాంతరము అందరూ అక్కడికే చేరతారు అని అర్థం. భస్మధారణ చేస్తాడు అంటే చివరకు మిగిలేది బూడిద అని అర్థం. ఈ విషయాలు తెలియకుండా శివుణ్ణి నిందించరాదు. అయినా కుబేరుడికి నవనిధులిచ్చిన శివుడు కాదా. వస్తువాహనములు మీద భ్రాంతి పామరుడికే గాని పరమేశ్వరుడికి ఎందుకుంటుంది?" అన్నాడు.

దాంతో రాజు కోపగించి మహర్షిని కత్తితో నరికి వెళ్ళిపోయాడు. దధీచి ఆఖరు క్షణంలో తన తాత శుక్రాచార్యుని ప్రార్థించాడు. అతడు వచ్చి దధీచిని బ్రతికించి మృతసంజీవిని మంత్రాన్ని ఉపదేశించాడు. దధీచి మంత్రజపం చేశాడు. పరమేశ్వరుడు ప్రత్యక్షమై మహర్షి కోరినట్లుగా ఆత్మరక్షణకు త్రిశూలాన్ని, వజ్రదేశాన్ని, మృత్యువు లేని జీవితాన్ని ప్రసాదించాడు.

దధీచి మహదానందించి రాజాస్థానానికి వెళ్ళాడు. అప్పుడు రాజు సభ తీర్చి ఉన్నాడు. మహర్షి కోపంతో రాజు కిరీటాన్ని ఒక్క తన్ను తన్నాడు. రాజు కూడా కోపించి తన ఆయుధంతో దధీచిని నరకబోయాడు. శూలం అడ్డుపెట్టాడు మహర్షి. నిండు సభలో అవమానం భరించలేని రాజు చేసేది లేక విష్ణువును ప్రార్థించాడు. మహర్షి శివుని ప్రార్థించాడు. శివకేశవులు ఇద్దరూ అక్కడ ప్రత్యక్షమైనారు.

కేశవుడు రాజును చూచి "రాజా! బ్రహ్మతేజము ముందు క్షాత్ర తేజము పనికిరాదు. దధీచి శివభక్తుడు. శివుడంటే ఎవరనుకున్నావు? నేనే శివుడు. శివుడే నేను. మా ఇద్దరికీ భేదం లేదు"

**మద్భక్తా శ్శంకరద్వేషీ మద్వేషీ శంకర ప్రియః**
**తావుభౌ నరకంయాతః యావచ్చంద్ర దివాకరే ॥**

నా భక్తుడు శివుని ద్వేషించినా, శివ భక్తుడు నన్ను ద్వేషించినా వారికి సూర్య చంద్రులున్నంతకాలము నరకబాధలు తప్పవు" అన్నాడు.

శివుడు దధీచిని చూసి "మహర్షీ" నువ్వు రాజును అవమానింపరాదు.

**నా విష్ణుః పృథివీపతిః**

విష్ణ్వంశ లేనివాడు రాజు కాడు. రాజులేకపోతే ధర్మ నాశనము జరుగుతుంది. కాబట్టి మీరు ఇద్దరూ హరిహరులకు భేదము లేదని గుర్తించి ఇది వరకటిలాగే సఖ్యంగా ఉండండి" అని చెప్పి అదృశ్యమైనారు. కాబట్టి శివకేశవులిద్దరికీ భేదము లేదు. వారిద్దరూ ఒకటే అంటూ శివపురాణములోని ప్రథమాశ్వాసము పూర్తి చేశాడు రత్నాకరుడు.



# తారకాసురుడు

"గురుదేవా! తారకుడు ఎవరు? అతని జన్మమెట్టిది? ఏవిధంగా సంహరించబడ్డాడో వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

దితికశ్యపుల కుమారుడు వజ్రాంగుడు. హిరణ్యకశ్యప హిరణ్యాక్షులు మరణించిన తరువాత దితి భర్తయైన కశ్యపుని చేరి సపర్యలు చేసింది. ఆ పరిచర్యలకు సంతసించి కశ్యపుడు దితిని ఏం వరం కావాలో కోరుకోమన్నాడు. 'ఇంద్రుని జయించగల కుమారుడు కావాలి' అంది దితి. తథాస్తు అన్నాడు కశ్యపుడు. దితి గర్భవతి అయ్యింది. తనను చంపబోయేవాడు దితి గర్భాన పుట్టనున్నాడని తెలిసిన ఇంద్రుడు సమయం చూసి, దితి అశుచిగా ఉన్నప్పుడు గర్భంలోని పిండాన్ని ముక్కలు ముక్కలుగా నరికేశాడు. ఆ పిండము 49 ముక్కలైంది. దితి కోరిక మీద వారందరినీ బ్రతికించాడు ఇంద్రుడు. వారే మరుత్తులు. దేవతల పక్షాన యుద్ధం చేశారు.

మరుత్తుల తరువాత మహాబలశాలి అయిన కుమారుని కోసం దితి పరమేష్టిని గూర్చి పదివేల సంవత్సరాలు తపస్సు చేసింది. దితి కశ్యపులకు బ్రహ్మదేవుని వరం వల్ల వజ్రకాయుడు జన్మించాడు. అతడి పేరే వజ్రాంగుడు. తన అన్నల చావుకు కారణము ఇంద్రుడు అని తెలిసి, అసుర సేనలను సమాయుత్తపరచి యుద్ధంలో ఇంద్రుని ఓడించి బందీగావించాడు. ఆ తరువాత బ్రహ్మదేవుడు చెప్పిన మీదట ఇంద్రుని చెర విడిపించాడు. ఆ తరువాత బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు 'వరాంగి' అనే కన్యను వివాహమాడాడు.

కొంత కాలానికి వరాంగి 'దేవతలకు సింహస్వప్నము వంటి కుమారుడు కావాలని అడిగింది'. భార్య కోరిక తీరుస్తానన్నాడు వజ్రాంగుడు. వజ్రాంగుడు, వరాంగిల కుమారుడే తారకాసురుడు. తారకుడు గర్భంలో ఉండగానే దేవతలకు అనేక దుశ్శకునాలు కనిపించినాయి. భూమి కంపించింది. దిక్కుల యందు మంటలు రేగినాయి. తోకచుక్కలు పొడిచినాయి. సుడిగాలులు రేగినాయి. చీకటి రాత్రులందు గుడ్లగూబలు అరచినాయి. కుక్కలు, నక్కలు మొరలు ఎత్తి అరచినాయి. వజ్రాంగి కుమారుణ్ణి కన్నది. అతడికి తారకుడు అని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచారు తల్లిదండ్రులు.

తల్లి కోరిక మీద తారకుడు బ్రహ్మను గూర్చి ఘోరతపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకో అన్నాడు. చావు లేకుండా వరం కావాలన్నాడు తారకుడు. నాకు లేనిది నీకెలా ఇవ్వగలను. నేనే శాశ్వతం కాదు. కల్పము పూర్తికాగానే నేను కూడా పరబ్రహ్మలో లీనమైపోతాను. కాబట్టి ఇంకేదైనా కోరుకోవలసినది అన్నాడు బ్రహ్మ. ఆలోచించాడు తారకుడు. 'సరే, నీ సృష్టిలో ఇంతవరకూ ఉన్న ఏ ప్రాణివల్లా నాకు మరణం లేకుండా వరమియ్యి' అన్నాడు. తథాస్తు అన్నాడు బ్రహ్మ.

వరబలగర్వముతో తారకుడు తిరిగి వచ్చాడు. అంతవరకు దిక్కు లేకుండా పోయిన అసుర సేననంతటినీ ప్రోగుచేసి, దేవతల మీద యుద్ధానికి వెళ్ళాడు. స్వర్గాధిపత్యాన్ని

గెలిచాడు. దేవతలనందరినీ నానా బాధలు పెట్టసాగాడు. తపస్సు చేసుకునే మునులను, ఋషులను హింసించాడు. ఒకటేమిటి? ధర్మాన్ని నాశనం చెయ్యటానికి కంకణం కట్టుకున్నాడు.

తారకుని బాధలు పడలేక దేవతలందరూ పోయి బ్రహ్మదేవుని ప్రార్థించారు. 'తారకుని సంహరించటం నా వల్ల కాదు. విష్ణువు దగ్గరకు వెళ్ళండి' అన్నాడు. విష్ణుమూర్తి దేవతల గోడు విని తారకుడికి ఇంతవరకు సృష్టిలో ఉన్న ఏ ప్రాణివల్లా మరణం రాదు. కాబట్టి మనమంతా ఆ పరమేశ్వరిని వేడుకుందాం.

ఆమె హిమవంతుని గర్భాన జన్మించి శివుణ్ణి వివాహం చేసుకోవాలి. వారికి పుట్టిన కుమారుని వల్లనే తారకాసుర సంహారం జరగాలి అన్నాడు.

దేవతలంతా హిమాలయాలకు వెళ్ళి పరమేశ్వరిని ప్రార్థించారు. చైత్ర శుద్ధ నవమి శుక్రవారం ఆ దేవి వారికి ప్రత్యక్షమైంది. ఆమెను తన ఇంట జన్మించమని ప్రార్థించాడు హిమవంతుడు. అందుకు ఒప్పుకున్నది పరమేశ్వరి.

హిమవంతుని భార్య మేనక. ఇక్కడ మేనక అంటే అప్సరాంగన కాదు. దక్ష ప్రజాపతి కుమార్తెలలో 'స్వధా' అనే ఆమెను పితృదేవతలకిచ్చి వివాహం చేశాడు. ఆమెకు ముగ్గురు కుమార్తెలు. మేనక, ధన్య, కళావతి. వీరు అతిలోక సౌందర్యవతులు. వీరి సందర్శనము సకల శుభదాయకము. వీరు లోకమాతల వలె గౌరవించబడుతున్నారు.

ఒకసారి వీరు ముగ్గురు లక్ష్మీనారాయణులతో ముచ్చటిస్తుండగా, సనకసనందనాదులు ఏతెంచారు.వారిని ఈ ముగ్గురు కన్యలు సరిగా గౌరవించలేదని మహర్షులు కోపగించి, 'మీరు భూలోకమున జన్మింతురు గాక' అని శపించారు. ఈ కన్యలు తమ తప్పు క్షమించమని మహర్షులను ప్రార్థించగా వారు కనికరించి, మేనక గర్భాన - పార్వతి, ధన్య గర్భాన - సీత, కళావతి గర్భాన రాధ జన్మిస్తారు. ఆ రకంగా వీరు ఎనలేని ఖ్యాతి పొందుతారు అని వరమిచ్చారు.

బ్రహ్మదేవుని సూచన మేరకు హిమవంతుడు మేనకను వివాహం చేసుకున్నాడు. మేనకా హిమవంతులకు ఒక కుమార్తె జన్మించింది. ఆమెకు పార్వతి అని నామకరణం చేశారు తల్లితండ్రులు.

ఒకనాడు నారద మహర్షి హిమవంతుడి వద్దకు వచ్చాడు. అప్పుడు పార్వతి జాతకం చూపించి తన బిడ్డకు భర్త ఎవరో చెప్పమన్నది మేనక. నారదుడు ఆ జాతకం చూసి 1) బిడ్డకు భర్త ఇంతవరకు పుట్టి ఉండలేదు, 2) ఈమె చేతులు ఎప్పుడూ పైకెత్తబడే ఉంటాయి అన్నాడు. ఈ మాటలకు భయపడ్డ హిమవంతుడు మహర్షిని వివరణ కోరారు.

ఈ బిడ్డకు భర్త ఇంతవరకూ పుట్టలేదు అంటే, అతడికి జన్మ అంటూ లేదు. జనన మరణములు లేని పరమేశ్వరుడే ఈమె భర్త.

చేతులు ఎల్లప్పుడూ పైకెత్తబడే ఉంటాయి అంటే - ఈమెకు ఇవ్వటమే కాని పుచ్చుకొనటం తెలియదు అని అర్థం చెబుతాడు నారదుడు.

పార్వతీదేవి దినదినప్రవర్ధమానమైంది. శివపూజలు, శివారాధన, శివనామస్మరణ, శివసంకీర్తనలే ఆమె నిత్యకృత్యాలు. నిరంతరము శివుని తప్ప అన్యునితన మనసు నందైనా తలపదు. ఆమెకు యుక్తవయస్సు వచ్చింది. తగిన సంబంధం చూడమని పురోహితులకు చెప్పాడు హిమవంతుడు. శివుని తప్ప ఇతరులను వివాహమాడను అని ఖచ్చితంగా చెప్పేసింది పార్వతి.

దక్షయజ్ఞ సమయంలో యోగాగ్నిలో దగ్ధమైపోయింది సతీదేవి. భార్యా వియోగంతో విరాగియైన ఈశ్వరుడు హిమాలయాలలో తపస్సు చేసుకుంటున్నాడు.

ఇక్కడ పార్వతీదేవి శివుణ్ణి గురించి తపస్సు మొదలుపెట్టింది. నిద్రాహారాలు మానివేసింది. కొంతకాలం ఆకులు, అలములు తిన్నది. తరువాత వాటిని కూడా విసర్జించింది. కేవలము వాయుభక్షణ చేస్తున్నది. శివుడు కనికరించలేదు. ఇక ఇలా లాభం లేదు అనుకుని వేసవికాలంలో చుట్టూ మంటలు పెట్టుకుని, చలికాలంలో పీకలోతు నీళ్ళలో మునిగి తపస్సు చేసింది. పరమేశ్వరుణ్ణి చలింపచెయ్యటానికి మన్మధుడు ప్రయత్నించాడు. సాధ్యం కాలేదు. చివరకు మన్మధుడు కూడా భస్మమైపోయాడు. దేవతలంతా వెళ్ళి ఈశ్వరుణ్ణి పరిపరివిధాల ధ్యానించి, తారకాసురుని వృత్తాంతమంతా వివరించి, దేవదేవా! నువ్వు పార్వతీదేవిని వివాహమాడాలి. మీకు పుట్టిన కుమారుడు తారకుని సంహరిస్తాడు మా మొరాలించు అని వేడుకున్నారు. వారి కోరిక మన్నిస్తానన్నాడు శివుడు.

ఒకరోజు బ్రహ్మచారిగా వేషం ధరించి పార్వతి తపోవనానికి వచ్చాడు. వచ్చినవాడు పార్వతి సత్కారాలందుకొని, ఆమెను పరీక్షించటం మొదలుపెట్టాడు.

వటువు : ఎగుడు దిగుడు మూడు కన్నులున్నవాడి మీద నీకు మక్కువ ఎందుకు?

పార్వతి : మూడవ కన్ను జ్ఞాన నేత్రము. అతడు మహాజ్ఞాని.

వటువు : బిచ్చమెత్తుకు తిరిగే జంగందేవర నిన్ను ఏమి సుఖపెడతాడు?

పార్వతి : సిరిసంపదలు అశాశ్వతములు అని విరాగియైన మహానుభావుడు.

వటువు : బూడిద పూసుకు తిరిగేవాడు. కడు దరిద్రుడు కదా శివుడు.

పార్వతి : కుబేరునికే నవనిధులు దానం చేసినవాడు దరిద్రుడెలా అవుతాడు.

వటువు : కట్టబట్టలేనివాడు, దిగంబరి.

పార్వతి : దిక్కులే అంబరముగా గలవాడు ఆ పరమేశ్వరుడు.

వటువు : పుట్టుపూర్వోత్తరాలు లేనివాడు. తల్లిదండ్రులు ఎవరో తెలియదు.

పార్వతి : అసలు పుట్టుకేలేనివాడు, సర్వలోకాలకు అతడే తండ్రి. అతనికి తల్లిదండ్రులు లేరు.

ఈ విధంగా అనేక ప్రశ్నలు వేసి, పార్వతి చెప్పిన సమాధానాలకు సంతృప్తి చెంది చివరకు ఆమెను వివాహమాడాడు.

పార్వతీపరమేశ్వరులకు కుమారస్వామి జన్మించాడు. అతణ్ణి దేవసైన్యాధిపతిగా నియమించారు. దేవ సైన్యాన్ని వెంటపెట్టుకుని తారకునితో యుద్ధానికి వెళ్ళాడు కార్తికేయుడు. ఘోరమైన యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో శక్త్యాయుధంతో తారకాసురుని సంహరించాడు కుమారస్వామి అంటూ కుమారస్వామి జననము, తారకాసుర సంహారాన్ని గురించి శిష్యులకు వివరిస్తూ ద్వితీయ, తృతీయాశ్వాసాలను పూర్తి చేశాడు రత్నాకరుడు.



# కుమారస్వామి

"గురువర్యా! కుమారస్వామి చేతిలో తారకుడు మరణించాడు అన్నారు కదా! అసలు కుమారస్వామి వృత్తాంతము ఏమిటి? షణ్ముఖుడు అంటే ఎవరు? కుమారస్వామికి ఎందరు భార్యలు? ఈ వివరాలన్నింటినీ మాకు తెలియచేయవలసినది" అని అడిగాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

సాక్షాత్తు పరమేశ్వరి హిమవంతుని కుమార్తెగా పుట్టి హైమవతి అనబడింది. పర్వతరాజు కుమార్తె కాబట్టి పార్వతి అనబడింది. శివపార్వతుల వివాహం నిశ్చయమైంది. ఆ వివాహానికి దేవతలు, యక్షులు, గంధర్వులు, కిన్నెరలు, సాధ్యులు, కింపురుషులు, అప్సరాగణము అంతా విచ్చేసింది. వివాహానికి విచ్చేసినవారందరూ యథావిధిగా చందన తాంబూలాది సత్కారములు అందుకుని ఎవరు స్థానాలకు వారు వెళ్ళిపోయారు.

ఆ తరువాత నందీశ్వరుడు పార్వతీదేవిని చూసి "అమ్మా! ఇంతకాలము కఠోరమైన నియమాలతో తపస్సు చేసి ఉన్నావు. కాబట్టి శరీరము బాగా అలసిపోయి ఉంటుంది. అందులోనూ వివాహ వేడుకలు. అందుచేత మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి. వెండి కొండ మీద నవరత్నములు తాపడము చేసిన పడకగది మీకోసం ఎదురుచూస్తోంది" అన్నాడు. ఆ మాటలు విన్నదే తడవుగా పార్వతీ పరమేశ్వరులు పడకగది ప్రవేశించారు.

ఆ గది చాలా అందంగా అలంకరించబడింది. నందీశ్వరుడు అత్యంత శ్రద్ధాశక్తులతో దాన్ని అలంకరించాడు. ఆ గది సర్వాలంకారశోభితమై అలరారుతున్నది. పన్నీటి ఘుమఘుమలు, కస్తూరి మొదలైన పరిమళ ద్రవ్యములు సువాసనలు వెదజల్లుతున్నాయి. నవరత్నాలతో రంగవల్లులు తీర్చిదిద్దారు. అందమైన చిత్రాలు వేశారు.

సువాసనలు వెదజల్లే మల్లె, జాజి, సంపెంగ ఇత్యాది పూలతో అలంకరించారు. ఆ గది మధ్యలో హంసతూలికా తల్పము. దానిపైన పూలపాన్పు. ఇంత ఎందుకు అందులో ప్రవేశించినవాడు విరాగియైనప్పటికి, మరుక్షణంలో సరాగి కావలసినదే. శృంగారానుభూతి కలిగి తీరవలసినదే. పార్వతీ పరమేశ్వరులు ఆ గదిలో ప్రవేశించారు. కేళీమందిరము దరిదాపులకు కూడా ఎవరినీ రానివ్వవద్దు అని శాశించాడు శంకరుడు. శివుని ఆజ్ఞను శిరసావహించాడు నందీశ్వరుడు.

రాజహంసలు మానససరోవరములో ప్రవేశించినట్లుగా శయ్యామందిరంలో ప్రవేశించారు. మన్మథక్రీడలతో తేలియాడుతున్నారు. రోజులు, నెలలు, సంవత్సరాలు, యుగాలు గడిచిపోతున్నాయి. కాని వారికిమాత్రం కాలమంతా క్షణములు జరిగినట్లు ఉన్నది.

తారకాసురుడు దేవతలను ముప్పతిప్పలు పెడుతున్నాడు. చివరకు దేవతలకు త్రాగటానికి నీరు కూడా లేకుండా చేశాడు. ఆ బాధ భరించలేని దేవతలు బ్రహ్మ వద్దకుపోయి "పరమేష్టీ! రాక్షసులు తపస్సు చేస్తున్నారు. వారు కోరిన కోరికలు నీవు తీరుస్తున్నావు. ఆ వరబలంతో వారు దేవతలైన మమ్ములను నానా హింసలు పెడుతున్నారు. మేము తారకుని బాధలు పడలేకుండా ఉన్నాము. ఏ రకంగానైనా సరే మమ్మల్ని రక్షంచవలసినది" అని వేడుకున్నారు.

బ్రహ్మ దేవతలను చూసి "పుణ్యాత్ములారా! మీ బాధలను నేను అర్థం చేసుకోగలను. తపస్సు చేసినవాడికి వరము ఇవ్వకుండా ఉండటం కానిపని. నేను ప్రత్యక్షం కాలేదనుకో? ఆ తపస్వి ఇంకా ఘోరమైన తపస్సు చేస్తాడు. ఆ వేడికి లోకాలన్నీ బూడిద అయిపోతాయి. కాబట్టి లోకాలు రక్షించటానికైనా సరే నేను ఆ తపస్వికి ప్రత్యక్షం కావాలి. ఇప్పుడు తారకుడు లోకకంటకుడైనాడు. అతన్ని సంహరించే మార్గం విష్ణుమూర్తే చెప్పాలి. మనమందరం కలిసి శ్రీహరి వద్దకు వెడదాము రండి" అన్నాడు.

బ్రహ్మదేవుడు ముందు నడవగా, అష్టదిక్పాలకులు, 33 కోట్లమంది దేవతలు, మహర్షులు, మునీశ్వరులు అందరూ ఆ శ్రీహరి సందర్శనార్థము వైకుంఠానికి బయలుదేరారు.

వైకుంఠ ద్వారము సమీపించగానే "ఆపద్బాంధవా! వైకుంఠవాసా! శరణు శరణు" అంటూ ఆర్తనాదాలు చేశారు. విన్నాడు విష్ణువు. పరిస్థితి అర్థమైంది. తారకుని బారి నుండి రక్షించమని అడుగుతున్నారు. అప్పుడు శ్రీ మహావిష్ణువు "దేవతలారా! పార్వతీ పరమేశ్వరులు ఏకాంత మందిరములో ఉన్నారు. ఇప్పుడు శివుని వీర్యము వలన ఉదయించే కుమారుడే తారకుని సంహరించగలడు. వెయ్యి దివ్య సంవత్సరములు జరిగితే గాని శివునకు వీర్యస్కలనము కాదు. అయితే అంతవరకు వేచి ఉండటం చాలా కష్టమైన పని. అయితే దీనికి ఒక మార్గమున్నది. పరమేశ్వరుని వీర్యము పార్వతీదేవి గర్భమున పతనం కాకుండా నిరోధించండి' అప్పుడు మీ పని తేలిక అవుతుంది.

అయితే స్త్రీ పురుషులు కామ వ్యాపారములో ఉన్నప్పుడు వారికి అంతరాయము కలిగించటమనేది నీచాతి నీచమయిన పని. దానివల్ల మహాపాపము కూడా వస్తుంది. దీనికి చిన్న కథ ఒకటి చెబుతాను వినండి.

పూర్వకాలములో దేవేంద్రుడు ఒకసారి తన నందనోద్యానవనంలో రంభతో కామకేళీ విలాసాలలో ఉన్నాడు. అదే సమయములో దుర్వాసమహర్షి ఇంద్రుని దర్శనార్థమై స్వర్గానికి వచ్చాడు. వచ్చిన మహర్షి ఉద్యానవనములో రంభ, ఇంద్రులను చూశాడు. అటువంటి సమయంలో చూసినా, చూడనట్లుగా వెనక్కి వెళ్ళిపోవాలి కాని ఉర్వాసుడు వారి దగ్గరకు పోయి నుంచున్నాడు. ఇంద్రుని బాహువులను వదిలించుకుని రంభ వెళ్ళి దూరంగా నుంచుంది. ఈ రకంగా వారి కలాపానికి విఘ్నము జరిగింది. ఈ పాపము దుర్వాసుడికి తగిలింది. అతడి భార్యవెయ్యి సంవత్సరాలు జబ్బు చేసి మంచమెక్కింది. అప్పుడు దుర్వాసుడు చండిక అనే ఇంకొక స్త్రీని వివాహమాడాడు. కాని ఈ పాపపు మహత్యం వల్ల ఆమెతో కూడా కాపురం చెయ్యలేకపోయాడు. కాబట్టి ఈ విషయంలో చాలా జాగ్రత్తగా వ్యవహరించండి" అన్నాడు.

పార్వతీ పరమేశ్వరులు ఆనందసముద్రంలో ఓలలాడుతున్నారు. ఈ విధంగా వెయ్యి సంవత్సరాలు దాటిపోయింది. తారకుని ఆగడాలు మితిమీరిపోతున్నాయి. లోకాలు గడగడలాడిపోతున్నాయి. ముల్లోకవాసులు ఈ ముప్పును భరించలేక పరుగు పరుగున పరమేష్ఠి దగ్గరకు పోయి, అతనితో సహా శ్రీహరి కాళ్ళ మీద పడ్డారు. విష్ణుమూర్తి బ్రహ్మదేవునితో సహా దేవతలందరినీ వెంటపెట్టుకుని కైలాసం వెళ్ళాడు. యథాప్రకారము పార్వతీపరమేశ్వరులు మన్మథ సామ్రాజ్యాన్ని ఏలుతున్నారు. బయట నందీశ్వరుడు కాపలా ఉన్నాడు. విష్ణుమూర్తి నందీశ్వరుని చూసి "పరమేశ్వరునితో అత్యవసరమైన పని ఉన్నది. లోపలికి వెడతాము" అన్నాడు. 'లోపలికి వెళ్ళటానికి చీమను కూడా అనుమతించవద్దని పరమేశ్వరుని ఆజ్ఞ" అన్నాడు నందీశ్వరుడు.

లక్ష్మీకాంతుడు తనతో వచ్చిన దేవతలతో "దేవతలారా! శివుని ఆజ్ఞను ధిక్కరించటానికి లేదు. అలా అని మనం వెనక్కి తిరిగి వెళ్ళిపోవటానికి అంతకన్నా లేదు. కాబట్టి యుక్తియుక్తముగా ఒక పని చేద్దాము. ఒక శివలింగాన్ని మట్టితో తయారుచేసి, దానికి అభిషేకములు చేసి, బిల్వదళాలతోను, తుమ్మి పూవులతోను పూజలు చేసి ధూప, దీప, నైవేద్యములు సమర్పిద్దాము. అప్పుడు భక్తవత్సలుడైన శంకరుడే మనముందు ప్రత్యక్షమవుతాడు." అన్నాడు.

విష్ణువు చెప్పినదే తడవుగా దేవతలందరూ మట్టితో తలా ఒక శివలింగము తయారుచేసి, దానిని తమ అరచేతులలో ఉంచుకొని, యధావిధిగా అర్చించారు. ధూప, దీప నైవేద్యములనిచ్చి మంగళహారతులు సమర్పించారు. "శంకరా! భక్తవశంకరా! పాహి పాహి, రక్షమాం" అంటూ నినాదాలు చేశారు. భక్తవ శంకరుడైన పరమేశ్వరుడు దేవతల భక్తి ప్రపత్తులకు సంతసించి పార్వతిని వదిలి, వారిముందు ప్రత్యక్షమై "దేవతలారా! మీరు వచ్చిన పని ఏమి?" అన్నాడు. అప్పుడు దేవతలంతా ముక్తకంఠంతో "దీనబంధూ ! ఆశ్రితవత్సలా ! అనాథ రక్షకా ! పాహిమాం ! పాహిమాం ! స్వామీ, తారకాసురుని బాధల పడలేకుండా ఉన్నాము. ఆ దుర్మార్గుడు నీ వీర్యమున పుట్టిన కుమారుని వల్ల తప్ప అన్యులచే మరణించడు. అతడు మరణిస్తే గాని లోకాలు శాంతించవు. కాబట్టి మమ్మల్ని రక్షించు" అన్నారు. దేవతల పలుకులాలకించిన పరమేశ్వరుడు తన వీర్యమును అగ్నిగుండంలో వదిలిపెట్టాడు.

పార్వతీదేవి శయ్యామందిరము నుండీ బయటకు వచ్చి జరిగిన సంగతి తెలుసుకుని "దేవతలారా! మీరు చేసిన పని మూలంగా నా గర్భాన జన్మించవలసిన బాలునకు అవాంతరము ఏర్పడింది. కాబట్టి ఇక నుంచీ మీ భార్యలయందు మీకు కూడా సంతానము ఉండదు" అని శపించింది. పరమశివుడు పరిపరివిధాల పార్వతికి నచ్చచెప్పి, మళ్ళీ ఆమెను శయ్యామందిరానికి తోడ్కొనిపోయాడు.

ఒకసారి సప్తఋషులు దేవతల ప్రీతి కోసం యజ్ఞం చేస్తున్నారు. యజ్ఞం పూర్తి కావచ్చింది. సప్తఋషులు తమ భార్యలతో కలిసి పూర్ణాహుతులు అర్పిస్తున్నారు. అగ్ని యొక్క జ్వాలలో మునికాంతల మోములు కళకళలాడుతున్నాయి. వారి అందచందాలు చూసి మోహపరవశుడైనాడు, అగ్నిదేవుడు. క్రమేణా విరహాగ్నిలో వేగిపోతున్నాడు. భర్త యొక్క పరిస్థితిని అర్థం చేసుకుంది అగ్నిదేవుని భార్యయైన స్వాహాదేవి. ఏ రకంగానైనా సరే తన భర్తను శాంతపరచాలి అనుకున్నదై, ఒక్కొక్కసారి ఒక్కొక్క మునిపత్ని రూపం ధరించి అగ్నిదేవుని చేరి సుఖించింది. ఆయనను సంతోషపెట్టింది. ఈ రకంగా ఆరు రూపాలు ధరించింది కాని వశిష్టుని భార్య అరుంధతి రూపం మాత్రం ధరించలేదు.

ఇలా ఆరుగురు ముని పత్నుల రూపంలో అగ్నితో కలిసినప్పుడు, అగ్నిలో దాగి ఉన్న శివుని వీర్యము ఆరు రూపాలుగా స్వాహాదేవి యందు ప్రవేశించింది. స్వాహాదేవి శివుని వీర్యాన్ని భరించలేక, దాన్ని కైలాసము మీద ఒక శిఖరాన వదిలివేసింది. గాలి కదలికల చేత ఆ వీర్యము ఆకాశగంగ యందు చేరింది. గంగ కూడా శివుని వీర్యాన్ని భరించలేక ప్రవాహ రూపములో ఆరు పాయలుగా చీలి, నదీతీరము నందు గల రెల్లుదుబ్బులలో ఆ వీర్యాన్ని వదిలివేసింది. ఆ రెల్లుగడ్డియందే బాలుడు జన్మించాడు.

శరము అనగా - రెల్లుగడ్డి. ఆ రెల్లుగడ్డియందు జన్మించాడు కాబట్టే కుమారస్వామి 'శరజన్ముడు' అని పిలువబడ్డాడు.

మార్గశిరశుద్ధ షష్ఠీ, ధనిష్ఠా నక్షత్రయుక్త వృశ్చిక లగ్నములో రెల్లు దుబ్బులలో వదలబడిన శివుని వీర్యము పరిపక్వము చెంది ఒక బాలుడు జన్మించాడు. అతడికి ఆరు తలలు, పన్నెండు చేతులు ఉన్నాయి. మణిమయ కిరీటాది ఆభరణములతో, దివ్యశస్త్రాస్త్రములతో అలరారుతున్నాడు. చతుర్వేదాలు, ఆయుర్వేదము, ఓంకారములను ఆరు ముఖాలతోనూ వల్లెవేస్తున్నాడు. అతడిది వజ్రకాయము. ఈ బాలుడు జన్మించగానే దేవతలు పూలవాన కురిపించారు. ఇతడే కుమారస్వామి. ఇతడు జన్మించగానే మునిపత్నులు అగ్నిహోత్రునితో రహస్యముగా కలిశారనే అపవాదు వచ్చింది. మహర్షులు వారి భార్యలను ఇంటి నుంచి వెళ్ళిపొమన్నారు.

మునిపత్నులు ఇళ్ళు వదలి గంగానది తీరము చేరి, రెల్లు దుబ్బులలో ఉన్న పాపడిని చూశారు. ఆ బాలుని చూడగానే వారి స్తనములనుండి స్తన్యము స్రవించింది. అప్పుడు వారందరూ ఆ బాలును దగ్గరకు తీసుకుని అతడికి స్తన్యము నిచ్చి, తమకు వచ్చిన అపవాదు విన్నవించి, తమను రక్షించమని అడిగారు. వారందరికీ అభయమిచ్చాడు షణ్ముఖుడు. బ్రహ్మదేవుడు కుమారస్వామికి 'స్కందుడు' అని నామకరణం చేశాడు. ఆరుగురు మునిపత్నులను 'కృత్తికలు' అంటారు. షణ్ముఖునికి కృత్తికలు స్తన్యమునిచ్చారు. కాబట్టి అతడు 'కార్తికేయుడు' అనబడ్డాడు.

కుమారుడు దినదిన ప్రవర్థమానుడవుతున్నాడు. సింహశార్దూలాది మృగాలే అతడికి ఆట వస్తువులు. శివధనుస్సును అవలీలగా ఎత్తి, సంధించి, బాణములేయగా హిమాలయ పర్వతాలలోని ఒక శిఖరము ఎగిరి పోయింది. ఇంకో బాణంతో క్రౌంచ పర్వతాన్ని ముక్కలు చేశాడు. విలువిద్యాభ్యాసము చేసే రోజులలోనే అనేకమంది రాక్షసులను సంహరించాడు. ఈ విషయం దేవేంద్రుడికి తెలిసి, తనకన్న బలమైనవాడు దేవతలలో ఉద్భవించాడేమో? ఎందుకయినా మంచిది. అతణ్ణి అంతం చేద్దామని వజ్రాయుధాన్ని కుమారస్వామి మీదికి ప్రయోగించాడు. వజ్రాయుధం యొక్క వోయింది. అప్పుడు కుమారస్వామి దేహములో

వక్షస్థలము నుండి - విశాఖుడు
కుడిపార్శ్వము నుండి - శాఖుడు
ఎడమ పార్శ్వము నుండి - నైగమాఖ్యుడు

జన్మించారు. బలపరాక్రమాలలో వారికి వారే సాటి. వారు ముగ్గురు బయలుదేరి'ఇంద్రుని బందీగా చేసి తెచ్చి కుమారుని ముందు నిలబెట్టారు. శరవణభవుడు ఇంద్రుని క్షమించి వదిలేశాడు.

ఒకరోజున పార్వతీ పరమేశ్వరులు కొలువుతీరి ఉన్నప్పుడు బ్రహ్మదేవుడు కుమారస్వామికి దేవసేన అనే కన్యకూ వివాహం చెయ్యమని సలహా ఇచ్చారు. ఏకాదశినాడు దేవసేన కుమారస్వామిని దేవతలకు సేనానిగా ఎన్నుకున్నారు. త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు 'తథాస్తు' అన్నారు. దేవతలందరూ వారి వారి ఆయుధాలను కుమారస్వామికి ఇచ్చారు. ఆ సమయంలో పరమేశ్వరుడు కుమారస్వామితో "కుమారా! నీ శౌర్యప్రతాపాలతో రాక్షస సంహారము చేసి దేవతలను రక్షించవలసినది. ధర్మ సంస్థాపన చెయ్యవలసినది". తారకాసురుడు నరబల గర్వముతో విర్రవీగుతున్నాడు. అతడిని సంహరించి దేవతలకు శుభము చేకూర్చవలసినది" అన్నాడు. దేవసైన్యాన్ని వెంట పెట్టుకుని తారకుడు నివశించే శోణితపురము పైకి దండయాత్రకు బయలుదేరాడు షణ్ముఖుడు. రణభేరులు మ్రోగినాయి. భేరీ భాంకారాలకు దిక్కులు పిక్కటిల్లినాయి. రాక్షసుల గుండెలు అదిరి పోయినాయి.

శోణిత పురాన్ని ముట్టడించారు దేవతలు. ధర్మపద్ధతి ప్రకారము విశాఖుడిని రాయబారం పంపారు. విశాఖుడు తారకాసురుని సభకి వెళ్ళి "దానవేంద్రా, నువ్వు లోకంలో దేవతలను ఓడించావు. ధర్మాన్ని నాశనం చేశావు. అది చాలదన్నట్లు దేవతలను, మునులను, సాధు పుంగవులను నానాబాధలు పెడుతున్నావు. నీకు ఇది తగదు. ఇంతవరకు జరిగిన దాన్ని వదిలెయ్యి. ఇక నువ్వు పాతాళానికి వెళ్ళి భోగవతీ పురాన్ని ఏలుకో. స్వర్గాన్ని దేవతలకు ఒప్పగించు. లేదా నీ వంశ నాశనం జరుగుతుంది. షణ్ముఖుడు నిన్ను సంహరించటానికి సిద్ధంగా ఉన్నాడు" అని చెప్పాడు. ఆ మాటలు విన్న తారకాసురుడికి ఒక ప్రక్క నవ్వు, ఇంకొక ప్రక్క కోపము వచ్చినాయి. అతడు విశాఖుడితో "ఔరా! నిన్నగాక మొన్న పుట్టిన షణ్ముఖుని చూసుకునా దేవతల కింత మిడిసిపాటు?" అనుకుని మంత్రి మండలిని సలహా అడిగాడు. వారు "రాజా! తమ ధాటికి తట్టుకోలేక దేవతలు తలొక దిక్కుకూ పరుగెత్తారు. అటువంటి వారికి భయపడి మనం పాతాళానికి పోవటమా? తమరు అనుజ్ఞ ఇవ్వండి. రాక్షససేనలు దేవతల మీద విరుచుకు పడతాయి" అన్నారు. తారకుడికి మంత్రుల సలహానచ్చింది. మరునటి రోజు రణరంగములో కలుద్దామని దేవతలు సమాధానం పంపాడు తారకుడు.

మర్నాడు తెల్లవారింది. దేవదానవ సైన్యాలు రణరంగములో ఎదురెదురుగా నిలిచాయి. కుమారస్వామి సైన్యానికి శిరోభాగాన ఉన్నాడు. దిక్పాలకులు పార్శ్వభాగాల యందున్నారు. ఈ రకంగా వ్యూహం నిర్మించారు. తారకుడు దేవతలకు ధీటుగా పద్మవ్యూహము నిర్మించాడు. దాని మధ్యన తారకుడు, పార్శ్వములయందు బాణాసురుడు, ప్రలంబాసురుడు నిలిచారు. దేవదానవ సంగ్రామం మొదలైంది. యుద్ధభూమిలో విరిగిపోయిన రథాలు, శరీర భాగాలు తెగిన యోధులు, తలలు తెగిన సైనికులు, సైనికుల ఆయుధాలకు బలైపోయిన ఏనుగులు, గుర్రాలు, రక్తం కాలువలు కట్టి ప్రవహిస్తున్నది. భయంకరంగా ఉన్నది పరిస్థితి.

తారకుడు విజృంభించాడు. అతడి దెబ్బకు ఆగలేని దేవతలు కుమారస్వామిని శరణు కోరారు. కుమారస్వామి దేవసైన్యానికి ధైర్యము చెబుతున్నాడు. వారిలో ఉత్సాహం రేపుతున్నాడు. యుద్ధానికి పురి కొల్పుతున్నాడు.

ప్రలంబాసురుడు - కుమారస్వామితోను

తారకుడు - వీరభద్రునితోను

దంభుడు - అగ్నితోను

జంభాసురుడు - శమనునితోను

అతిబలుడు - ఈశ్వరునితోను

శంభాసురుడు - కుబేరుడితోను

కుంభ, కుంజరాసురులు - సూర్యచంద్రులతోను

యుద్ధానికి తలపడ్డారు. వారి మధ్య భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ మరునాటి ఉదయం తారకాసురుడు చక్ర వ్యూహాన్ని పన్నాడు. షణ్ముఖుడు పద్మవ్యూహాన్ని పన్నాడు. కుమారస్వామి మహాపాసుపతాస్త్రాన్ని ప్రయోగించాడు. అది కనిపెంచిన దానవ వీరులందరినీ భస్మం చేస్తోంది. రాక్షసులు పారిపోయి సముద్రంలో దాక్కున్నారు. పాశుపతము తిరిగి వచ్చేసింది. నారాయణాస్త్రము, పాశుపతాస్త్రములు పారిపోయే వారిని సంహరించవు. ఈ రకంగా రణభూమి నుంచి పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాడు తారకాసురుడు.

తారకాసురుడు యుద్ధభూమి నుండి ఇంటికి పారిపోయాడు. ఇదివరకెన్నడూ ఇలాంటి పరాభవాన్ని చూడలేదు. కోపంతో ఊగిపోయాడు. కాని చేసేది ఏమీలేదు. శివలింగాన్ని ప్రతిష్ఠించి నియమనిష్ఠలతో పూజించాడు. పంచాక్షరీ మంత్రాన్ని జపించాడు. ఇప్పుడు శత్రు సంహారం కావాలి. అందుకని నువ్వులు, జిల్లేడు పూలతో పార్థివ లింగాన్ని అర్చించాడు. తారకుని అర్చనలు అందుకున్నాడు శివుడు. ప్రసన్నుడైనాడు. తారకుని ఎదుట ప్రత్యక్షమైన

శివుడు "తారకా! బ్రహ్మదేవుని అర్చించి ఏ వరములు పొందావో, అవన్నీ సఫలీకృతము కాబోతున్నాయి. నువు కోరుకున్న విధంగానే మరణము ఆసన్నమవుతున్నది. కర్మఫలము తప్పింప సాధ్యముకాదు. అయినప్పటికీ పార్థివ లింగాన్ని అర్చించావు కాబట్టి నీకు శాశ్వత కైవల్యము ప్రసాదిస్తున్నాను" అన్నాడు. ఆ మాటలు విన్న తారకుడు "దేవదేవా! నీ సంకల్పము ఏ విధంగా ఉంటే ఆ విధంగానే జరగనివ్వు. నేను చాలాకాలం రాజ్యం చేశాను. ముల్లోకాలను ఏలాను. నేను పొందని భాగ్యము గాని, అనుభవించని సుఖము కాని లేవు. తీరని కోరికలు అసలేలేవు. అయినప్పటికీ నాదొక చిన్న విన్నపము. నా మెడలో వ్రేలాడుతున్న ఈ శివలింగము, నా కంఠంలో ఊపిరి ఉన్నంతవరకు నిత్య పూజలందుకున్నది. నా తదనంతరము కూడా ఈ లింగము శాశ్వత పూజలందుకొనేలా వరమియ్య వలసినది" అన్నాడు. 'తథాస్తు' అన్నాడు శివుడు.

మర్నాడు ఉదయం దేవదానవులు యుద్ధానికి తలపడ్డారు. సేనలు విజృంభించినాయి. తారకుడు షణ్ముఖుని ఎదిరించి "ఓరీ బాలకా! 33 కోట్లమంది దేవతలు కూడా నా ముందు నిలువలేక పోయారు. ఇక నువ్వెంత? అయినా పాలు త్రాగే పసిబాలుడవు. నీకు యుద్ధమెందుకు? హాయిగా ఆటలాడుకునే వయసులో నీకు యుద్ధమెందుకు? నేను శివభక్తుడను. ఈశ్వరుడు నా స్వామి. అటువంటి నా స్వామి కుమారుడవు కాబట్టి ఇంతవరకు ఉపేక్షించాను. ఇంక ఇంటికి వెళ్ళిపో!" అన్నాడు. ఆ మాటలు విన్న కుమారస్వామి "ఓ తారకా! నేను చిన్నవాడనే కాని, నీ మాటలకు లొంగిపోయే వాడిని కాదు. నీ బెదిరింపులకు లొంగే వాణ్ణి అంతకన్నా కాదు. భీకరణ సంగ్రామానికి బెదరను. నీ ఆటలింక సాగవు. మాటలు కట్టిపెట్టి యుద్ధానికి రా!" అన్నాడు.

కుమారస్వామి తారకాసురుల మధ్య భీకర సంగ్రామం మొదలైంది. తారకుడు మయుడు ప్రసాదించిన మహాశక్తిని ప్రయోగించాడు. దాని ధాటికి దేవతలంతా భయభ్రాంతులైనారు. ఆ శక్తి షణ్ముఖుని రథాన్ని చుట్టుముట్టింది. స్కందుడు బ్రహ్మాస్త్రంతో ఆ శక్తిని భేదించాడు. కుమారస్వామి అనేక అస్త్రాలను తారకుడిపై ప్రయోగించాడు. తారకుడు చెక్కుచెదరలేదు. ఈ రకంగా ఇరవై రోజులు యుద్ధం జరిగింది.

ఆ రోజు రాత్రి స్కందుడు బ్రహ్మాది దేవతలను ప్రార్థించి "మహానుభావులారా! నేను ఎన్ని అస్త్రాలు ప్రయోగించినా తారకుడు మరణించటంలేదు. ఇంక దారి ఏది?" అని అడిగాడు. అప్పుడు నారద మహర్షి అక్కడికి వచ్చి 'కుమారా! తారకుని మెడలో శివలింగమున్నది. అది చాలా మహిమ గలది. అది మెడలో ఉన్నంతవరకు అతడికి చావులేదు. ఆగ్నేయాస్త్రముతో దానిని పగులకొట్టు. అది ముక్కలై భూమిమీద పడిందా, ఆ

ముక్కలన్నీ వెంటనే ఒకటైపోయి మళ్ళీ తారకుని మెడనుచేరతాయి. కాబట్టి అవి భూమి మీద పడకముందే వాటికి ప్రాణప్రతిష్ఠ చేసి ఆలయములు నిర్మించాలి" అన్నాడు. నారదుని మాటలు విన్న స్కందుడు సూర్యభగవానుని ప్రార్థించి ఆ ముక్కలు క్రింద పడక ముందే వాటికి ప్రాణ ప్రతిష్ఠ చేసే ఏర్పాటు చేశాడు. క్షణకాలంలో వాటికి ఆలయాలు నిర్మిస్తానన్నాడు విశ్వకర్మ.

తెల్లవారింది. దేవదానవుల యుద్ధం మొదలైంది. చండప్రచండంగా విజృంభించాడు తారకుడు. దేవతలు అతడి పరాక్రమాన్ని చూసి విస్తుబోయారు. భయపడి పారిపోయారు. కుమారస్వామి ఆగ్నేయాస్త్రంతో తారకుని మెడలోని శివలింగాన్ని ఛేదించాడు. అది ఐదు ముక్కలయి ఐదు చోట్ల పడింది. ఆ ముక్కలు క్రిందపడేలోపే సూర్యభగవానుడు వాటికి ప్రాణప్రతిష్ఠ చేశాడు. విశ్వకర్మ ఆలయ ప్రాంగణాలు నిర్మించాడు. కుమారస్వామి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. తారకాసురుడు ఆర్తనాదం చేస్తూ నేలకొరిగాడు. దివి నుండి దేవతలు పూలవాన కురిపించారు. గంధర్వులు పాడారు. అప్సరసలు ఆడారు. లోకాలకు వచ్చిన ఉపద్రవం తొలగిపోయింది. తారకాసుర వధ జరిగి పోయింది. కుమారస్వామి కైలాసానికి వెళ్ళి పార్వతీ పరమేశ్వరులకు పాదాభివందనం చేసి తారకాసుర సంహారం గురించి తెలియ చేశాడు. లోకకళ్యాణం జరిపినందుకు ఆనందించి కుమారుని ఆశీర్వదించారు ఆది దంపతులు.

కుమారస్వామి స్వర్గంలో విహరిస్తూ దేవసేనతో కలిసి సుఖాలు అనుభవిస్తున్నాడు. ఆ సమయంలో నారదుడు అక్కడికి వచ్చాడు. మహర్షిని సగౌరవంగా ఆహ్వానించి, సత్కరించాడు. కుశలప్రశ్నలు అయిన తరువాత "స్వామీ, ముల్లోకాలలోని జనులు సుఖంగా ఉన్నారా? దుర్మార్గులు, దుష్టులు, అధర్మపరులు విజృంభించటం లేదు కదా? త్రిలోకసంచారులు. తమకు తెలియని విషయాలుండవు. దయచేసి తెలవియ్యండి" అన్నాడు. దానికి నారదుడు "కుమారా! నువ్వు సేనానిగా ఉన్నప్పుడు అధర్మపరులు, దుర్మార్గులు ఎక్కడ ఉంటారు? లోకాలన్నీ సుఖశాంతులతో హాయిగా ఉన్నాయి. అయినా ఒక్క విషయము. ఇక్కడికి కొంతదూరాన పుళింద దేశమున్నది. దాన్ని భిల్లరాజు పుళిందుడు పరిపాలిస్తున్నాడు. అతడు గొప్ప శివభక్తుడు. ధర్మపరుడు. అతడికి బిడ్డలు లేరు. ఒకనాడు తన భార్యతో కలిసి వేటకు వెళ్ళాడు. ఆ అడవిలో ఒక నదీ సమీపాన ఒక పసిపాప కనిపించింది.

ఆ నదీ తీరంలో 'శివుడు' అని ఒక మహర్షి తపస్సు చేసుకుంటున్నాడు. ఒకరోజున ఆయన ధ్యానంలోంచి కనులు తెరిచేసరికి రెండు జింకలు గాఢాను రాగముతో మైథునక్రియలో ఉన్నాయి. వాటిని చూసిన మరుక్షణమే మహర్షి మనసు చలించింది.

రేఃపతనమయింది. అతని వీర్యము గడ్డిమీద పడింది. ఆ గడ్డిని అడుజింక తిన్నది. ఆ ప్రభావం చేత జింక ఒక పాపను ప్రసవించి అరణ్యంలోకి వెళ్ళిపోయింది. భిల్ల రాజ దంపతులకు ఆ పసిపాప ఒంటరిగా కనుపించింది. శివుని వరప్రసాదంగా భావించి ఆ బాలికను తెచ్చి పెంచుకున్నాడు భిల్లరాజు పుళిందుడు. ఆ బాలికకు 'శ్రీవల్లి' అని నామకరణం చేశాడు. ఆమె అందాల రాసి. అపరంజి బొమ్మ. ఆమె నీకు తగిన జోడు" అన్నాడు. ఆ మాటలు వినగానే కుమారస్వామి మనసు వికలమయింది. శ్రీవల్లి ఎంత అందగత్తె కాకపోతే నారదముని ఆమెను గురించి చెబుతాడు? ఆమెను చూడాలి. ఆమెను వివాహమాడటానికి తల్లితండ్రులు, దేవసేన ఒప్పుకుంటారా? పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు.

నారదుడు పుళింద దేశం చేరాడు. పుళిందుడు మహర్షికి స్వాగతం పలికి, తన కుమార్తెను చూపి, తగిన వరుని చెప్పమన్నాడు. నారదుడు కొంచెము ఆలోచించి "బ్రహ్మదేవుడు నీ కుమార్తె శ్రీవల్లికి తగిన భర్త ఆది దంపతుల కుమారుడైన కుమారస్వామి అని చెప్పాడు" అని వివరించాడు.

ఆ మాటలు విన్న శ్రీవల్లి కూడా 'దేవసేనాని తనను వివాహ మాడతాడా? ఆది దంపతులు తనను కోడలుగా చేసుకోటానికి ఒప్పుకుంటారా? ఇత్యాది ఆలోచనలతో కాలం గడుపుతోంది.

ఒకరోజు అనుకోకుండా క్రొత్త ప్రదేశానికి వెళ్ళాడు కుమారస్వామి. అది పుళిందపురము ఉద్యానవనము. ఆ సమయంలో రాజకుమారి చెలులతో కలిసి వనవిహారం చేస్తున్నది. ఆ ముగ్ధ మోహనాకారున్ని చూశాడు కుమారస్వామి. ఇక భరించలేక పోయాడు. తనను తాను పరిచయం చేసుకుని వల్లిని వివాహ మాడతానని చెప్పాడు. చెలికత్తెలు ఈ విషయం రాజు పుళిందుడికి నివేదించారు. పుళిందుడు మంత్రి సామంతులతో, పురోహితులతో, ముత్తైదువులతో విచ్చేసి కుమారస్వామిని రాజమందిరానికి తోడ్కొనిపోయారు. పార్వతీ పరమేశ్వరులకు వర్తమానం వెళ్ళింది. వల్లీ పరిణయం నిశ్చయమైంది.

పుళింద దేశమంతా కోలాహలంగా ఉంది. నగరాన్నంతటినీ అలంకరించారు. శోభాయమానంగా తీర్చిదిద్దారు. రంగవల్లులు దిద్దారు. మంగళతోరణాలు కట్టారు. నగరం అంతా సందడే. ముక్కోటి దేవతలు వచ్చారు. దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య గణాలన్నీ విచ్చేసినాయి. కుమారస్వామి పాదాలు కడిగి కన్యాదానం చేశాడు పుళిందుడు. నవదంపతులను దేవతలు దీవించారు. గంధర్వులు పాడారు. అప్సరసలు ఆడారు. శ్రీవల్లీ కుమారస్వామిల వివాహం లోకకళ్యాణ మయింది" అంటూ కుమారస్వామి వృత్తాంతాన్ని వివరించాడు రత్నాకరుడు.



# గజాసురుడు

'గురుదేవా! గజాసురుడు ఎవరు? అతను ఏవిధంగా మరణించాడో సెలవియ్యండి' అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

తారకాసురుడు మరణించిన తరువాత చాలా కాలము లోకాలు సుఖశాంతులతో వర్ధిల్లినాయి. కొంతకాలానికి తారకుని వంశములో 'గజాసురుడు' అనే వాడు ఉద్భవించాడు. గజాసురుడు బ్రహ్మను గూర్చి ఘోర తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై అనేక వరాలిచ్చాడు. తపోవనము నుంచి తిరిగి వచ్చిన గజాసురుడు శోణితపురాన్ని రాజధానిగా చేసుకుని ధర్మమార్గాన లోకాలను పాలిస్తున్నాడు. గజాసురుడు పాలించే కాలంలో అతివృష్టి, అనావృష్టి అనేవి లేవు. ఎండా వానలు సరిగా ఉన్నాయి. దేశం సశ్యస్యామలంగా ఉంది. సుభిక్షంగా ఉంది. నేరాలు లేవు. దుర్మార్గులు లేరు. అంతా సదాచార సంపన్నులే. అయినప్పటికీ గజాసురుడు వసుతః రాక్షస ప్రవృత్తి గలవాడు కావటం చేత దేవతలను కించపరుస్తూనే ఉన్నాడు.

గజాసురుడు గొప్ప శివభక్తుడు. త్రికాలముల యందు ఈశ్వరారాధన చేసేవాడు. ఒకరోజున అసురేంద్రుడు మంత్రి సామంత దండ నాయకులతో సభ తీర్చి ఉన్నాడు. ఆ సభలోకి నారదమునీంద్రుడు వచ్చాడు. మహర్షికి ఎదురేగి స్వాగతం పలికాడు గజాసురుడు. ఉచితాసనాసీనుని చేసి, సత్కరించాడు. కుశలప్రశ్నలు అయిన తరువాత "నారద మునీంద్రా! త్రిలోక సంచారివి కదా! ముల్లోకాలలోనూ ప్రజలు ఎలా ఉన్నారు. విశేషాలు ఏమిటి? అన్నాడు. దానికి నారద మహర్షి 'దానవేంద్రా! నీ పాలనలో ముల్లోకాల ప్రజలూ సుఖంగా ఉన్నారు. దేశం శుభిక్షంగా ఉన్నది. కాకపోతే నాకు మాత్రం ఒక చిన్న లోటు కనిపిస్తున్నది' అన్నాడు.

"లోటా? ఏమది మునీంద్రా? శెలవియ్యండి. తక్షణమే దాన్ని భర్తీ చేస్తాను" అన్నాడు రాక్షసరాజు.

"ఏమీ లేదు రాక్షసరాజా! ముల్లోకాలలోనూ నిన్ను మించిన శివభక్తుడు ఎవరూ లేరు. నిరంతరము, త్రికాలముల యందు శివపూజ చేస్తూనే ఉన్నావు. మరి నువ్వు పూజించే శివుడు కైలాసములోను, నువ్వు భూలోకంలో శోణితపురములోను ఉండటము అంతగా

బాగున్నట్టులేదు. నాకుమాత్రం ఇది కొంచెం అసౌకర్యంగా ఉన్నట్లుంది. కాబట్టి నువ్వు చంద్రమౌళీశ్వరుని మెప్పించి, నీ హృదయ మందిరములో ప్రతిష్ఠించుకున్నట్లైతే, నీకు కూడా ఆయనను పూజించటానికి వీలవుతుంది. భూత భవిష్యద్వర్తమానాలలో కూడా నిన్ను మించిన శివభక్తుడు కాని, శివపూజా దురంధరుడు కాని, ఎవరూ లేరు. అందుచేత హరుడు కూడా నీ కోరిక కాదనడు.శంకరుడు గనక నీ హృదయ మందిరములో ప్రతిష్ఠింపబడినట్లైతే, దేవతలు కూడా చేతులు కట్టుకుని, తలలు వంచుకుని నీ ముందు నిలుచుంటారు. అది ఎంత గొప్ప భాగ్యము? దానవ సార్వభౌమా! ఇప్పటికే నీ యశశ్చంద్రికలు పద్నాలుగు లోకాల యందు వ్యాపించినాయి. ఈశ్వరుడు గనక నీ హృదయ స్థానంలో ప్రతిష్ఠించబడినట్లైతే, ఆచంద్రతారార్కము నీ పేరు నిలిచిపోతుంది" అన్నాడు నారదుడు.

నారదుడి మాటలు గజాసురుని చెవులలో దూరినాయి. తలకు ఎక్కినాయి. మహర్షి చెప్పినది నిజమే. ఈశ్వరుణ్ణి గనక తన హృదయంలో ఉంచగలిగితే తనకు తిరుగులేదు. మృత్యువు కూడా తన జోలికి రాదు. తను అజరామరుడౌతాడు. ఈ విధంగా ఆలోచించి పరమేశ్వరుణ్ణి నియమనిష్ఠలతో అర్చించటం మొదలుపెట్టాడు. గజాసురుని భక్తికి మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకో అన్నాడు. అప్పుడు గజాసురుడు "దేవదేవా! పరాత్పరా! అనాథరక్షకా! నన్ను కరుణించు స్వామీ. నీ సన్నిధే నాకు పెన్నిధి. నిన్ను వదలి ఒక్క క్షణం కూడా ఉండలేను. భక్తుడు ఒకచోట, భగవంతుడు ఒకచోట ఉండటమనేది ధర్మం కాదు కదా. ప్రభూ! అందుచేత అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు, ఆది మధ్యాంతరహితుడు అయిన నువ్వు సర్వకాల సర్వావస్థలయందు నా హృదయంలోనే నివసించాలి. ఇదే నా విన్నపము" అన్నాడు. ఆ మాటలకు శివుడు సరే అని పార్థివలింగ రూపం దాల్చి గజాసురుని హృదయంలోకి ప్రవేశించాడు. జగాల నేలే పరమేశ్వరుడు తన హృదయమందిరములో నివాసమున్నాడు. తనకన్న అదృష్టవంతుడు ఇంకొకడు లేడు. రాక్షస రాజు ఆనందానికి హద్దులులేవు.

కైలాసములో శివుడు కనిపించలేదు. ఈశ్వరుడు ఎక్కడికి వెళ్ళాడో తెలియక కైలాస వాసులు కంపించిపోయారు. రుద్రగణాలు నలుమూలలా వెదకటం మొదలు పెట్టినాయి. పార్వతీదేవి జయ, విజయ అనే సేవకులను పిలిచి శివుని జాడ కనుక్కు రమ్మన్నది. వారు కొన్ని రుద్రగణాలతో కలసి వెతకగా, వెతకగా చివరకు కైలాస నాథుడు గజాసురి హృదయ మందున్నాడని తెలిసింది. వెంటనే ఆ విషయాన్ని పార్వతీ దేవికి విన్నవించారు. రుద్రగణాలు తిరిగి వచ్చి ఈశ్వరుడు శోణితపురము నందు గజాసురుని హృదయమున ఉన్నాడని తెలుసుకుని ఆ విషయము గౌరీదేవికి విన్నవించారు.

పార్వతీదేవి తన సోదరుడైన శ్రీమన్నారాయణుడికి విషయాన్ని తెలియచేసి, "శ్రీధరా! గజాసురుడనే రాక్షసుడు భక్తవ శంకరుడైన శంకరుని వంచించి, తన హృదయమందు బంధించినాడు. ఈశ్వరుడు లేని కైలాసము అనాధ అయింది. కాబట్టి ఏ ఉపాయం చేతనైనా సరే, నా నాథుని నా చెంత చేర్చు" అని వేడుకుంది.

శ్రీహరి హైమవతిని ఓదార్చి గణపతిని పిలిచి "నాయనా! నీ తండ్రిని తీసుకుని రావటానికి నేను రుద్రగణాలను వెంట పెట్టుకుని వెడుతున్నాను. కాబట్టి మేము తిరిగివచ్చే దాకా కైలాసాన్ని కాపాడుతూ ఉండు" అని చెప్పి ప్రమథ గణాలను వెంటపెట్టుకుని త్రోవలో ఇంద్రాది దేవతలను కూడా తనతోపాటు తీసుకుని శోణితపురము బయలుదేరాడు.

గజాసుర సంహారానికి గంగిరెద్దు మేళమే యుక్తము అని భావించి నందిని గంగిరెద్దుగా అలంకరించి, బ్రహ్మాది దేవతలకు తలా ఒక వాద్యమూ ఇచ్చి, తాను చిరుగంటలు, సన్నాయి ధరించి, శోణితపురానికి వెళ్ళి గంగిరెద్దును చిత్రవిచిత్రముగా ఆడించటం మొదలుపెట్టాడు శ్రీహరి. నంది కూడా తన స్వామి కోసం లయబద్ధంగా ఆడుతూ చూపరులను ఆకట్టు కుంటున్నది. ఈ విషయం ఆనోటా, ఆనోటా ప్రాకి రాజ ప్రాసాదము దాకా వెళ్ళింది. గజాసురుడు విన్నాడు ఈ సంగతి. గంగిరెద్దు ఆట తను కూడా చూడాలనుకున్నాడు. ఆటగాళ్ళకు కబురు చేశాడు.

వారందరినీ తన సభకు వచ్చి అక్కడ ప్రదర్శన ఇమ్మన్నాడు. ఆటగాళ్ళు అందరూ గజాసురుని సభా మంటపం చేరారు. ఆట మొదలయింది. విష్ణుమూర్తి పాట పాడుతున్నాడు. బ్రహ్మదేవుడు సన్నాయి వాయిస్తున్నాడు. దేవేంద్రుడు మృదంగము వాయిస్తున్నాడు. అప్సరాంగనలు నాట్యం చేస్తున్నారు. గంధర్వులు శ్రీహరితో గొంతు కలిపి పాడుతున్నారు. నందీశ్వరుని కాళ్ళకు గజ్జెలు కట్టారు. మెడలో చిరు మువ్వలు వేశారు. శరీరం మీద వివిధ అలంకారాలు చేశారు. పాటకు అనుగుణంగా గంగిరెద్దు ఆడుతున్నది. సభలోని వారంతా విస్తుపోయి ఆటను చూస్తున్నారు.

అదను చూసి శ్రీహరి శివ స్తోత్రములు అందుకున్నాడు. వాద్యాలు మిన్ను ముట్టినాయి. నంది మైమరచి ఆడుతున్నాడు. శివస్తోత్రములకు, నంది ఆటకు మైమరచిపోయాడు రాక్షసరాజు. తనను స్తోత్రం చేస్తుంటే లింగరూపంలో గజాసురుని హృదయంలో ఉన్న ఈశ్వరుడు ఉబ్బిపోయినాడు. ఆ విషయం గ్రహించాడు శ్రీహరి. అదే అదనుగా తీసుకున్నాడు. పాట, ఆట కూడా ఊపందుకున్నాయి. ఒకవైపు భక్తి. రెండవ వైపు గంగిరెద్దు ఆట. కన్నుల పండుగగా ఉంది. గజాసురుని హృదయములోని శివలింగము క్రమేణా పెరిగి పోతున్నది. రాక్షసేంద్రుని కడుపు పెద్దదయిపోతోంది. ఇక పగిలిపోయేటట్లున్నది. అతడికి ఊపిరి

ఆడటం లేదు. ఇది శ్రీహరి మాయ. ఇంక లాభం లేదు. పరమేశ్వరుని తీసుకువెళ్ళటానికి వచ్చిన దేవతాగణాలు వీరు.

తన పని అయిపోయింది. ఈ రకంగా ఆలోచించిన గజాసురుడు "పరమేశ్వరా! రక్షమాం! రక్ష రక్ష!" అన్నాడు. భక్త సులభుడైన ఈశ్వరుడు "గజాసురా! నీకు కాలము ఆసన్నమైనది. నీకు ఏ వరం కావాలో కోరుకో" అన్నాడు. అంతట గజాసురుడు "స్వామీ! నా శిరస్సు పూజించబడాలి. నా చర్మము నీకు ధరించాలి. నాకు మళ్ళీ జన్మ లేకుండా కైవల్యం ప్రాప్తించాలి" అన్నాడు. రాక్షసేంద్రుని కోరికలన్నింటినీతీర్చాడు శంకరుడు. ఆ తరువాత అతని హృదయాన్ని చీల్చుకుని బయటకు వచ్చి తన త్రిశూలముచే గజాసురుని శిరస్సు ఖండించాడు. ఆ తరువాత గజాసురుని శిరస్సునే వినాయకుడికి అతికించటం జరిగింది. గజాసురుని చర్మాన్ని తాను ధరించాడు శంకరుడు. అప్పటినుంచీ పరమేశ్వరుడు 'కృత్తివాసుడు' అని పిలవబడ్డాడు.

దేవతలంతా తమ తమ రూపాలను ధరించి, శంకరుని వెంట పెట్టుకుని కైలాసం చేరారు.

కాబట్టి శిష్యులారా! భగవంతుడు భక్తశులభుడు కదా అని కోరకూడని వరాలు కోరితే అనర్థమే జరుగుతుంది. అంటూ గజాసుర వృత్తాంతాన్ని వివరించాడు రత్నాకరుడు.

## గణనాధుడు



"గురువర్యా! పార్వతీ పరమేశ్వరుల కుమారుడు కుమారస్వామి అన్నారు. మరి గణపతి ఎవరు? అసలు గణపతులు ఎంత మంది? గణపతి గణాధిపతి ఎలా అయ్యాడు? ఆ వివరాలు మాకు తెలియ చెయ్యండి" అన్నాడు నారాయణ భట్టు. చెప్పటం మొదలు పెట్టాడు రత్నాకరుడు.

నాయనా! శివపార్వతుల కళ్యాణమైంది. వారు కైలాసంలో కేళీమందిలో ఉన్నారు. అలా అనేక సంవత్సరాలు గడిచినాయి. ఇంతలో దేవతలంతా విష్ణుమూర్తి నాయకత్వంలో శంకరుని ప్రార్థించి తారకుని దురాగతాలను వివరించారు. అప్పుడు శంకరుడు తన వీర్యాన్ని అగ్నిలో విడిచాడు. ఆ విషయం తెలిసిన పార్వతీదేవి దేవతలకు సంతానము కలుగకుండా ఉండుగాక అని శపించింది. ఆ సమయంలో శివుడు పార్వతీదేవిని అనునయ

వాక్యాలతో ఊరడించి "దేవీ! నీ గర్భకోశము నందు చతుర్దశ భువనాలు నిండి ఉన్నాయి. నా ప్రథమ వీర్యము వలన ఆ లోకాలన్నీ దహించుకుపోతాయి. అందుచేత దాన్ని అగ్నిలో వదలవలసి వచ్చింది. నీకు బిడ్డలులేరనే చింతవద్దు. నువ్వు ఇరవై ఒక్కమంది గణపతులకు తల్లివి అవుతావు" అని వరమిచ్చాడు. ఆ వరప్రభావం చేత పార్వతీదేవి ఇరవై ఒక్క మంది గణపతులకు తల్లి అయింది.

గజాసుర సంహారానంతరము త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు, ప్రమథ గణాలు కైలాసంలో కొలువు తీర్చాయి. శివుని రాకను గురించి 'జయ' అనే పరిచారిక వల్ల తెలుసుకున్నదై పార్వతీదేవి మహదానందం చెందింది. అభ్యంగన స్నానము చెయ్యబోతూ గణపతులను పిలిచి లోపలికి ఎవరినీ రానియ్యవద్దు' అని ఆజ్ఞాపించింది. కొంతసేపటికి నందీశ్వరాదులు లోపలకు ప్రవేశింపబోగా గణపతులు వారి నడ్డగించారు. దేవీ గణాలు గణపతులకు బాసటగా నిలిచాయి. చేసేది లేక ప్రమథ గణాలు పలాయనం చిత్తగించి, జరిగిన పరాభవాన్ని గురించి ఈశ్వరునకు నివేదించినాయి. ఈశ్వరుడు కోపంతో త్రిశూలము ప్రయోగించాడు. మరుక్షణములో ఇరవై ఒక్క మంది గణపతులు తలలు తెగి క్రిందపడ్డాయి. కుమారుల మరణవార్త విని పార్వతీదేవి చాలా విచారించింది.

శంకరుడు బ్రహ్మాదిదేవతలను వెంట తీసుకుని పార్వతీ మందిరానికి వెళ్ళాడు. వీరి రాకను గమనించి కూడా పార్వతీదేవి మాట్లాడకుండా ఉంది. గిరిరాజసుత సౌందర్యానికి శంకరుడు పరవశుడై, ఆమెను లాలించటం మొదలుపెట్టాడు. జగదీశ్వరి కన్నెత్తి చూడలేదు. పన్ను విప్పి మాట్లాడలేదు. ఆ సమయంలో శ్రీహరి కలుగచేసుకుని "సోదరీ, గజాసుర సంహారము జరిగినందుకు చతుర్దశ భువనాలు నీ నాథుని వేనోళ్ళ పొగడుతుంటే, నువ్విలా ఉండటానికి కారణము ఏమిటి? ఇంతవరకు క్షేమంగానే నాథుడిని తిరిగి తెమ్మని కోరి, తీరా శంకరుడు విచ్చేసిన తరువాత మాట్లాడకుండుట పాడియా? నీ విచారానికి కారణము ఏది?" అన్నాడు. ఆ మాటలు విన్న పార్వతీదేవి "మాధవా! తల్లి మాటలను జవదాటను గణపతులు ఇరవై ఒక్క మందిని ఒక్క దెబ్బతో త్రిశూలంతో చంపేశారు. అందుకే నేను విచారంగా ఉన్నాను. వారందరినీ బ్రతికించి, వారికి ఉన్నత పదవులు ఇస్తేనే గాని నా మనసు కుదుటపడదు" అన్నది.

పరమేశ్వరి కోరిక తీర్చటం కోసం పరమశివుడు తనతో పాటు తెచ్చిన గజాసుర శిరముతో పాటుగా ఇంకనూ ఇరవై ఏనుగుల తలలు తెప్పించి, గణపతులకు వాటిని అంటించి, వారిని గజముఖాలుగా చేశాడు. పార్వతీదేవి గణపతులు పునర్జీవులైనందుకు పరమానందం చెందింది.

పార్వతీ పరమేశ్వరులు కైలాసములో సభ తీర్చారు. ఆ సభకు దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య గణాలన్నీ విచ్చేసినాయి. త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు, అష్ట దిక్పాలకులు విచ్చేశారు. ఆ సభలో 'విశ్వదర్శి' అనే ఉపబ్రహ్మలేచి "ఆది దంపతులారా! నాకు యుక్తవయస్కులైన కుమారులు ఇరవై ఒక్కమంది ఉన్నారు. మీరు అనుమతిస్తే వారిని గణపతులకిచ్చి వివాహం చేస్తాను" అన్నాడు. సమ్మతిని తెలియచేశారు ఆది దంపతులు. తథాస్తు అన్నాడు శ్రీహరి. ముహూర్తం చూశాడు బ్రహ్మ. గణపతుల కళ్యాణం నిశ్చయమైంది.

కైలాసమంతా అలంకరించారు. అంతా కోలాహలంగా ఉంది. ప్రమథ గణాలు, దేవీ గణాలు అమితోత్సాహంతో పెళ్ళి పనులు చేస్తున్నారు. గణపతుల వివాహం అత్యంత వైభవంగా జరిగింది. పాఠకుల సౌకర్యం కోసం గణపతులు, వారి భార్యల పేర్లు దిగువ ఇవ్వబడ్డాయి.

| గణపతి పేరు | భార్య పేరు |
|---|---|
| లక్ష్మీ గణపతి | జయలక్ష్మి |
| సిద్ధి గణపతి | సిద్ధి, బుద్ధి |
| చింతామణి గణపతి | విజయలక్ష్మి |
| ఏకదంత గణపతి | సిద్ధి |
| వక్రతుండ గణపతి | నవరత్న లక్ష్మి |
| లక్ష్మీప్రద గణపతి | వీరలక్ష్మి |
| నింబ గణపతి | బుద్ధిలక్ష్మి |
| లంబోదర గణపతి | సిద్ధవిద్య |
| ఋణ విమోచన గణపతి | సౌభాగ్యలక్ష్మి |
| శుక్ల గణపతి | బుద్ధి లక్ష్మి |
| ధూమ్రగణపతి | సిద్ధిలక్ష్మి |
| కృష్ణ గణపతి | సువర్ణదేవి |
| రక్తవర్ణ గణపతి | పద్మదేవి |
| సువర్ణ గణపతి | రజతదేవి |
| విఘ్న గణపతి | ప్రజాదేవి |
| నిర్విఘ్న గణపతి | అతి ప్రజ్ఞాదేవి |
| వికట గణపతి | జ్ఞానదేవి |

| | |
|---|---|
| బాలచంద్రగణపతి | చంద్రముఖి |
| సర్వాంబరగణపతి | సంహారదేవి |
| గణాధిపతి | శాంతదేవి |
| భద్రగణపతి | లోకమాత |

కుమారుల వివాహం జరుగుతున్న సంతోష సమయంలో పార్వతి, శివునితో 'నాథా! కుమారులకు గణాధిపత్యము కూడా ఇచ్చి నాకు మరింత ఆనందము కలుగచెయ్యవలసినది' అన్నది. ఆ మాటలు విన్న శంకరుడు కుమారస్వామిని పిలిచి "నాయనా! నీకు సైన్యాధిపత్యమునిచ్చాను. కాబట్టి గణాధిపత్యము గణపతులకు ఇస్తాను' అన్నాడు. అది కూడా తనకే కావాలన్నాడు స్కంధుడు. శంకరుడు కుమారస్వామిని, గణపతులలో పెద్దవాడయిన లక్ష్మీ గణపతిని పిలిచి 'కుమారులారా! గణాధిపత్యము చాలా బాధ్యతాయుతమైనది. కాబట్టి అది అత్యంత సమర్థుడికే ఇవ్వదలచాను. మీ ఇద్దరికీ ఒక పరీక్ష పెడుతున్నాను. అది లోకాలన్నీ చుట్టిరావటం. అంటే భూప్రదక్షిణ చేయటం. మీలో ఎవరు ముందు భూ ప్రదక్షిణ చేస్తారో వారికే గణాధిపత్యము లభిస్తుంది' అన్నాడు. ఆ మాటలు విన్నదే తడవుగా 'సరే' అంటూ నెమలి వాహనమెక్కి రివ్వున వెళ్ళిపోయాడు కుమారస్వామి. లక్ష్మీ గణపతి కదలలేక లంబోదరముతో తన తల్లి వద్దకు వెళ్ళి "అమ్మా! నేను త్వరగా నడవలేను. మూషిక వాహనం కూడా అంతే! కాబట్టి నాకీ గణాధిపత్యము రాదు" అన్నాడు. దానికి పార్వతీదేవి "కుమారా! చింతించకు. శ్రీమన్నారాయణుడు చతురోపాయ నిపుణుడు. ఆశ్రితవత్సలుడు. పైగా నీకు మేనమామ. ఆయన్ని ఆశ్రయించు. తరుణోపాయం చూపుతాడు" అన్నది. శ్రీహరిని ఆశ్రయించాడు లక్ష్మీ గణపతి. శ్రీహరి కడు ప్రసన్నుడై 'శివపంచాక్షరీ' మంత్రము మహా మహిమోపేతమైనది కాబట్టి ఆ మంత్రాన్ని ఐదు లక్షలసార్లు జపించి, నీ తల్లిదండ్రులకు మూడుసార్లు ప్రదక్షిణాలు చెయ్యి. భూప్రదక్షిణ చేసిన ఫలితం నీకు దక్కుతుంది" అన్నాడు అలాగే చేశాడు లక్ష్మీగణపతి.

కుమారస్వామి నెమలి వాహనం మీద కాశీ క్షేత్రానికి వెళ్ళి గంగాస్నానం చేసి విశ్వేశ్వర దర్శనం చేసుకున్నాడు. అంతకు ముందే గణపతి అక్కడకు వచ్చి వెళ్ళాడు అని చెప్పారు అక్కడివారు. ప్రయాగ వెళ్ళి మాధవేశ్వరుని దర్శించాడు కుమారస్వామి. ఇప్పుడే గణపతి ఇక్కడి నుండే వెళ్ళాడు అని చెప్పారు. ఈ రకంగా కుమారస్వామి వెళ్ళిన చోటల్లా గణపతి ఇప్పుడే ఇక్కడకు వచ్చి వెళ్ళాడు అని చెప్పారు. చేసేది లేక తిరిగి వచ్చి, తల్లిదండ్రులకు నమస్కరించాడు కుమారస్వామి. ఆ ప్రక్కనే ఉన్నాడు గణపతి. సిగ్గుతో తలవంచుకుని, "పందెంలో ఓడిపోయాను. గణాధిపత్యము గణపతికే ఇవ్వండి" అన్నాడు కుమారస్వామి

సముద్ర జలాలు, నదీ జలాలతో గణపతిని అభిషేకించారు. గణాలకన్నిటికీ అధిపతిగా చేశారు. దేవతలు దివ్యాస్త్రాలన్నీ అతనికి బహుమతిగా ఇచ్చారు. శంకరుడు "దేవతలు గాని, మానవులు గాని శుభకార్యాలు ప్రారంభించే ముందు గణపతిని తప్పక పూజిస్తారు. దానివల్ల వారికి ఇష్టార్థ సిద్ధి కలుగుతుంది" అని దీవించాడు.

అప్పటి నుంచి విద్యారంభమునందుగాని, వివాహమందు గాని, సంగ్రామారంభంలో గాని, ఏ కార్యానికయినా సరే ముందుగా గణపతిని అర్చించటం జరుగుతున్నది అంటూ గణనాథుని గురించి వివరించాడు రత్నాకరుడు.

# త్రిపురాసురులు



"గురుదేవా! త్రిపురాసురులు అంటే ఎవరు? వారు ఏవిధంగా సంహరించబడ్డారో వివరించండి" అని అడిగాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

దితి కశ్యపుల కుమారుడు వజ్రాంగుడు. అతని భార్య వరాంగి. వీరి కుమారుడు తారకాసురుడు. బ్రహ్మవరప్రసాది. ముల్లోకాలను గడగడలాడించిన దానవేంద్రుడు. చివరకు ఉమామహేశ్వరుల పుత్రుడు, దేవ సేనాని అయిన కుమారస్వామి చేతిలో మరణించాడు. తారకాసురునికి ముగ్గురు కుమారులు. వారు 1) తారకాక్షుడు, 2) కమలాక్షుడు, 3) విద్యున్మాలి. తారకుడు మరణించగానే, అతని భార్య కుమారులను తీసుకుని పాతాళానికి పారిపోయింది. అక్కడే వారిని పెంచి పెద్ద చేసింది. శుక్రాచార్యుని వద్ద విద్యాబుద్ధులు నేర్పించింది. బాలురు దినదినప్రవర్ధమానమై సకలశాస్త్ర కోవిదులైనారు. తమ తండ్రి మరణ వృత్తాంతము తల్లి వల్ల పూర్తిగా తెలుసుకున్నారు. తండ్రి మరణానికి కారణమైన దేవతల మీద పగ తీర్చుకోవాలని నిర్ణయించుకుని మేరు పర్వతం దగ్గర పరమేష్ఠిని గురించి పదివేల సంవత్సరాలు తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. రాక్షస ప్రముఖులందరూ అడిగినట్లే చావు లేకుండా వరం కావాలి అన్నారు దానవులు. 'అది మాత్రం సాధ్యం కాదు. ఎందుచేతనంటే నాకే శాశ్వతత్త్వము లేదు. బ్రహ్మకల్పము పూర్తికాగానే నేను కూడా వెళ్ళిపోతాను. అట్టి నేను నాకు సాధ్యం కాని దాన్ని మీకెలా ఇవ్వగలను. ఇంకేదైనా వరం కోరుకోండి" అన్నాడు. ఆలోచించారు తారకాసురుని పుత్రులు. "పరమేష్ఠీ! రథము కాని

రథమెక్కి, విల్లు కాని విల్లు ధరించి, నారి కాని నారిని తొడిగి, బాణము కాని బాణము సంధించి, ఒక్క దెబ్బతో చంపగల వీరుని చేతి యందు తప్ప మాకు మరణం లేకుండా వరం ప్రసాదించు'' అన్నారు. తథాస్తు అన్నాడు బ్రహ్మ. ''విధాతా! అంతేకాదు. మేము ముగ్గురము నివసించటానికి సకల సదుపాయాలు కలిగి లోహ నిర్మితమై, కామ గమనం కల మూడు పురములు కావాలి. సకలైశ్వర్యాలకు, సకల భోగాలకు ఆ పురుములు నెలవుగా ఉండాలి'' అన్నారు. వారి కోరికలను అనుగ్రహిస్తూ ''ఆ మూడు పురములు ఒకచోట ఎప్పుడూ కలియరాదు. అలా గనక కలిస్తే అవి నాశనమైపోతాయి' అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మ వలన వరాలు పొంది, విశ్వకర్మను పిలిపించి గగన విహారం చేసే మూడు లోహ పట్టణాలు నిర్మించమన్నారు త్రిపురాసురులు. నిర్మించాడు విశ్వకర్మ. వాటిలో ఎక్కి తలో దిక్కుకూ బయలుదేరారు తారకుని కుమారులు. ఈ రకంగా గగన విహారం చేస్తూ భూలోకంలోని పట్టణాల మీద వాటిని ఒక్కసారిగా దించేవారు. దాంతో ఆ పట్టణాలు, జనావాసాలు సర్వనాశనమై పోయేవి. అమితానందంతో మళ్ళీ పైకి ఎగిరిపోయేవారు రాక్షసులు. ఈ రకంగా ఆ రాక్షసులు త్రిపురములలో సంచరిస్తున్నారు కాబట్టి 'త్రిపురాసురులు' అని పిలువబడ్డారు.

త్రిపురాసురుల ఆగడాలు మితిమీరి పోతున్నాయి. దేవతలు, మునులు, ఋషులు, సాధువులు, సజ్జనులు ఉన్నచోట ఆ పురములను దింపి ఆ ప్రదేశాలను నాశనం చేస్తున్నారు. జననష్టం కలిగిస్తున్నారు. మహర్షులు, దేవతలు అంతా కలిసి బ్రహ్మ వద్దకు పోయి త్రిపురాసురుల దౌర్జన్యాన్ని వివరించారు. బ్రహ్మ వారందరితో కలిసి శ్రీహరిని సమీపించి తారకాసురుని కుమారులు లోకాలను పీడిస్తున్నారని, లోకాలను రక్షించమని వేడుకున్నారు. అప్పుడు శ్రీమహా విష్ణువు వారితో ''దేవతలారా, మహర్షులారా! త్రిపురాసురులు రాక్షసులన్నది నిజమే కాని వారు శివభక్తులు. వేదవేదాంగ విదులు, నిత్యాగ్నిహోత్రములను నిర్వర్తిస్తారు. వైదిక కర్మలను శాస్త్రానుసారము ఆచరిస్తారు. కాబట్టి వారిని చంపటము ఏమాత్రము వీలుకాదు. కాబట్టి వారిని వంచించి, ధర్మమార్గము నుండి తప్పించి, అంతమొందించాలి. దీనికి ఒక ఉపాయమున్నది.

బౌద్ధమతాన్ని సృష్టించి, శిష్యప్రశిష్యులతో త్రిపురములయందు సభలను ఏర్పాటు చేసి బౌద్ధమత ప్రచారము కావించండి. నేను సమయం చూసి వారిని సంహరిస్తాను'' అన్నాడు.

దేవతల వ్యూహము ప్రకారము త్రిపురములందు బౌద్ధమతము బాగా ప్రచారము పొందింది. సృష్టి అంటే స్త్రీ పురుష సంయోగము. వర్ణ వ్యవస్థ, ఆచార వ్యవహారాలు,

నియమనిష్టలు మానవ కల్పితాలు. దేవుడనే వాడు లేడు. కర్మలకు అర్థం లేదు. వేదాలు కొందరు స్వార్థపరులు వ్రాసుకున్న గ్రంథాలు. ఈ రకమైన ప్రచారము త్రిపురాసులకు కూడా నచ్చింది. వారికి వినాశకాలం దాపురించింది. విపరీత బుద్ధులు పుట్టినాయి. అప్పటిదాకా వల్లె వేసిన వేదాలు పనికిమాలినవయినాయి. నియమనిష్టలు గంగలో కలిసి పోయినాయి. వావి వరుసలు లేవు. వర్ణ వ్యవస్థ లేదు. ధర్మము భ్రష్టు పట్టిపోయింది. కర్మలు గాలిలో కలిసిపోయాయి. ఈ అదను కోసమే వేచి ఉన్నారు దేవతలు.

విష్ణుమూర్తి నాయకత్వములో పినాకపాణి దగ్గరకు పోయి త్రిపురాసురులను సంహరించి లోకాలను రక్షించమని వేడుకున్నారు. బ్రహ్మ వరం ఇచ్చినట్లుగానే –

| | | |
|---|---|---|
| భూమి | - | రథము |
| రవి, చంద్రులు | - | రథ చక్రాలు |
| నాల్గు వేదములు | - | హయములు |
| బ్రహ్మదేవుడు | - | సారధి |
| మేరు పర్వతము | - | విల్లు |
| శ్రీహరి | - | శస్త్రము |

ఈ రకంగా రథమెక్కి పరమేశ్వరుడు త్రిపురాసురుల మీద యుద్ధం ప్రకటించాడు. పాశుపతాస్త్రాన్ని సంధించి త్రిపురాసురులను వధించాడు. మూడు పురములూ కూడా బూడిదరాసులై పోయినాయి అంటూ త్రిపురాసుర సంహారాన్ని వివరించాడు రత్నాకరుడు.

## జలంధరుడు



'గురువర్యా' జలంధరుడు ఎవరు? అతని జన్మమెట్టిది? అతడెలా సంహరించబడ్డాడో వివరించండి. అంటూ అడిగాడు నారాయణభట్టు. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

"జలంధరుని జన్మ వృత్తాంతము విచిత్రముగా ఉంటుంది. దక్ష యజ్ఞ సమయములో సతీదేవి యోగాగ్నిలో భస్మమైపోయింది. ఆ మాటలు విన్న ఈశ్వరుడు విరాగియై దేశాల వెంట తిరిగి తిరిగి చివరకు హిమాలయ పర్వతాలలో తపస్సు చేసుకుంటున్నాడు. ఈ లోపల వజ్రాంగుడికి తారకుడు జన్మించాడు. అతన్ని సంహరించటానికి పార్వతీ పరమేశ్వరుల వివాహం కావాలి. వారి కుమారుడు కుమారస్వామి చేతిలోనే తారకాసురుడు మరణిస్తాడు.

పరమేశ్వరి పర్వతరాజు ఇంట పార్వతిగా జన్మించింది. ఆమె శివుని తప్ప అన్యుని వివాహమాడను అని ఖచ్చితంగా చెప్పేసింది. శివుడు విరాగియై తపోదీక్షలో ఉన్నాడు. విరాగియైన శంకరుని మనస్సు మార్చేందుకు మన్మథుడు ప్రయత్నించాడు. శివుడికి ఆగ్రహం వచ్చింది. ఈశ్వరుని కోపాగ్నికి మన్మథుడు భస్మమైపోయాడు. మన్మథుణ్ణి భస్మం చేసిన తరువాత మిగిలిన శివుని నేత్రాగ్ని సముద్రంలో పడింది. అప్పుడు పెద్ద ధ్వని వినపడింది. ఆ శబ్దానికి లోకాలన్నీ గడగడలాడిపోయినాయి. భయకంపితులైన దేవతలు బ్రహ్మ దగ్గరకు పరుగెత్తారు. బ్రహ్మదేవుడు దేవతలను వెంటపెట్టుకుని సముద్రుని వద్దకు వచ్చి, 'ఆ శబ్దమేమిటి?' అని అడిగడు. అప్పుడు సముద్రుడు శివుని త్రేతాగ్ని సముద్రములో పడిన సంగతిని వివరించి "ఆ అగ్ని నుండి ఒక బాలుడు జన్మించాడు" అని బాలుడిని చూపించి అతడికి నామకరణం చేసి జాతకము చెప్పమని అడిగాడు. 'వీడు జలాంతర్భాగాన నివసిస్తున్నాడు కాబట్టి 'జలంథరుడు' వీడి నామధేయము. వీడు లోకకంటకుడౌతాడు. ఈశ్వరుని చేతిలోనే మరణిస్తాడు" అని చెప్పాడు బ్రహ్మ.

ఈశ్వరుని క్రోధాగ్ని జ్వాలల నుండి పుట్టిన వాడు కావటం చేత తమోగుణ ప్రధానుడైనాడు. రాక్షస కృత్యాలు చెయ్యటం వలన రాక్షసుడైనాడు. ఈ రకంగా జలంధరుడు అసురుడైనాడు. క్రమేణా పెరిగి పెద్దవాడైనాడు. గొప్ప తపో సంపన్నుడు, యుక్త వయస్సు రాగానే కాలనేమి కుమార్తె బృందనిచ్చి జలంథరుడికి వివాహం చేశారు.

ఒకనాడు జలంథరుడు కొలువు తీర్చి ఉండగా, రాక్షస గురువైన శుక్రాచార్యుడు అక్కడికి వచ్చాడు. వచ్చిన ఆచార్యుని సగౌరవంగా ఆహ్వానించి విశేషాలు ఏమిటి? అని అడిగాడు దానవేంద్రుడు. "రాజా! ఏమని చెప్పదును. జరిగినవి, జరుగుతున్నవి, అన్నీ దుఃఖ కారణాలే. పూర్వకాలంలో దేవతలు, రాక్షసులు కలిసి పాలసముద్రాన్ని మథించారు. దానిలో నుండి ఉచ్చైశ్వరము పుట్టింది. దాన్ని దేవతలు తీసుకున్నారు ఐరావతము పుట్టింది. దాన్నీ దేవతలే తీసుకున్నారు. కామధేనువు, కల్పవృక్షము పుట్టినాయి. వాటిని కూడా దేవతలే తీసుకున్నారు. చివరకు అమృతం పుట్టింది. దాన్ని కూడా దేవతలే ఆరగించారు. అమృతం తాగిన రాహును చంపేశారు. అలా ఆనాడు జరిగింది. హిరణ్యకశ్యప, హిరణ్యాక్ష్యులను, ఇంకెందరో దానవ శ్రేష్ఠులను సంహరించారు. పోనీ ఇప్పుడు చూడు వైకుంఠాన్ని శ్రీహరి ఆక్రమించి ఉన్నాడు. కైలాసములో ఈశ్వరుడున్నాడు. దేవేంద్రుడు స్వర్గాన్ని పాలిస్తున్నాడు. ఈ రకంగా దేవతలు సర్వసౌఖ్యాలు అనుభవిస్తూ, మనలను అడవులలోకి నెట్టివేశారు. బలపరాక్రమాలు గలిగిన దానవేంద్రుడవు నువ్వు రాజుగా ఉండగా కూడా ఈ అన్యాయం ఇలా కొనసాగవలసినదేనా?" అన్నాడు గతం నుంచి

దేవతలు రాక్షసులకు అన్యాయం చేస్తూనే ఉన్నారు. ఈ మాటలు తలచుకోగానే జలంధరుని రక్తం వేడెక్కింది. వెంటనే ఘస్మరుడు అనే రాక్షసుణ్ణి పిలిచి ఇంద్రుని దగ్గరకు దూతగా వెళ్ళి రమ్మన్నాడు. ఘస్మరుడు ఇంద్రుని వద్దకు పోయి "దేవేంద్రా! ఇంతకాలం నువ్వు స్వర్గసుఖాలు అనుభవించావు. ఇక స్వర్గాధిపత్యం దానవేంద్రుడైన జలంధరునకు ఇవ్వు. లేకపోతే యుద్ధం తప్పదు" అన్నాడు. ఆ మాటలు విన్న ఇంద్రుడు పగలబడి నవ్వుతూ "ఇంతకు ముందు ఎంతమంది రాక్షసులు పుట్టలేదు? వారందరినీ విష్ణుమూర్తి సంహరించలేదా? ఇప్పుడూ అంతే. జలంధరుడికి చేతనైతే యుద్ధం చేసి స్వర్గాన్ని గెలుచుకోమను" అన్నాడు. ఇంద్రుని మాటలు దూత ద్వారా విన్న జలంధరుడు కోపోద్రిక్తుడై ముందుగా వైకుంఠం మీదకి దండెత్తాడు. విష్ణువు పారిపోయి మానస సరోవరం చేరాడు. తరువాత స్వర్గం మీద దండెత్తి స్వర్గాన్ని ఆక్రమించాడు జలంధరుడు. స్వర్గాధిపతి ఇంద్రుడు అరణ్యాలకు పారిపోయాడు.

దేవతల పక్షాన యుద్ధం చేసేవారు లేరు. ఏం చెయ్యాలో అర్థం కాలేదు దేవతలకు. ఇంతలో నారద మహర్షి వారి దగ్గరకు వచ్చాడు. మహర్షితో తమ బాధలు మొరపెట్టుకున్నారు దేవతలు. "నారద మునీంద్రా! జలంధరుని బాధలు పడలేకుండా ఉన్నాము. అతడితో యుద్ధం చేసేవాళ్ళు కూడా లేరు. ఏం చెయ్యాలో మాకు పాలుపోవటం లేదు. నువ్వే మాకు దారి చూపించు" అని వేడుకున్నారు. అప్పుడు నారదుడు దేవతలతో, "జలంధరుడు గొప్ప భక్తుడు. వేదవేదాంగవిధుడు. బ్రహ్మ వరప్రసాది. ఈ కారణంచేత అతణ్ణి యుద్ధంలో గెలవటం చాలా కష్టం. పైగా అతడి భార్య బృంద పరమేశ్వరి భక్తురాలు. మహా పతివ్రత. ఆమె పాతివ్రత్యము చెడితేనే గాని జలంధరుడు మరణించడు. మీరంతా పరమేశ్వరుణ్ణి ఆరాధించండి. నాకు చేతనైంది నేను చేస్తాను". అని చెప్పి అక్కడ నుంచి బయలుదేరాడు. నారదుడు అలా లోక సంచారం చేస్తూ, జలంధరుని ఆస్థానానికి వచ్చాడు. నారద మహర్షిని ఉచితరీతిని గౌరవించి లోకాలలో విశేషాలు ఏమిటి? అన్నాడు. దానికి నారదుడు "రాక్షసరాజా! నీ పాలనలో దేశం సుభిక్షంగా ఉన్నది. సకాలంలో ఎండలు కురుస్తున్నాయి. వానలు పడుతున్నాయి. నువ్వు దేవతలను జయించావు. స్వర్గాన్ని ఆక్రమించావు. వైకుంఠము, కైలాసము కూడా కైవశం చేసుకున్నావు. దానవేంద్ర! ఇప్పుడు లోకంలో గొప్ప వస్తువులన్నీ నీ దగ్గరే ఉన్నాయి. ఇంద్రుని ఓడించి ఐరావతము, ఉచ్ఛైశ్వరము నీ ఆధీనం చేసుకున్నావు. మహత్తర శక్తిగల కామధేనువు, కల్పవృక్షము నీ ఆధీనంలో ఉన్నాయి. అష్టదిక్పాలకులు నీ అడుగులకు మడుగులొత్తుతున్నారు. ఈ రకంగా లోకంలో ప్రశస్తమైనవన్నీ నీ ఆధీనంలోనే

ఉన్నాయి. కాని చిన్న లోపం కనిపిస్తున్నది'' అన్నాడు. అంతవరకు తనని గురించిన పొగడ్తలు ఆనందంగా విన్న జలంధరుడూ, ఆ లోపం ఏమిటో తెలుసుకోవాలనే ఆతృతతో ''ఏమిటి మునీంద్రా! ఏమిటా లోపం?'' అన్నాడు. దానికి నారదుడు 'అది పెద్ద లోపమేమీ కాదు. ప్రశస్తమైన వస్తువులన్నీ నీ దగ్గరే ఉన్నాయి. కాకపోతే అందాల రాశి, లోకోత్తర సౌందర్యవతి, అపరంజి బొమ్మ, ఆమె మాత్రం నీ దగ్గర లేకుండా వేరొకరి దగ్గర ఉన్నది' అన్నాడు. ఆ మాటలు వినగానే, ఆ స్త్రీ మీద వ్యామోహము ఒక ప్రక్క, ఆమెను స్వాధీనపరచుకోలేకపోయాననే అవమానం ఇంకొక ప్రక్క, పీడించసాగాయి. ఇంక ఉండబట్టలేక 'ఆ సౌందర్యరాశి ఎక్కడ ఉన్నది?' అని నారదుణ్ణి అడిగాడు. 'దానవేంద్రా! ఆమె ప్రస్తుతము పరమేశ్వరుని భార్యగా ఉన్నది. అయినా పరమేశ్వరుని జయించి ఆమెను వశం చేసుకోవటం కష్టమైన పనేమో. పోనీలే' అంటూ కనిపించకుండా జలంధరుణ్ణి రెచ్చకొట్టాడు నారదుడు. ఈ మాటలు రాక్షసేంద్రుని మీద బాగా పనిచేసినాయి. వెంటనే పరమేశ్వరునితో యుద్ధం ప్రకటించాడు. ఒక ప్రక్క యుద్ధం జరుగుతోంది. తాను శంకరుని వేషం ధరించి, కొంతమంది రాక్షసుల చేత మాయా గణపతి వేషం వేయించి పార్వతీదేవి దగ్గరకు వెళ్ళి, శంకరుడు వచ్చాడని గణపతితో వర్తమానం పంపాడు. 'యుద్ధం జరుగుతుండగా శంకరుడు ఎలా వస్తాడు?' అని అనుమానం వచ్చిన పార్వతీదేవికి రాక్షసుల నిజస్వరూపం తెలిసింది. దాంతో వారు పారిపోయారు. అప్పుడు పార్వతీదేవి విష్ణుమూర్తికి వర్తమానం పంపి జలంధరుని భార్య బృంద. మహాపతివ్రత. ఆమె పాతివ్రత్యాన్ని గనుక పాడు చెయ్యకపోతే జలంధరుడు మరణించడు. కాబట్టి నువ్వెళ్ళి ఆ పని చూడు అన్నది.

బృంద దీక్షలో ఉండి పరమేశ్వరుని ధ్యానిస్తోంది. విష్ణువు జలంధరుని రూపంలో వెళ్ళి ఆమె పాతివ్రత్యానికి భంగం కలిగించాడు. పరమేశ్వరుడు పాశుపతంతో జలంధరుణ్ణి సంహరించాడు'' అంటూ జలంధరుని వృత్తాంతాన్ని వివరించాడు రత్నాకరుడు.



## సతీ తులసి

''గురుదేవా! 'తులసి' అంటే ఎవరు? ఆమె వృత్తాంతము ఏది? వివరించండి'' అన్నాడు. కృష్ణశర్మ వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

రాజసావర్ణి కుమారుడు వృషధ్వజుడు. అతడి కుమారుడు హంసధ్వజుడు. ఇతడికి ఇద్దరు కుమారులు. 1) ధర్మధ్వజుడు, 2) కుశధ్వజుడు.

ధర్మధ్వజుడు నిజంగానే ధర్మమూర్తి. చుట్టు ప్రక్కలగల రాజ్యాలన్నీ జయించి ప్రజారంజకంగా పాలిస్తున్నాడు. అతని భార్య మాధవి గుణవతి, శీలవతి.

కొంతకాలానికి ధర్మధ్వజుడికి మాధవి వలన ఒక ఆడపిల్ల పుట్టింది. ఆ సమయంలో అన్నీ శుభాలే జరిగినాయి. దేవతలు పూలవాన కురిపించారు. పుట్టిన బిడ్డ అందాల రాశి, కుందనపు బొమ్మ. సర్వ లక్షణాసమన్వితమైన ఆమెకు 'తులసి' అని నామకరణం చేశారు. నామకరణం కాగానే పిల్ల పదహారు సంవత్సరాల బాలిక అయిపోయి విష్ణువును తప్ప వేరెవరినీ వివాహమాడను అని చెప్పి బదరికావనానికి వెళ్ళి విష్ణుమూర్తిని గురించి తపస్సు చెయ్యటం మొదలుపెట్టింది. పంచాగ్నుల మధ్య ఉండి పదివేల సంవత్సరాలు తపస్సు చేసింది. పంచాగ్నులు అంటే 1) పూర్వాగ్ని, 2) దక్షిణాగ్ని, 3) పశ్చిమాగ్ని, 4) ఉత్తరాగ్ని, 5) సూర్యుడు. ఆ తరువాత ఆకులు మాత్రమే ఆహారంగా తీసుకుని - పదివేల సంవత్సరాలు. వర్షాకాలంలో నీటమునిగి - పదివేల సంవత్సరాలు శీతాకాలంలో గాలినే ఆహారంగా తీసుకుంటూ చలిలో ముప్పై వేల సంవత్సరాలు. ఈ రకంగా మొత్తం లక్ష సంవత్సరాలు తపస్సు చేసింది.

ఆమె తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకో అన్నాడు. దానికి తులసి 'ఓ దేవా! పూర్వజన్మలో నేను ఒక గోపికను. ఒకసారి నేను శ్రీకృష్ణునితో ఉండగా రాధ నన్ను చూసి మానవ జన్మ ఎత్తమని శపించింది. అప్పుడు కృష్ణుడు నన్ను ఓదార్చి నాలుగు చేతులు కలవాడు, నా అంశతో పుట్టి నిన్ను వివాహమాడతాడు అని చెప్పాడు. "అమ్మా! శ్రీకృష్ణుని చెలికాడు సుదాముడు. ఒకనాడు కృష్ణుడు గోపికలతో విహరిస్తున్న సమయంలో రాధ చూసి శ్రీకృష్ణుని పరుషంగా మాట్లాడింది. దానికి కోపించిన సుదాముడు రాధతో నువ్వు కృష్ణుణ్ణి ఎందుకు తిడతావు? అన్నాడు. అప్పుడామెకు సుదాముడి పై కూడా కోపం వచ్చి రాక్షసుడుగా పుట్టమని అతన్ని శపించింది. ఆ సుదాముడు దానవ వంశంలో పుట్టాడు. శ్రీ కృష్ణునిలాగానే నాలుగుచేతులు, బ్రహ్మ తేజస్సు కలిగి ఉంటాడు. అతడి పేరు శంఖచూడుడు. అతడు నీకు భర్త అవుతాడు. నీలాగే అతడు కూడా పూర్వజన్మ జ్ఞానం కలవాడు. ఆ తరువాత కాలంలో విష్ణువు భూమి మీద జన్మించినప్పుడు నువ్వు అతణ్ణి వివాహమాడతావు. నీకు వృక్షరూపం వస్తుంది. విష్ణుమూర్తికి ప్రాణాలకన్నా ప్రియురాలవవుతావు" అన్నాడు.

కశ్యప్రజాపతికి దనువునందు పుట్టినవాడు విప్రచిత్తు. ఇతడు హిరణ్యకశ్యపుని సోదరియైన 'సింహిక'ను వివాహమాడాడు. ఇతని కుమారుడు దంభుడు. దంభుడు పుత్రసంతానం కోసం విష్ణుమూర్తిని గురించి ఘోరమైన తపస్సు చేసి ఒక కుమారుని కన్నాడు. అతడి పేరు

శంఖచూడుడు. శంఖచూడుడు బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఇతడికి కృష్ణ కవచమిచ్చి 'ఇది నీ వద్ద ఉన్నంతవరకు నీకు ఏ రకమైన ఆపదా రాదు. బదరికావనములో తులసి అనే కన్య ఉన్నది. వెళ్ళి ఆమెను వివాహమాడు' అన్నాడు.

బదరికావనం చేరాడు శంఖచూడుడు. అక్కడ ఒంటరిగా ఉన్న తులసి కనిపించింది. దగ్గరకుపోయి పలకరించాడు. పరిచయం కాగానే ఇద్దరి తనువులూ పులకరించాయి. పూర్వజన్మల బంధం. దైవానుగ్రహం అలా ఉన్నాయి. ఒకరినొకరు కోరుకున్నారు. గాంధర్వ విధిని వారిని వివాహం జరిగిపోయింది.

శంఖచూడుడు తులసిని తీసుకుని తమ రాజధాని అయిన శోణిత పురానికి వెళ్ళి జరిగినదంతా తల్లితండ్రులతోను, గురువులతోను వివరించాడు. అందరూ జరిగిన దానికి చాలా ఆనందించారు. దంభుడు రాజ్యాన్ని కుమారున కప్పగించి వానప్రస్థానికి వెళ్ళిపోయాడు. తండ్రి వల్ల సంక్రమించిన రాజ్యానికి గురువైన శుక్రాచార్యుని అభీష్టం ప్రకారం పరిపాలిస్తున్నాడు శంఖ చూడుడు.

ఈ రకంగా కొంతకాలము గడిచింది. ఒకరోజున శుక్రాచార్యుడు శంఖచూడునితో "రాజా! దేవతలకు మనము చాలా కాలము నుండి విరోధమున్నది. దేవతలు మాయోపాయంతో మన పూర్వీకులను జయించారు. దేవతలను దెబ్బతీయగల సమర్థుడు. ఇంత కాలానికి రాజయినాడు. నీ పేరు విన్నంత మాత్రం చేతనే దేవతల గుండెలు అవిసిపోతున్నాయి. కాబట్టి నువ్వు స్వర్గం మీద దండెత్తి ఇంద్రాది దేవతలను పారద్రోలి స్వర్గాన్ని ఆక్రమించవలసినది" అన్నాడు.

యుద్ధానికి ముహూర్త నిశ్చయమైంది. రాక్షస సేన యుద్ధ సన్నద్ధమై బయలుదేరింది. దేవేంద్రుడు కుమారస్వామికి కబురు చేశాడు. దేవదానవుల మధ్య యుద్ధం ఘోరంగా జరిగింది. నలబై రోజులు గడిచినాయి. ఎవరూ వెనుకంజ వెయ్యటం లేదు. రాక్షసులు చాలామంది మరణించారు. అయినప్పటికీ మిగిలిన వారు అత్యుత్సాహము ముందుకు దూకుతున్నారు. చివరకు దేవ సైన్యము అలసిపోయింది. విషయం తెలుసుకున్నాడు ఇంద్రుడు. చేతకానప్పుడు చెయ్యి కలపటమే మేలు అనుకున్నాడు. వెంటనే సంధి ప్రయత్నాలు ఆరంభించాడు. దిక్పాలకులంతా నీకు దాసాను దాసులు అన్నాడు. తాను కూడా శంఖ చూడని సామంతునిగ స్వర్గాన్ని ఏలతాను అన్నాడు. సంతోషించాడు శంఖ చూడడు. యుద్ధం ఆగిపోయింది. ఈ స్వర్గానికి ఇంద్రుని తన ప్రతినిధిగా నియమించి శోణితపురానికి వెళ్ళి పోయాడు శంఖచూడడు.

కాలం గడిచిపోతోంది. రాక్షసులదే పైచేయిగా రాజ్యం నడుస్తోంది. కాని మునీశ్వరులు మాత్రం యజ్ఞయాగాలలో హవిర్భాగము దేవతలకే ఇస్తున్నారు. కాబట్టి ఇక నుంచి హవిర్భాగము తనకే చెందాలి అని శాసించాడు శంఖచూడుడు. మునులు ఎందుకు ఒప్పుకోలేదు. ఒప్పుకోని వారిని ముప్పతిప్పలు పెట్టారు రాక్షసులు. యజ్ఞవాటికలను ధ్వంసం చేశారు. హోమగుండాలను అపవిత్రం చేశారు. మహర్షులందరూ విష్ణువును ఆశ్రయించారు. వారి గోడు విన్న విష్ణుమూర్తి "మహర్షులారా! ఆ రాక్షసుణ్ణి నేను చంపటానికి కాదు. అతణ్ణి ఈశ్వరుడే సంహరించాలి. కాబట్టి కైలాసానికి పోయి శంకరుని శరణు వేడండి" అన్నాడు. మహర్షులంతా కైలాసానికి పోయి శంకరునికి మొరపెట్టుకున్నారు. శంకరుడు వారికి అభయమిచ్చి పంపేశాడు.

ఒక రోజున నారద మహర్షి శంఖ చూడిని వద్దకు వచ్చి "రాక్షసరాజా! మహర్షులంతా శివునితో నీకు బాధలు పెడుతున్నావని, వాటినింక భరించ లేమని మొరపెట్టుకున్నారు. శంకరుడు వారికి అభయమిచ్చాడు. కొద్దిరోజులలో శంకరుడు రుద్రగణాలను తీసుకుని నీ మీదకు యుద్ధానికి వస్తాడట. ఈ లోపుగా నువ్వే కైలాసం మీదికి దండెత్తితే ఎలా ఉంటుందో ఆలోచించు" అన్నాడు. దానవేంద్రుడికి ఈ సలహా బాగా నచ్చింది. వెంటనే యుద్ధ సన్నాహాలు చేశాడు. రాక్షససేనలు కైలాసం వైపు కదలినాయి.

యుద్ధం ప్రారంభమైంది. పోరు ఘోరంగా జరుగుతోంది. దేవసేనాని కుమారస్వామి చిత్తై పోయాడు. కాళి అతన్ని ఏమీ చెయ్య లేకపోయింది. ఆలోచించాడు విష్ణుమూర్తి. శంఖ చూడిని దగ్గర కృష్ణ కవచ మున్నది. గతంలో అతడు తపస్సు చేసినప్పుడు బ్రహ్మదున్ని బహూకరించాడు. అది దగ్గర ఉన్నంతవరకు అతడికి అపజయముండదు. ఇక అతని భార్య తులసి మహాపతివ్రత. కాబట్టి అతడి దగ్గర నుంచి కవచాన్ని సంగ్రహించాలి. అతని భార్య పాతివ్రత్యాన్ని చెడగొట్టాలి. అప్పుడు గాని ఆ రాక్షసుడు మరణించడు. అందుకని వృద్ధ బ్రాహ్మణ రూపంలో వచ్చి శంఖచూడుని కవచం దాన మడిగాడు. వచ్చిన వాడు విష్ణువని, తనకు కాలం తీరి పోయిందని తెలిసి కూడా కవచాన్ని దానం చేశాడు శంఖచూడుడు. ఆ కవచం ధరించి అచ్చు శంఖచూడునిలానే తయారయి తులసి దగ్గరకు పోయి ఆ రాత్రంతా ఆమెతో సుఖించాడు విష్ణుమూర్తి. ఆమె పాతివ్రత్యం చెడింది. పాశుపతంతో ఒక్క దెబ్బన శంఖచూడుని తలతెగ నరికాడు శంకరుడు.

నిద్రా సమయంలోను, రతిక్రియ తరువాత మాయలు నిలవవు. విష్ణుమూర్తికి నిజ రూపం వచ్చేసింది. తులసి కోపం హద్దులు దాటి పోయింది. మోసంతో తన శీలాన్ని హరించి, తన భర్త మరణానికి కారణమైన విష్ణువును పాషాణమై పొమ్మని శపించింది.

అప్పుడు విష్ణువు తులసిని ఓదారుస్తూ, శంఖచూడుని శరీరంలోని ఎముకలు శంఖజాతికి మూలమవుతాయి. వాటిలో పోసిన నీరు గంగాజలంలా పవిత్ర మవుతుంది. శంఖ ధ్వని వినిపించిన చోట లక్ష్మీదేవి నివాసముంటుంది. తులసీ! నువ్వ కూడా ఈ శరీరాన్ని వదలగానే దివ్య రూపం ధరిస్తావు. నీ శరీరం గండకీనది రూపంలో ప్రవహిస్తుంది. నువు పవిత్రమైన తులసి వృక్షానివౌతావు. తులసి దళాలను తాకినంత మాత్రం చేతనే పాపాలు నాశనమయిపోతాయి.తులసి దళాలు నీటిలో వేసి స్నానం చేస్తే కోటి తీర్థాలలో స్నానం చేసిన ఫలితం వస్తుంది. తులసి దళాలు వేసిన నీటితో అభిషేకం చేస్తే సహస్ర ఘటాభిషేకం చేసిన ఫలితం వస్తుంది. తులసి దళం దానం చేస్తే వేయిగోవులు దానం చేసిన ఫలం వస్తుంది. మరణకాలంలో తులసి తీర్థం గొంతులో పోస్తే, ఆ జీవి పుణ్య లోకాలకు పోతాడు. నిత్యము తులసి తీర్థం త్రాగేవాడికి లక్ష అశ్వమేధాలు చేసిన ఫలితం వస్తుంది. తులసి దళాలను శరీరం మీద ధరిస్తే వైకుంఠం ప్రాప్తిస్తుంది.తులసిని అగౌరవ పరచినవాడు నరకానికి పోతాడు. నువు గండకీ నదిగా ప్రవహిస్తావు. ఆ నదిలో నేను పాషాణ రూపంలో ఉంటాను. అదే సాలగ్రామము. సాలగ్రామాలు 1) లక్ష్మీనారాయణము, 2) లక్ష్మీ జనార్ధనము, 3) రఘునాథము, 4) వామనము, 5) శ్రీధరము, 7) దామోదరము, 7) రఘురామము 8) రాజ రాజేశ్వరము 9) అనంతము 10) మధుసూదనము 11) హయగ్రీవము 12) నారశింహము 13) లక్ష్మీ నృశింహము అని అనేక రకాలుగా ఉంటాయి. వీటిని పూజించిన వారికి విష్ణులోకం ప్రాప్తిస్తుంది. ప్రతిదినము సాలగ్రామము, శంఖము, తులసిలను పూజించేవాడు సరాసరి వైకుంఠానికి పోతాడు" అని అనేక వరాలిచ్చాడు. అప్పటినుంచి తులసి వృక్షంగా మారిపోయింది. ఆమె శరీరం గండకీనదిగా ప్రవహిస్తోంది. విష్ణువు సాలగ్రామ రూపంలో ఆ నదిలోనే ఉంటాడు అంటూ సతీ తులసి వృత్తాంతాన్ని వివరించాడు రత్నాకరుడు.



# నందికేశ్వర తీర్థము

"గురువర్యా! నందికేశ్వర తీర్థము ఎక్కడ ఉన్నది. అక్కడ స్నానం చేస్తే వచ్చే ఫలమేమిటి? దానికి ఆ పేరు ఎందుకు వచ్చిందో వివరించండి" అన్నాడు నారాయణ భట్టు. వివరించటం మొదలు పెట్టాడు కృష్ణశర్మ.

'రేవా'నదీ తీరంలో 'కర్ణకి' అనే గ్రామం ఉన్నది. ఆ ఊరిలో జ్ఞానసిద్ధుడు అనే పండితుడు ఉండేవాడు. అతని భార్య సుగుణమతి, అతని కుమారుడు కర్మసిద్ధుడు. జ్ఞానసిద్ధుడు వృద్ధుడైన తరువాత భార్యను కుమారుడికప్పగించి కాశీ నగరానికి వెళ్ళి తనువు చాలించాడు. కొడుకు, కోడలు తల్లిని అతి జాగ్రత్తగా చూచుకుంటున్నారు సుగుణమతికి కూడా వయస్సు పైబడింది. వృద్ధాప్యము వచ్చింది. ఒకరోజు కుమారుడిని, కోడలిని పిలిచి, "నాయనా! ఇంతకాలము నా ఇల్లు, నా కుమారుడు, నా కోడలు, నా భర్త అంటూ వెంపర్లాడాను. పుణ్యకార్యాలు ఏమీ చెయ్యలేదు. కనీసం కాశీ నగరానికి కూడా వెళ్ళలేదు. కాబట్టి నా మరణానంతరము అస్తికలు గంగలో కలుపుతానని మాటిస్తే నేను నిశ్చింతగా కన్నుమూస్తాను" అన్నది. కొడుకు, కోడలు తల్లి కోరిక తప్పకుండా నెరవేరుస్తామని మాటిచ్చారు. సుగుణమతి నిశ్చింతగా ప్రాణాలు వదిలి పరమేశ్వరునిలో ఐక్యమైపోయింది.

శాస్త్ర ప్రకారము తల్లికి కర్మచేసి, అస్థికలు మూటకట్టుకుని కాశీ నగరం బయలుదేరాడు కర్మసిద్ధుడు. అతడలా కొంతదూరం ప్రయాణం చేసి 'శుభ' అనే గ్రామం చేరి అక్కడ ఒక బ్రాహ్మణుని ఇంట సంధ్యావందనాది కార్యక్రమాలు నిర్వహించి జపం చేసుకుంటున్నాడు. రాత్రి ఎనిమిది గంటలయింది. గ్రామాంతరము వెళ్ళిన గృహస్థు ఇంటికి తిరిగి వచ్చాడు. అతడికి ఒక ఆవు ఉన్నది. దొడ్డిలో దాన్ని కట్టేశారు. యజమాని పాలు పాతకటానికి వెళ్ళి దూడను వదిలాడు. పాలు త్రాగాలనే ఉత్సాహంలో దూడ ఎగురుతూ యజమాని కాలు త్రొక్కింది. దాంతో కోపం వచ్చిన యజమాని కర్ర తీసుకుని దూడను నాలుగు బాదాడు. తరువాత పాలు పితికి మళ్ళీ దూడను వదలకుండా వెళ్ళిపోయాడు. యజమాని చేతిలో దెబ్బలు తిన్న దూడ చూస్తూ నిలబడిపోయింది. కాని దూడకు పాలు ఇవ్వలేదని తల్లి హృదయము కొట్టుకుపోయింది. అప్పుడు తల్లీబిడ్డల మధ్య సంభాషణ ఈ రకంగా జరిగింది.

దూడ : అమ్మా! ఎందుకు దుఃఖిస్తావు. పొరపాటున యజమాని కాలు తొక్కాను. అది పొరపాటని గ్రహించకుండా నన్ను కొట్టాడు. దీనికి దుఃఖించి ప్రయోజనము ఏమిటి? పూర్వజన్మలో చేసుకున్న పాపము అనుభవించాలి కదా!

ఆవు : బిడ్డా! జీవులన్నీ కర్మకు ఆధీనములే. కర్మఫలాన్ననుభవిస్తూ జీవి విర్రవీగటము, లేదా దుఃఖించటము కేవలం అజ్ఞానము, మాయామోహితుణ్ణి అజ్ఞానమావరిస్తుంది. నువ్వు చేసిన చిన్న తప్పు నిన్ను కొట్టటమే కాక పాలు కూడా త్రాగనివ్వలేదు. కాబట్టి ఆ విప్రుడకు పుత్రశోకము కలిగించాలనుకుంటున్నాను. అప్పటికి గాని నా కసి తీరదు.

దూడ : అమ్మా! పొరబడుతున్నావు. ఏ జన్మలో చేసిన పాపమో ఈ జన్మలో పశువులమై పుట్టాము. మళ్ళీ బ్రహ్మహత్యా పాతకమెందుకు చేస్తావు?

ఆవు : బిడ్డా! ఈ మాట నాకు తెలుసు. మాయను జయించినవాడు సాక్షాత్తు భగవానుడే అవుతాడు. బ్రాహ్మణ బాలుని చంపితే బ్రహ్మహత్యాపాతకము అని కదా నీ భయం. ఏం ఫరవాలేదు. బ్రహ్మహత్యా పాతకము ఒక్కటే కాదు. పంచమహాపాతకాలు చుట్టుకున్నా వదిలించుకునే మార్గం నాకు తెలుసు. రేపు ఉదయమే ఆ బాలుణ్ణి కొమ్ములతో పొడిచి చంపుతాను అప్పుడు బ్రహ్మ హత్యా పాతకం వల్ల నా శరీరమంతా నల్లగా మారిపోతుంది. తరువాత ఆ పాపాన్ని తుడిచేసుకుంటాను. మళ్ళీ నా శరీరము తెల్లగా మెరుస్తూ ఉంటుంది.

వాకిట్లో అరుగు మీద కూర్చున్న కర్మసిద్ధుడు ఈ మాటలన్నీ విన్నాడు. అతడికి ఆశ్చర్యం వేసింది. బ్రహ్మహత్యా పాతకము ఎలా తొలగిపోతుంది తెలుసుకోవాలని అనుకున్నాడు.

మరునాడు ఉదయాన్నే బ్రాహ్మణ బాలుడు పాలు పితకటానికి ఆవు దగ్గరకు వచ్చి కూర్చున్నాడు. వెంటనే ఆవు ఆ బాలుణ్ణి కాళ్ళతో తన్ని, కొమ్ములతో పొడిచి చంపేసింది. చూస్తుండగానే దాని శరీరము నల్లగా మారిపోయింది. అక్కడున్న వారంతా పిల్లవాడు మరణించాడని తెలిసి హాహాకారాలు చేస్తున్నారు. ఆవు పరుగెత్తుకుంటూ వెళ్ళి నర్మదానదీ తీరంలోని నందికేశ్వర తీర్థంలో మూడుసార్లు మునిగింది అంతే దాని శరీరము తెల్లగా మెరిసిపోతోంది. ఆశ్చర్యంగా చూస్తున్నాడు కర్మసిద్ధుడు. ఇంతలో ఒక దేవతా స్త్రీ అతడి కెదురుగా వచ్చి 'ఎవరు నువ్వు?' అని అడిగింది. తన వృత్తాంతం చెప్పాడు కర్మసిద్ధుడు. 'ఈ రోజు వైశాఖ శుద్ధ సప్తమి. నీ తల్లి అస్థికలను ఈ తీర్థంలో కలుపు. నేను గంగామాతను. నీ తల్లి పుణ్యలోకాలకు వెళుతుంది'' అన్నది. గంగాదేవి మాట ప్రకారం తల్లి అస్థికలను అక్కడ నదిలో కలిపాడు కర్మసిద్ధుడు. ఇంకా ఆశ్చర్యము. తల్లి దివ్య శరీరము ధరించి పుణ్యలోకాలకు వెళ్ళిపోయింది. ఇంతకీ ఆ తీర్థానికి నందికేశ్వర తీర్థమని పేరెందుకొచ్చిందంటే ....

పూర్వకాలంలో 'ఋషిక' అనే బ్రాహ్మణ కన్య చిన్నవయసులోనే భర్తను కోల్పోయి, నర్మదానదీ తీరంలో శివలింగాన్ని ప్రతిష్టించి దీక్షతో అర్చన చేస్తోంది. ఆ సమయంలో 'మూఢుడు' అనే రాక్షసుడు ఆమె దీక్షకు భంగం కల్పించసాగాడు. అనేక రూపాలు ధరించి ఆమెను భయపెట్టసాగాడు. అవి భరించలేక ఆమె 'శంకరా! పాహిమాం!' అంటూ బిగ్గరగా అరిచింది. ఆమెను రక్షించటానికి ముందుగా నందీశ్వరుడు తరువాత శంకరుడు, తరువాత గంగ వచ్చారు. గంగాదేవి ఆమెను చూసి ''నీకేం కావాలో కోరుకో'' అన్నది. దానికి ఆమె 'ఓ గంగా భవానీ! సంవత్సరంలో ఒక రోజున నేను స్నానమాడిన నదీ తీర్థంలో నీవు ఉండాలి' అన్నది. ఆ రోజు వైశాఖ శుద్ధ సప్తమి, కాబట్టి ఆ రోజున గంగాదేవి ఆ తీర్థంలో ఉంటుంది.

అంతే కాదు. విప్రకాంత ఆర్తనాదం చేసినప్పుడు ముందుగా వచ్చినవాడు నందికేశ్వరుడు. కాబట్టి దానికి 'నందికేశ్వర తీర్థము' అని పేరు వచ్చింది. అంటూ వివరించాడు రత్నాకరుడు.

# నందీశ్వరుడు



"గురుదేవా! శివుని వాహనము నంది. ఇతని తల్లిదండ్రులెవరు? ఇతని జన్మవృత్తాంతము ఏది? మాకు తెలియచెయ్యండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో సాలంకాయనుడు అని ఒక మహర్షి ఉండేవాడు. అతని కుమారుడు శిలాదుడు. శిలాదుడికి సంతానం లేదు. సంతానం కోసం అతను చెయ్యని వ్రతం లేదు. ఆడని తీర్థం లేదు. అయినా ప్రయోజనము కలుగలేదు. చివరకు శిలాదుడు హిమాలయ పర్వతాలకువెళ్ళి ఘోరమైన తపస్సు చెయ్యటం మొదలుపెట్టాడు. అలా చాలాకాలం గడిచింది. శిలాదుడు పట్టు వీడలేదు. అతని చుట్టూ పుట్టలు పెట్టినాయి. ఎట్టకేలకు అతని తపస్సుకు మెచ్చి శంకరుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. అప్పుడు శిలాదుడు శంకరుడికి నమస్కరించి "దేవదేవా! ఆశ్రితవత్సలా! అనాథ రక్షకా! నాకు సంతానం లేదు. నా వంశము నిలపటానికి అయోనిజుడైన కుమారుని ప్రసాదించు అతడు వేదవేదాంగవిదుడు, విద్వాంసుడు, సకల శాస్త్ర కోవిదుడు, గుణ సంపన్నుడు, గొప్ప శివభక్తుడు, దీర్ఘాయుష్మ కలవాడు అయి ఉండాలి" అన్నాడు.

శిలాదుని ప్రార్థన మన్నించి ఈశ్వరుడు "నువ్వు, కోరుకున్న కుమారుడు లభిస్తాడు, కాని అల్పాయుష్కుడవుతాడు" అన్నాడు.

శిలాదుడు ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. ఎంతకాలమైనా సంతానం కలగలేదు. ఇక లాభం లేదు అనుకుని సంతానం కోసం యాగం చెయ్యాలి అని సంకల్పించి యజ్ఞగుండాన్ని త్రవ్వుతున్నాడు. విచిత్రం అందుతో ఒక బాలుడు కనిపించాడు. చూడ చక్కని రూపురేఖలు, అందచందాలు, శరీర సౌష్టవము కలిగి ముద్దులు మూటగడుతున్న బాలుని ఇంటికి తెచ్చి పెంచుకోవటం మొదలుపెట్టాడు. శిలాదుడు. ఋషి దంపతులు ఆ బాలుణ్ణి అల్లారు ముద్దుగా పెంచుతున్నారు. ఒక రోజున అతడికి నామకరణం చేద్దాము అనుకున్నారు. అప్పుడు అశరీరవాణి "ఋషివర్యా! ఈ బాలుడు మీకే కాదు. ఆది దంపతులయిన పార్వతీపరమేశ్వరులకు కూడా ఆనందము కలుగచేస్తాడు. కాబట్టి ఇతడికి 'నందుడు' అని

నామకరణం చెయ్యండి'' అన్నది. ఆకాశవాణి చెప్పిన ప్రకారము బాలుడికి నందుడని పేరు పెట్టారు. ఎనిమిదవ ఏట ఉపనయనం చేశారు. విద్యాభ్యాసం కోసం గురుకులానికి పంపారు. బాలుడు ఏకసంధాగ్రాహి కావటంతో కొద్దికాలంలోనే సమస్త విద్యలూ నేర్చుకున్నాడు.

ఒక రోజున శిలాద దంపతులు నందుని దగ్గర కూర్చోబెట్టుకుని ఆశ్రమ ప్రాంగణంలో ముచ్చటలాడుతున్నారు. ఆ సమయంలో సూర్యదేవుడు, వరుణుడు శిలాదుని ఆశ్రమానికి వచ్చారు. స్వాగతసత్కారాలు, కుశల ప్రశ్నలు అయిన తరువాత నందుని జాతకం చెప్పమని వారిని అడిగాడు. 'బాలుడు మంచి విద్వాంసుడు, గొప్ప భక్తుడు, గుణ సంపన్నుడు. కాని అయుష్షు మాత్రం లేదు'' అన్నారు మిత్రావరణులు.

ఆ మాట విన్న శిలాద దంపతులు చింతించటం ప్రారంభించారు. కుమారుడు వారి వద్దకు వెళ్ళి, 'తండ్రి, మీ విచారానికి కారణము ఏమిటి?' అన్నాడు. అప్పుడు నందుడు తల్లిదండ్రులతో ''ఆర్యా'' అష్టైశ్వర్యములు, నవనిధులు, సమస్త విద్యలు ఉన్నప్పటికీ శివుని అనుగ్రహం దొరకదు. కాని శివుని అనుగ్రహం ఉంటే అవన్నీ వస్తాయి. కాబట్టి నన్ను ఆశీర్వదించి పంపండి. శివుని అనుగ్రహము సంపాదిస్తాను'' అన్నాడు తల్లిదండ్రులు ఆశీర్వాదం తీసుకుని తపోవనానికి వెళ్ళాడు నందుడు.

కేదారము వెళ్ళి అక్కడ తపస్సు ప్రారంభించాడు. నందుడి తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై నీకు ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి నందుడు. ''ప్రభూ! నీ దర్శన భాగ్యం కలిగిన తరువాత ఇంకా కావలసినది ఏముంది? ఎల్లవేళల యందు నీ దగ్గరే ఉండేటట్లు, నీకు సేవలు చేసేటట్లుగా నన్ను అనుగ్రహించు'' అన్నాడు. అతడి కోరిక మన్నించాడు శివుడు. 'దీర్ఘాయుష్మంతుడవై మాతో పాటు ఉండు'' అన్నాడు.

తరువాత నందుడు శివునితో కలిసి కైలాసానికి వెళ్ళి పార్వతీ పరమేశ్వరులకు సేవలు చేస్తున్నాడు. అతడి ప్రవర్తన శివుడికి బాగా నచ్చింది. ఒక శుభ ముహూర్తంలో శివుడు త్రిలోకవాసులను పిలిచి, అందరి సమక్షంలో నందీశ్వరుడికి గణాధిపత్యమునిచ్చాడు. అప్పుడు మరుత్తులు 'సుకీర్తి' అనే తమ కుమార్తెతో నందీశ్వరుడికి వివాహం చేశారు. ఆ సంతోష సమయంలో శివుడు నందీశ్వరుడితో ''నీవు నా భక్తుడవు, కార్యావసరములయందు మంత్రివి, సందర్భం వచ్చినప్పుడు భృత్యుడివి, నా వాహనానివి. ముల్లోకాలను జయించగల బలపరాక్రమాలు కలిగి ఉంటావు. నీ తల్లిదండ్రులు, తాత ముత్తాతలు ఐదు తరాలవారు నా రుద్రగణాలో చేరగలరు'' అని దీవించాడు. ఈ రకంగా శిలాదుడికి అయోనిజుడైన, కుమారుడు శివుని వాహనమైన నందీశ్వరుడైనాడు అన్నాడు రత్నాకరుడు.



# కాలభైరవుడు

"గురుదేవా! కాలభైరవుడు అంటే ఎవరు? అతనికి చుట్టుకున్న బ్రహ్మహత్యాపాతకము ఏ విధంగా తొలగిపోయిందో వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

సృష్టి ప్రారంభంలో ఒకసారి బ్రహ్మదేవుడు శివకేశవులనిద్దరినీ చూసి "నేను పరబ్రహ్మ స్వరూపుడిని. నేనే సృష్టికర్తను. మీరిద్దరూ నా ఆజ్ఞానుసారము నడుచుకోవాలి" అన్నాడు. దానికి శివుడు "బ్రహ్మదేవా! నువ్వు తెలిసి మాట్లాడుతున్నావో, తెలియకుండా మాట్లాడుతున్నావో నాకర్థం కావటం లేదు. విష్ణుమూర్తిని సృష్టించింది నేను. ఆ విష్ణువు యొక్క నాభిలోని పద్మము నుంచి నువ్వు పుట్టావు. సృష్టి కార్యక్రమములో నీకు తోడుగ ఉండటానికి సరస్వతిని సృష్టించి నీకు ఇచ్చాను. నీ మాటలు అహంకార పూరితముగా ఉన్నాయి. తమోగుణాన్ని ప్రకటిస్తున్నాయి. వేదాలన్నీ నేను సర్వేశ్వరుడను అని చెబుతుంటే నీవు ఇలా మాట్లాడటం బాగాలేదు" అన్నాడు. ఆ మాటలు బ్రహ్మ దేవుని తలకు ఎక్కలేదు. అప్పుడు శివుడు వేదాలను పిలిచి "ఓ వేదములారా! త్రిమూర్తులలో మీరు ఎవరిని పరబ్రహ్మగా గుర్తించి స్తుతిచేస్తున్నారో వివరించండి" అన్నాడు. అప్పుడు వేదములు "సర్వజగత్తుకూ ఆధారమైనవాడు, పరమేశ్వరుడు. పరబ్రహ్మ ఆ శంకరుడు తప్ప వేరెవరూ కాదు " అన్నది ఋగ్వేదము. "యజ్ఞయాగాదులు, ధ్యానము, యోగము అన్నీ ఈశ్వరుడే" అని చెప్పింది యజుర్వేదము. "అన్ని కర్మలకు ప్రేరకుడు శివుడు. కర్మల యొక్క ఫలాన్ని మనకిచ్చేది శివుడు. శివుడు కానిది ఏదీ చతుర్దశ భువనాలలోనూ లేదు" అన్నది సామవేదము.

"దేవతలకు, మానవులకు కూడా శాంతి సౌఖ్యాలు ప్రసాదించేవాడు, శివుడు. సర్వదుఃఖాలను పోగొట్టేవాడు శివుడు, తరింపచేసేవాడు శివుడు. అన్ని పనులు శివుని సంకల్పానుసారమే జరుగుతున్నాయి. శివ నామము, శివస్వరూపము మంగళ ప్రదమైనవి. మంగళ రూపిణి అయిన పార్వతీదేవికి అర్ధశరీరమిచ్చినవాడు శివుడు. అటువంటి శివుని స్మరించటము శుభప్రదము అని అధర్వణ వేదము అన్నది

"ఓంకార రూపము శివుడు, నాలుగు వేదాలకూ మూలపురుషుడు. పరాపశ్యంతీ మధ్యమ వైఖరి అనే వాగ్రూపము శివుడు. ఈ జగత్తంతా అతని సంకల్పానుసారమే పుట్టి

పెరుగుతున్నది. శివనామమే జీవనాధారము. ముక్తికి మార్గము. చతుర్విధ పురుషార్థ ప్రదాత ఈశ్వరుడు తప్ప వేరు కాదు. అని చెప్పాయి వేదాలు.

వేదాలు ఎన్ని విధాల చెప్పినా బ్రహ్మ వినలేదు. "నేనే పరబ్రహ్మను" అని మొండిగా చెప్పాడు. దాంతో శివుడికి కోపము వచ్చింది. శివుడు రౌద్రమూర్తి అయి ఒక్కసారి హూంకరించాడు. ఆ హూంకారము నుంచి భయంకరమైన రూపము గలిగిన మహాకాయము ఒకటి శివుని ఎదుట నిలిచింది. అది ఆకాశమంత ఎత్తున్నది. నాలుగు చేతులున్నాయి. మూడు కనులున్నాయి. చేతులందు శూలము, గద, ఢమరుకము ఉన్నాయి. అతడు ఢమరుకము మ్రోగించాడు. భూమ్యాకాశాలు, అష్టదిక్కులు దద్దరిల్లినాయి. ఆ శబ్దానికి అతడు చిందులు త్రొక్కాడు. భూమి కంపించింది. అతడి శరీరము పచ్చ కర్పూరములాగా వెలుగుతోంది. ఆ భయంకరాకారుడు శివునకు నమస్కరించి "స్వామీ! ఏమాజ్ఞ" అన్నాడు. అప్పుడు శివుడు అతడితో "బ్రహ్మదేవుడు తమోగుణ ప్రభావం వల్ల వేదాలను ధిక్కరిస్తున్నాడు, అతణ్ణి శిక్షించు" అన్నాడు. ఆ భయంకరాకారుడు తన చిటికిన వ్రేలి గోటితో బ్రహ్మదేవుని శిరస్సు ఒకటి త్రుంచి వేశాడు. ఆ శిరస్సు వెళ్ళి తూర్పు దిశగా పడింది. అదే బ్రహ్మ కపాలము. శివుని హూంకారము నుండి పుట్టినవాని ఆకారము కడు భయంకరముగా ఉంది కాబట్టి అతనికి కాలభైరవుడు అని పేరు పెట్టాడు ఈశ్వరుడు.

బ్రహ్మదేవుని గర్వము అణిగిపోయింది. అప్పుడు శివుడు కాలభైరవుని చూసి "కుమారా! బ్రహ్మ శిరస్సు ఖండించావు కాబట్టి నీకు బ్రహ్మ హత్యా దోషము అంటింది. ఆ పాతకము నీ వెన్నంటే ఉంటుంది. నీవు కాపాలికా వ్రతము అవలంబించి క్షేత్రాలన్నీ సందర్శిస్తూ చివరకు కాశీ పట్టణం చేరు. కాశీ పట్టణం చేరగానే బ్రహ్మహత్యా పాతకము నీ కనులముందే భస్మమైపోతుంది. నువ్విక కాశీ క్షేత్రంలో క్షేత్రపాలకుడిగా ఉంటూ నన్ను సేవించవలసినది" అన్నాడు.

బ్రహ్మ హత్యా పాతకము, వికృత రూపముతో, ఎర్రని బట్టలు ధరించి, ఎర్రని కనులతో, నిక్కబొడుచుకున్న వెంట్రుకలతో కాలభైరవుని సమీపించింది. భైరవుడు వేగంగా కదిలిపోయాడు. బ్రహ్మహత్యా పాతకము అతని వెనుకే వెళ్ళింది. ఈ రకంగా క్షేత్రాలన్నీ తిరిగి తిరిగి చివరకు కాశీ పట్టణం చేరాడు భైరవుడు. భైరవుడు కాశీ చేరగానే బ్రహ్మహత్యా పాతకము భగ్గున మండిపోయింది. భైరవుడు గంగాస్నానం చేశాడు. అతని శరీరము ధవళ కాంతులతో మిలమిలా మెరిసిపోయింది. ఆ తరువాత శివుని ఆజ్ఞ ప్రకారము కాశీ క్షేత్రానికి క్షేత్ర పాలకుడుగా ఉంటూ, భక్తులచే పూజలందుకుంటున్నాడు భైరవుడు అని కాలభైరవ వృత్తాంతాన్ని వివరించాడు రత్నాకరుడు.



# శరభసాళువు

"గురుదేవా! శరభము అంటే ఎనిమిది కాళ్ళు గల జంతువు. ఏనుగు వంటిది. సింహము కన్న బలమైనవి. అని కదా! మరి ఈ శరభసాళువు అంటే ఏమిటి? దాని గురించి వివరించండి అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

కృత యుగములో కశ్యప ప్రజాపతికి దితియందు హిరణ్యకశ్యప, హిరణ్యాక్షులనే కుమారులు కలిగారు. వీరు చాలా బలవంతులు. మహాతపశ్శక్తి సంపన్నులు. బ్రహ్మను గూర్చి అనేక వేల సంవత్సరాల తపస్సు చేశారు. హిరణ్యాక్షుడు భూమిని చాపగా చుట్టి సముద్రంలో పారేశాడు. శ్రీహరి వరహావతారమెత్తి భూమిని రక్షించాడు. హిరణ్యకశ్యపుని సంహరించాడు. ఆ విషయం తెలిసిన హిరణ్యాక్షుడు బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. అందరూ దానవులులాగానే చావు లేకుండా వరం కావాలి అన్నాడు హిరణ్యకశ్యపుడు. 'అది కుదరదు. పుట్టిన ప్రతి ప్రాణీ మరణించి తీరాల్సిందే. ఇంకేదైనా వరమడుగు? అన్నాడు బ్రహ్మ ఆలోచించాడు దానవరాజు. "అలా అయితే సరే, సృష్టికర్తా! నువ్వు సృష్టించిన దేనివలనా నాకు మృత్యువు రాకూడదు. పగలు గాని, రాత్రి గాని, ఇంట గాని, బయట గాని, భూమిపైగాని, ఆకాశం మీదగాని, దేవదానవుల వల్ల గాని, ఇతరుల వల్ల గాని, ఆయుధంతో గాని, ఆయుధం లేకుండా గాని నాకు మరణం రాకూడదు" అన్నాడు. అలాగే అన్నాడు బ్రహ్మ. వరబలముతో మహా గర్వించిపోయాడు హిరణ్యకశ్యపుడు.

హిరణ్యకశ్యపుడు తపోవనానికి వెళ్ళేటప్పటికి, అతని భార్య లీలావతి గర్భవతి. ఆమెను చెరబట్టాడు దేవేంద్రుడు మార్గమధ్యంలో నారదుడు అడ్డుపడి లీలావతిని విడిపించి, ఆమెను తన ఆశ్రమానికి తీసుకుపోయాడు. ఆమె గర్భంలో ఉన్న శిశువుకు అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించాడు. శ్రీమన్నారాయణుని లీలలను వినిపించాడు. ఈ రకంగా గర్భంలో ఉండగానే బాలునికి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కలిగింది. ఆత్మసాక్షాత్కారమైంది.

లీలావతి ప్రసవించింది. బాలుడికి ప్రహ్లాదుడు అని నామకరణం చేశారు. బాలుడు దినదినప్రవర్ధమానమవుతున్నాడు. ఛండామార్కుల వారి వద్దకు విద్యాభ్యాసం కోసం

పంపారు. అక్కడ తోటి పిల్లలతో హరినామస్మరణ చేయించాడు ప్రహ్లాదుడు. వారందరికీ తత్త్వబోధ చేశాడు. ఆదిమధ్యాంత రహితుడు శ్రీమన్నారాయణుడు. సృష్టి స్థితి లయ కారకుడు శ్రీమన్నారాయణుడు. ఈ జగత్తంతా అతడే నిండి ఉన్నాడు. ఈ రకంగా వైష్ణవతత్త్వాన్ని బోధిస్తున్నాడు ప్రహ్లాదుడు. "నాయనా! శ్రీహరి మన విరోధి. బ్రహ్మదేవుని ఆరాధించు. లేదా విష్ణుమూర్తిని ఆరాధించు అంతేకాని హరిని మాత్రం వద్దు" అన్నాడు తండ్రి. వినలేదు తనయుడు. తనయుని శిక్షించాడు తండ్రి. ఫలితం లేదు. విపరీతమైన శిక్షలు వేశాడు. ఏనుగులతో త్రొక్కించాడు. నిప్పులలో పడేయించాడు. సముద్రంలో నెట్టించాడు. కాని ప్రహ్లాదుడు మాత్రం విష్ణుభక్తి మానలేదు. చివరకు 'ఎక్కడ ఉన్నాడు మీ హరి' అన్నాడు. "తండ్రి ఒక చోట ఏమిటి తండ్రీ! భూమిలో, ఆకాశంపైన, నీటిలో, నిప్పులో అక్కడా ఇక్కడా అని ఏమిటి? ఎక్కడపడితే అక్కడే ఉన్నాడు" అన్నాడు తనయుడు. కోపం తన్నుకు వచ్చింది రాక్షసరాజుకు "ఐతే ఈ స్తంభంలో చూపగలవా?" అని అక్కడ ఉన్న స్తంభాన్ని కాలితో తన్నాడు దానవేంద్రుడు. ఆ స్తంభం విరిగిపోయింది. అందులో నుంచి బయటకు వచ్చాడు నరశింహుడు. తల మాత్రం సింహం, మిగిలిన శరీరమంతా మనిషి. హిరణ్యకశ్యపుని మీదికి దూకి, అతన్ని పట్టి వడిలో వేసుకుని గుమ్మం మీద కూర్చుని, వాడియైన గోళ్ళతో చీల్చి చంపివేశాడు. దానవేంద్రుడు కోరుకున్నట్లే అతనికి మరణం సంభవించింది.

హిరణ్యకశ్యపుని సంహరించిన తరువాత ఉగ్రంతో ఊగిపోయాడు ఉగ్రనరశింహుడు. దేవతలంతా వచ్చి శాంతించమని వేడుకున్నారు. ప్రహ్లాదుడు ప్రార్థించాడు. లాభం లేకపోయింది. లక్ష్మీదేవి దగ్గరకు రావటానికి భయపడిపోయింది.

ఇంక లాభం లేదనుకుని దేవతలంతా శంకరుని ప్రార్థించారు. ఏ విధంగానైనా శ్రీహరిని శాంతింపచెయ్యమన్నారు. ఆలోచించాడు శంకరుడు. ప్రపంచంలో కొన్ని జంతువులకు జాతి వైరము ఉన్నది. అవి గుర్రము - దున్నపోతు, మేక - కోతి, పాము - గ్రద్ద, పిల్లి - ఎలుక, జింక - కుక్క, కాకి - గుడ్లగూబ. కాబట్టి మనము సింహానికి జాతి వైరమున్న శరభము రూపం పొందుదాము అన్నాడు అనుకున్నదే తడువుగా శరభానికి తొండము - శంకరుడు, వీపు - బ్రహ్మ, నేత్రములు - సూర్యచంద్రులు, పార్శ్వభాగము - వాయుదేవుడు, గోళ్ళు - మేరు పర్వతాలు, ఈ రకంగా శరభము గిర్రున తిరుగుతూ నృశింహునితో తలపడింది. ఈ రెండింటి మధ్యన పోరు ఘోరమైంది. ఎంతకీ ఎవరూ వెనుకకు తగ్గలేదు. ఒక్క క్షణం ఆలోచించాడు హరి. ఎదురుగా తనను శాంతింపమని ప్రార్థిస్తున్న దేవతలు, ప్రహ్లాదుడు, భయకంపితయైన లక్ష్మీదేవి అర్థమైంది. తనను శాంతింపచేయటానికి శంకరుడు చేసిన పని

ఇది. విషయం తెలుసుకుని శాంతించాడు శ్రీహరి. ప్రహ్లాదుని శోణితపురానికి రాజుగా చేసి ఎవరి స్థలాలకు వారు వెళ్ళిపోయారు అన్నాడు రత్నాకరుడు.



# దేవతల గర్వభంగము

"గురుదేవా! ఇంద్రాది దేవతలకు గర్వమెందుకువచ్చింది? గర్వం ఏ రకంగా భంగమైంది? మాకు వివరంగా చెప్పండి. అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

దేవదానవ సంగ్రామం అనాదిగా జరుగుతూనే ఉన్నది. ఆ యుద్ధంలో ముందుగా దేవతలు ఓడిపోతున్నారు. రాక్షసుల చేతిలో దేవసైన్యము నాశనమైపోతోంది. అందుకని రాక్షసుల సాయంతో క్షీరసాగర మధనం చేశారు దేవతలు. ఉచ్ఛైశ్శ్వరము, ఐరావతము, కామధేనువు, కల్పవృక్షము చివరకు అమృతము పుట్టినాయి. శ్రీహరి మోహినీ రూపం ధరించి అమృతాన్ని దేవతలకు పంచాడు. ఈ రకంగా దేవతలు మరణాన్ని జయించారు.

ఒకసారి దేవదానవ సంగ్రామం జరిగింది. అందులో దేవతలే విజయం సాధించారు. ఈ విజయం తమ వల్లనే వచ్చింది అని దేవతలలో ప్రతి వారు చెప్పుకోసాగారు. వారికిఅహంకారం ప్రబలిపోయింది. దేవతలకు గుణపాఠం చెప్పాలి అనుకున్నాడు పరమేశ్వర స్వరూపుడయిన పరబ్రహ్మ. అనుకున్నదే తడవుగా ఒక పెద్ద భూతం దేవతల ముందు ప్రత్యక్షమయ్యింది. దేవతలు ఆ భూతాన్ని చూసి భయపడ్డారు. అది ఏమిటో అర్థం కాలేదు వారికి. దేవదానవయుద్ధంలో దానవులను తన అగ్నికీలలకు ఆహుతి చేశాను అని చెప్పిన అగ్నిదేవుని దగ్గరకు పోయి 'అగ్నిదేవా! ఆ భూతం ఏమిటో తెలుసుకుని రా!' అన్నారు. సరేనంటూ బయలుదేరాడు అగ్నిదేవుడు. ఆ భూతం దగ్గరకు వెళ్ళాడు అప్పుడు భూతం అడిగింది.

'నువ్వెవరవు?'

"నేను అగ్ని దేవుడను. నన్ను జాతవేదుడు అంటారు"

"నీ శక్తి ఏమిటి?"

"ఎంతటి వస్తువునైనా తృటిలో భస్మం చెయ్యలను"

"ఐతే ఈ గడ్డిపోచను భస్మం చెయ్యి' అంటూ ప్రక్కన ఉన్న గడ్డిపోచను అక్కడ పెట్టింది భూతం. అగ్నిదేవుడు నిప్పుల వాన కురిపించాడు. పెద్ద పెద్ద మంటలు రేపాడు. గడ్డి పోచ

కనికందలేదు. చేసేదిలేక అవమాన భారంతో వెనుదిరిగాడు అగ్నిదేవుడు. ఈసారి దేవతలు వాయుదేవుడి వద్దకు వెళ్ళారు. దేవ దానవ యుద్ధంలో తను గాలులు వీస్తుంటే దానవులు ఎగిరిపోయారు అని చెప్పాడు వాయువు. అందుచేత దేవతలు వాయువును సమీపించి "వాయుదేవా! నువ్వు ఆ భూతం ఏమిటో తెలుసుకుని రా!" అన్నారు. బయలుదేరాడు వాయుదేవుడు. భూతాన్ని సమీపించాడు.

"నువ్వెవరివి!" అడిగింది భూతం.

"నేను వాయుదేవుడను. ఆకాశంలో సంచరిస్తుంటాను. నన్ను మాతరిశ్వుడు అంటారు."

"నీ శక్తి ఏమిటి?"

"ఎంతటి వస్తువునైనా సరే తృటిలో ఎగరగొట్టి వేయగలను?"

"ఐతే ఈ గడ్డిపోచను ఎగరగొట్టు' అని ఇందాకటి గడ్డిపరకనే చూపింది భూతం.

వాయుదేవుడు చండప్రచండమైన గాలులు వీచాడు. గడ్డిపోచ కదలలేదు. సిగ్గుతో తలదించుకుని వెళ్ళిపోయాడు వాయువు.

దేవతలు ఇంద్రుని దగ్గరకు వెళ్ళారు. ఆ భూతం ఏమిటో కనుక్కోమన్నారు. ఇంద్రుడు భూతాన్ని సమీపించాడు.

"నువ్వెవరు!" అడిగింది భూతం.

"నేను ఇంద్రుడను దేవతలకు రాజును'

"నీ శక్తి ఏమిటి?"

"నిన్న జరిగిన యుద్ధంలో రాక్షస నాశనం చేశాను?"

"అలా అయితే ఈ గడ్డిపోచను కదుపు" అంటూ అక్కడ ఉన్న గడ్డిపరకను చూపించింది.

ఉఫ్‌మని ఊదాడు ఇంద్రుడు. గడ్డిపరక కదల్లేదు. గట్టిగా ఊదాడు. లాభం లేకపోయింది. తలెత్తి చూశాడు. అక్కడ భూతం లేదు. ఆ క్షణంలో అశరీరవాణి వినిపించింది.

'ఇంద్రాది దేవతలారా! ఇప్పటి వరకూ మీరు రాక్షసులను, మీ స్వశక్తితో జయించాము అనుకుంటున్నారు. అది అబద్ధం. మీ విజయానికి కారణం పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మమే ఇప్పటిదాకా మీ ముందు నిలబడి ఉన్నది. దాన్ని మీరు గుర్తించలేకపోయారు. మీ గర్వం అణచటానికే పరబ్రహ్మ అలా చేశాడు. ఇకనైనా 'అహంకరించకుండా బుద్ధిగా మెలగండి'

ఆ మాటలు విన్న దేవతలు తమ అజ్ఞానానికి సిగ్గుపడ్డారు.

ఈ విధంగా దేవతలకు గర్వభంగం జరిగింది అన్నాడు రత్నాకరుడు.

# పిప్పలాదుడు



"గురుదేవా! పిప్పలాద మహర్షి యొక్క జన్మవృత్తాంతాన్ని వివరించండి" అన్నాడు నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో విద్యాధరులకు రాజు చిత్రకేతువు. అతడు ఒకసారి శంకరుణ్ణి దర్శించాలని కైలాసానికి వెళ్ళాడు. ఆ సమయంలో శివుడు పార్వతిని వడిలో కూర్చోబెట్టుకుని, గాఢంగా ఆలింగనం చేసుకుని ఉన్నాడు. మహర్షులు, రుద్రగణాలు అన్నీ వారిచుట్టూ చేరి నమస్కరిస్తూ నిలుచున్నాయి. ఆ దృశ్యం చూసిన చిత్రకేతువు "భార్యాబిడ్డల సంసార బంధనాలలో కూరుకుపోయిన పామరుడులాగా ఈశ్వరుడు ఇలా చెయ్యటం బాగాలేదు. శివుడంతటివాడే ఈ రకంగా చేస్తే, రేపు మునులు, ఋషులు ఏం చేస్తారు?" అని పెద్దగానే అన్నాడు. ఆ మాటలు విన్న శివుడు చిన్న నవ్వి ఊరుకున్నాడు కాని, పార్వతి మాత్రం కోపంతో "నువ్వు రాక్షసుడుగా జన్మించు" అన్నది.

'త్వష్ట' అనేవాడు ఒక ప్రజాపతి. ఒకసారి ఇంద్రుని మీద అతడికి చాలా కోపం వచ్చింది. అందుకని ఇంద్రుని సంహరించటానికి తన తపశ్శక్తితో విశ్వరూపుడు అనే కుమారుని సృష్టించాడు. ఇంద్రుడు వాణ్ణి చంపేశాడు. విశ్వరూపుని మరణవార్త విన్న త్వష్ట హోమం చేశాడు. హోమగుండం నుంచి అగ్నితో సమానమైన తేజస్సు కలవాడు, సూర్యుడంత ప్రతాపం కలవాడు, దివ్యకాంతులతో విరాజిల్లేవాడు, అయిన కుమారుడు ఉదం[illegible]దాడు. పుత్రుడు పుట్టగానే పెరిగి ఆకాశమంత అయినాడు. అతని వెంట్రుకలు రాగి కడ్డీలలాగా ఎర్రగా ఉన్నాయి. కనులు నిప్పులు చెరుగుతున్నాయి. చేతిలో భయంకరమైన త్రిశూలమున్నది. నోరు కొండ గుహలా ఉంది. నాలుక సాచితే నక్షత్రమండలాన్ని తాకేటట్లున్నది. అతడు ముల్లోకాలను ఆవరించి ఉన్నాడు. అందుచేత వృత్రుడు అని పేరు పెట్టాడు త్వష్టప్రజాపతి.

వృత్రుడు ఇంద్రుని మీదికి దండెత్తి ఇంద్రుని ఓడించాడు. దేవతల దివ్యాస్త్రాలు వాడి ముందు పనిచెయ్యలేదు. అప్పుడు దేవతలంతా శ్రీమన్నారాయణుని ప్రార్థించారు. హరి వారి మొరాలించి ప్రత్యక్షమై "వృత్రుడు మహాబలశాలి, మహిమోపేతుడు. మీ దగ్గర ఉన్న ఆయుధాల వల్ల చావడు.

చ్యవనుని కుమారుడు దధీచి. పూర్వకాలంలో దేవతలు తమ అస్త్రాలను దధీచి మహర్షికి ఇచ్చి దాయమన్నారు. ఎంత కాలానికీ దేవతలు తిరిగి మహర్షి వద్దకు పోలేదు. అందుచేత ఆయన వాటిని పానం చేసేశాడు, అవి ఆయన ఎముకలకు పట్టినాయి. కాబట్టి

ఇప్పుడు దధీచి ఎముకలు తెచ్చి వాటిని ఆయుధాలుగా చేసి ప్రయోగిస్తే వృత్రుడు నశిస్తాడు అన్నాడు శ్రీహరి.

దేవతలంతా దీచి మహర్షి దగ్గరకు వెళ్ళారు. ఆయన తపోనిష్టలో ఉన్నాడు. దేవతలు మహర్షిని ప్రార్థించారు. "మీకు ఏం కావాలి?" అని అడిగాడు కనులు తెరిచిన మహర్షి 'మహర్షీ! వృత్రాసురుని బాధలు పడలేకుండా ఉన్నాము. అతడు తమ ఎముకలతో చేసిన ఆయుధాల వలన గాని చావడు. అందుచేత మీ వద్దకు వచ్చాము' అన్నారు. విషయం అర్థమైంది మహర్షికి. పుట్టిన ప్రతి ప్రాణీ మరణించక తప్పదు. మరణానంతరము శరీరము క్రిమికీటకాలకు ఆహారమవుతుంది. దానికన్నా ఈ రకంగా దేవ కార్యార్థం ఉపయోగించబడటం శ్రేయస్కరం కదా? అని ఆలోచించి సరే అన్నాడు, ఆ తరువాత ధ్యానంలో కూర్చుని కన్ను మూశాడు. అతని ఎముకలు తెచ్చి ఆయుధాలుగా చేసుకున్నారు దేవతలు. అతడి వెన్నెముకతో వజ్రాయుధం తయారుచేశాడు విశ్వకర్మ.

విష్ణుమూర్తి తన శక్తిని అందులో నింపాడు. వృత్రునితో యుద్ధం చేసి వజ్రాయుధంతో అతణ్ణి సంహరించాడు ఇంద్రుడు.

దధీచి భార్య లోపాముద్ర. ఈమెనే 'సువర్చ' అని కూడా అంటారు. తన భర్తను అన్యాయంగా బలి తీసుకున్నారు అని దేవతలను నిందించి, సహగమనానికి ఏర్పాటు చేసుకుంది. అప్పుడు అశరీరవాణి, 'అమ్మా! నువ్వు గర్భవతివి. ఇలా మరణించరాదు' అన్నది. దాంతో ఆమె తన గర్భాన్ని చీల్చుకుని, లోపల ఉన్న బాలుణ్ణి తీసి, ఆశ్రమ ప్రాంగణంలోని రావిచెట్టు క్రింద పడుకోబెట్టి, తాను సహగమనం చేసింది.

దేవతలు ఆ బాలుని దగ్గరకు పోయి అతడికి 'పిప్పలాదుడు' అని నామకరణం చేశారు. అతడు రుద్రావతారము. తరువాత కాలంలో పిప్పలాదుడు అనరణ్య మహారాజు కుమార్తెను వివాహమాడి స్వస్వరూప జ్ఞానం పొంది 'బ్రహ్మజ్ఞాని' అని పేరు పొందాడు అంటూ పిప్పలాదుని జన్మవృత్తాంతాన్ని వివరించాడు రత్నాకరుడు.



## నలదమయంతులు

"గురుదేవా! ఆహుకుడు, ఆహుకి అనే భిల్లు దంపతులు నలదమయంతులుగా జన్మించారు అని చెప్పగా విన్నాను. వారి వృత్తాంతము వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో కైలాస పర్వతానికి దగ్గరలో ఒక కీకారణ్యము ఉండేది. ఆ అరణ్యములో ఆహుకుడు అని ఒక భిల్లుడు ఉండేవాడు. అతని భార్య ఆహుకి. వారు గొప్ప శివభక్తులు. ప్రతిరోజూ సూర్యోదయం కాకముందే లేచి, కాలకృత్యాలు ముగించి ఈశ్వరుని అర్చించి, ఆ తరువాత వేటకు వెళ్ళేవాడు ఆహుకుడు. పశుపక్ష్యాదులను వేటాడి, వాటితో పాటుగా వెదురు బియ్యము, పుట్టతేనె, కందమూలాలు, దొరికినంతవరకు తీసుకువచ్చేవాడు. భర్త తెచ్చిన వాటిని వండి ముందుగా అతిథి, అభ్యాగతులకు పెట్టి, మిగిలినదానిని తాము తినేవారు.

ఈ రకంగా ప్రతిరోజూ శివార్చన, అతిథి పూజ చేస్తూ సుఖంగా కాలం గడిపేవారు భిల్లు దంపతులు. వారి సేవలకు నియమనిష్టలకు ఆనందించిన పరమేశ్వరుడు వీరి భక్తిని పరీక్షిద్దాము అనుకుని పార్వతీదేవితో, "దేవీ! భిల్ల దంపతుల భక్తిని పరీక్షించాలి అనుకుంటున్నాను. అందుకోసం నేను ఒక సన్యాసి రూపం ధరించి వాళ్ళ ఇంటికి వెడతాను. నువ్వు పెద్దపులి రూపంలో అక్కడకు వచ్చి, ఆ భిల్లుని ప్రాణాలు తీయవలసినది" అన్నాడు. సరేనంది ఆమె.

ఆ రోజు సూర్యాస్తమయమైంది. మసక చీకట్లు క్రమ్ముతున్నాయి. ఎవరో వాకిట్లో తిరుగుతున్నట్లనిపించింది. తలుపు తీశారు భిల్ల దంపతులు. బయట ఎవరో యతీశ్వరుడు. అతణ్ణి లోపలకు తీసుకుపోయి కాళ్ళు కడిగి, త్రాగటానికి నీరిచ్చారు. మార్గాయాసముతో ఉన్న అతడికి ఉపచారాలు చేశారు. రాత్రి అయినది. యతీశ్వరుడికి తియ్యని ఫలాలు, వెదురు బియ్యము, పుట్టతేనె తినటానికి ఇచ్చారు. బయట అడవి మృగాల గాండ్రింపులు వినిపిస్తున్నాయి. భిల్లుని ఇల్లు చాలా చిన్నది. ఇద్దరికి మాత్రమే సరిపోతుంది. మూడోవారికి చోటు ఉండదు. ఎవరైనా లోపలికి రావాలి అంటే, లోపలి వారు ఒకళ్ళు బయటకు రావాలి. ఆ యిల్లు చూసి యతీశ్వరుడు 'పూజ్య దంపతులారా! చిమ్మ చీకట్లు క్రమ్ముకుంటున్నాయి. గడపదాటి కాలు బయట పెట్టటము ప్రమాదము అనిపిస్తుంది. మృగాలు దగ్గరలోనే తిరుగుతున్నట్లున్నాయి. ఇల్లు చూస్తే బహు చిన్నది. ఏం చెయ్యటానికీ పాలుపోవటం లేదు' అన్నాడు. అప్పుడు భిల్ల పత్ని తన భర్తతో "నాథా! నువ్వు, ఈ స్వామి ఇంటి లోపల ఉండండి. విల్లంబులు తీసుకుని రాత్రంతా బయట కాపు కాస్తాను" అన్నది. దానికి భిల్లుడు "ప్రేయసీ! ఇవ్వాళ్ళ ఎందుకనో జంతువులు ఎక్కువగా తిరుగుతున్నట్లున్నాయి. నువ్వు, యతీశ్వరుడు లోపల ఉండండి. నేను ఆయుధము ధరించి, బయట మీకు కాపలాగా ఉంటాను" అన్నాడు. సరేనంది అతని భార్య.

ఆహుకి, యతీశ్వరుడు లోపల పడుకున్నారు. ఆహుకుడు బయట కాపలా కాస్తున్నాడు. రెండు ఝాములు దాటింది. మృగాల అరుపులు ఎక్కువైనాయి. పెద్దపులి ఒకటి గాండ్రిస్తూ

ూ, తిరుగుతూ వీరి ఇంటి వైపే వస్తోంది. దానికి
తిరుగుతోంది. అది అలా తిరుగుతు. తృటిలో గురి తప్పిపోయింది. పులి మితిమీరిన
గురిచూసి బాణం వేశాడు ఆహుకుదది. కత్తి తీసి పులిని నరకబోయాడు ఆహుకుడు.
కోపంతో ఆహుకుడి మీదకి దూకియాకేసింది. ఒక్క దెబ్బతో అతడి ప్రాణాలు గాలిలో
ఇంతలోనే పులి అతడి మీదకు దురిగిపోయింది.
కలిసిపోయాయి. అంతా క్షణంలో జమాసింది భిల్ల వనిత, అడవిలోని ఎండుపుల్లలు ప్రోగు
· తన భర్త మరణించటం కళ్ళారా అంటించి, భర్తతో పాటుగా తను కూడా అగ్ని ప్రవేశం
చేసి చితి పేర్చింది. ఆ చితికి నిప్పు ఆతీశ్వరుడి వద్దకు వచ్చి సెలవు తీసుకుంది. చితి
చెయ్యాలనుకుంది. నెమ్మదిగా యసింది. అంతా ఈశ్వరేచ్ఛ. నిత్యమూ శివార్చన చేసే
మండుతోంది. ఆ చితికి ప్రదక్షిణ చేది. భగవంతుడు లీలలు చాలా చిత్రమైనవి. ఆ
తమకు ఈ రకంగా కష్టం వచ్చిం్ని ప్రవేశం చేసింది భిల్లపత్ని.
పరమేశ్వరుణ్ణి మనసా ధ్యానిస్తూ అగలు చల్లారిపోయినాయి. చనిపోయిన భిల్లుడు లేచి
చిత్రం, మహా విచిత్రం. మంట్వరులు నిలబడి ఉన్నారు. చూశారు భిల్ల దంపతులు.
కూర్చున్నాడు. ప్రక్కనే పార్వతీ పరమేట అనుగ్రహించటానికి ముందుగా పరీక్షించాడు. రాత్రి
పరమేశ్వరుడు కరుణించాడు. తమనే ఉన్నది ఆ పరమేశ్వరుడే. దంపతుల ఆనందానికి
తమ ఇంట యతీశ్వరుని రూపంలోశ్వరుల పాదాలకు నమస్కరించారు.
హద్దులు లేవు, వారు పార్వతీ పరమేవదీసి "పుణ్యదంపతులారా! మీ జీవితము ధన్యమైనవి.
పాదములపైబడ్డ దంపతులను లేంగా జీవించండి. మరుజన్మలో సూర్యవంశపు రాజు
మీరిద్దరూ ధర్మమార్గాన చరిస్తూ సుఖ, విదర్భరాజు భీమసేనుని పుత్రిక దమయంతిగాను
వీరసేనుడి కుమారుడు నలుడుగానాంసలమై మీకు రాయబారం చేసి, మీ వివాహం
జన్మిస్తారు. అప్పుడు మేము రాజహ్యంత మనోహరంగా జరుగుతుంది" అని దీవించి
చేయిస్తాము. మీ స్వయంవరం అసలు అంటూ నలదమయంతుల జన్మ వృత్తాంతాన్ని
కైలాసానికి వెళ్ళిపోయారు ఆది దంప
వివరించాడు రత్నాకరుడు.



# ఉపమన్యువు

ఎవరు? కల్పాంతమువరకు అతడు జరామరణములు
"గురుదేవా! ఉపమన్యువు అంటేవివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం
లేకుండా ఎలా ఉండగలిగాడో
మొదలుపెట్టాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో వ్యాఘ్రపాదుడు అని ఒక మహర్షి ఉండేవాడు. అతని కుమారుడు ఉపమన్యువు. గత జన్మలో వేదాంగ విధుడు. మహా యోగి. కాని యోగ భ్రంశము వలన బ్రాహ్మణ బాలకుడుగా జన్మించాడు. వ్యాఘ్రపాదుడు బహు బీదవాడు. అందుచేత బాలుడికి పాలు పట్టలేక నీళ్ళలో పిండి కలిపి త్రాగించేవాడు. ఆ విధంగా పిండి కలిపిన పాలు త్రాగి త్రాగి పిల్లవాడు బక్కచిక్కిపోయినాడు. కొంతకాలానికి ఉపమన్యువు తల్లి, బాలుడిని తీసుకుని పుట్టింటికి వెళ్ళింది. అక్కడ వారికి గో సంపద పుష్కలంగా ఉంది. అందుచేత పాలు త్రాగి చక్కగా వళ్ళు చేశాడు పిల్లవాడు. ఇలా కొద్దిరోజులు అయిన తరువాత బాలుడిని తీసుకుని వ్యాఘ్రపాదుడి వద్దకు వచ్చింది. మళ్ళీ పిల్లవాడికి పాలకు బదులుగా నీటిలో పిండి కలిపి పట్టారు. అయితే పాలు త్రాగటానికి అలవాటు పడ్డ బాలుడు ఈ పిండి పాలు త్రాగనని మొండికేశాడు. జరిగిన విషయం తెలుసుకుని తండ్రి బుజ్జగించి, శివ పంచాక్షరీ మంత్రముపదేశించి, ఈ మంత్రాన్ని భక్తితో జపిస్తే శంకరుడు ఆవును, దూడను తెచ్చి ఇస్తాడు అని చెప్పాడు. బాలుడు పంచాక్షరీ జపం చేస్తున్నాడు.

ఒకనాడు శివుడు ఆ బాలుణ్ణి పరీక్షింపదలచి జంగమ వేషంలో వచ్చి శివుడు తిండి తినటానికి కూడా గతిలేనివాడు. భిచ్చమెత్తుకుని తింటాడు, కట్టటానికి బట్టలు లేక పులి చర్మం ధరిస్తాడు, ఉండటానికి ఇల్లు లేక శ్మశానములోనే ఉంటాడు. ఆభరణాలు లేవు, పాములే ఆభరణాలు అంటూ పాట పాడసాగాడు. అది విన్న బాలుడికి వెర్రికోపం వచ్చింది. వెంటనే ప్రక్కనున్న కర్రను తీసుకుని జంగమ దేవరను కొట్టబోయాడు. శంకరుడు ఆ బాలుడి భక్తికి ముగ్ధుడై గౌరీదేవికి బాలుణ్ణి చూపి, 'ఇతడు మన ప్రియ భక్తుడు. మన కుమారుని వంటివాడు' అన్నాడు. పార్వతి ఆ బాలుని ఎత్తుకుంది. ఆమె అరచేతి నుంచి పాలు ధారగా కారి కాలువయై ప్రవహించాయి. అదే పాలకొలనుగా మారింది. ఆంధ్రదేశంలో ఉన్న ఐదు ఆరామాలలోనూ ఒక్కటైన క్షీరారామము అదే.

శంకరుడు ఉపమన్యువును చూసి "బాలకా! నీకేం కావాలి?" అన్నాడు. "దేవదేవా! నన్ను కన్నతండ్రి వలె కరుణించు అంతే చాలు" అన్నాడు ఉపమన్యువు. అప్పుడు శివుడు అతడికి 'జరామరణములు లేకుండా కల్పాంతము వరకు వర్ధిల్లు అని దీవించాడు" అంటూ ఉపమన్యువు వృత్తాంతాన్ని వివరించాడు రత్నాకరుడు.



# సోమనాథుడు

"గురుదేవా! ఈశ్వరుడు దేశంలో పన్నెండు ప్రదేశాలలో జ్యోతిర్లింగముగా వెలిశాడు. వాటినే ద్వాదశ జ్యోతిర్లింగాలు అంటారు కదా. ఆ జ్యోతిర్లింగాలు గురించి వివరించండి' ' అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పరమేశ్వరుడు తన భక్తులను ఉద్ధరించాలనే తలంపుతో ద్వాదశ జ్యోతిర్లింగాలుగా వెలిశాడు. అవి

ప్రభాసము (గుజరాత్) - సోమనాథుడు
శ్రీశైలము (ఆంధ్రప్రదేశ్) - మల్లిఖార్జునుడు.
ఉజ్జయిని - మహాకాళేశ్వరుడు
ఓంకారము - అమలేశ్వరుడు
కేదారము - కేదారేశ్వరుడు
డాకిని - భీమశంకరుడు
కాశి (ఉత్తరప్రదేశ్) - విశ్వేశ్వరుడు
నాసిక్ (మహారాష్ట్ర) - త్ర్యంబకేశ్వరుడు
పల్యల - వైద్యనాథుడు
దారుకావనము - నాగేశ్వరుడు
రామేశ్వరము - రామేశ్వరుడు
శివాలయము - ఘృశ్మేశుడు

మొదటగా సోమనాథుని గురించి చూద్దాం. సౌరాష్ట్ర దేశంలో ప్రభాస తీర్థమున్నది.

దక్ష ప్రజాపతి తన అశ్వని, భరణి మొదలుగా గల నక్షత్రాలు ఇరవై ఏడు మంది పుత్రికలను చంద్రుడికి ఇచ్చి వివాహం చేశాడు. చంద్రుడు తన భార్యలందరిలోకి రోహిణియందు ఎక్కువ అనురాగము గలిగి, ఎక్కువ కాలము ఆమె వద్దనే గడిపేవాడు. ఈ విషయం మిగిలిన భార్యలకు బాధాకరంగా మారింది. వారంతా ఒక రోజున తండ్రియైన దక్ష ప్రజాపతి వద్దకు పోయి, చంద్రుడు తమను నిర్లక్ష్యం చేస్తున్నాడని మొరపెట్టుకున్నారు. దక్షప్రజాపతి చంద్రుని పిలిపించి "చంద్రా! నా కుమార్తెలు ఇరవై ఏడుమందిని నీకిచ్చి వివాహం చేశాను. నువ్వు అందరినీ సమంగా చూడాలి. అంతేగాని ఒకరిపై ఎక్కువ అనురాగము, వేరొకరిపై తక్కువ అనురాగము చూపకూడదు. ఈ ధర్మాన్ని గ్రహించి నీ భార్యలను జాగ్రత్తగా చూసుకో" అన్నాడు. సరే అన్నాడు చంద్రుడు. ప్రజాపతి మాట కాదనలేక సరే అన్నాడు. అంతేకాని తన బుద్ధిమాత్రం మార్చుకోలేదు. రోహిణితోనే ఎక్కువకాలం గడుపుతున్నాడు. మిగిలిన భార్యలు దక్ష ప్రజాపతి దగ్గరకు వెళ్ళి మళ్ళీ ఈ విషయం చెప్పారు. దాంతో కోపగించిన ప్రజాపతి చంద్రుని క్షయవ్యాధి పీడితుడు గమ్మని శాపం పెట్టాడు.

చంద్రుడికి క్షయ వ్యాధి సోకింది. రోజురోజుకి కృశించిపోతున్నాడు. ఇంక భరించలేక బ్రహ్మదేవుని దగ్గరకు పోయి తనను రక్షించమని మొరపెట్టుకున్నాడు. విషయం అంతా

విన్న బ్రహ్మదేవుడు చంద్రునితో "సౌరాష్ట్ర దేశంలో ప్రభాస తీర్థమున్నది. అక్కడికి పోయి మృత్యుంజయ మహామంత్రాన్ని జపించు" అని మంత్రోపదేశం కూడా చేశాడు.

ప్రభాస తీర్థమున చాలా కాలము మృత్యుంజయ మంత్ర జపం చేశాడు చంద్రుడు. చివరకు పరమేశ్వరుడు అనుగ్రహించి అతడికి ప్రత్యక్షమై 'నీకే వరం కావాలో కోరుకో' అన్నాడు. అప్పుడు చంద్రుడు తన మామగారు తనకిచ్చిన శాపం సంగతి చెప్పి, క్షయ వ్యాధి నుండి తనను రక్షించమని కోరాడు. దానికి శంకరుడు "చంద్రా! దక్ష ప్రజాపతి సామాన్యుడు కాదు. నవబ్రహ్మలలో ఒకడు. కాబట్టి అతడి మాట వ్యర్థం కాదు. అలా అని నీ ప్రార్థన త్రోసి పుచ్చటం న్యాయం కాదు. అందుచేత కొంతకాలం నువ్వు వ్యాధి గ్రస్తుడవుకా, మరికొంతకాలము సుఖంగా ఉండు. అంటే కృష్ణపక్షములో క్రమక్రమంగా నీ కళలు క్షీణిస్తాయి. మళ్ళీ శుక్లపక్షంలో ప్రతిరోజు వృద్ధి పొందుతాయి. ఈ రకంగా పౌర్ణమి రోజున పదహారు కళలతో విరాజిల్లు. అమావాస్య రోజున కళావిహీనుడివి అవుతావు అన్నాడు. అప్పటి నుంచీ చంద్రుడికి వృద్ధి క్షయాలు ఏర్పడినాయి.

ఆ తరువాత చంద్రుని ప్రార్థన మీద పరమేశ్వరుడు ప్రభాస తీర్థములో జ్యోతిర్లింగముగా వెలిశాడు. అక్కడ సోమునిచే పూజింపబడ్డాడు. కాబట్టి సోమనాథుడు అని పిలవబడుతున్నాడు.

సోమనాథుని అర్చించినవారికి భయంకర రోగములు కూడా పటాపంచలవుతాయి. మానసిక బాధలు తొలగిపోతాయి అంటూ వివరించాడు రత్నాకరుడు.

## మల్లిఖార్జునుడు



"గురుదేవా! ఆంధ్రదేశంలో ఉండే శ్రీశైలము ఒక మహా క్షేత్రము. మల్లిఖార్జునుడు జ్యోతిర్లింగాలలో ఒకడు. అటువంటి మల్లిఖార్జునుని చరిత్ర వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో పార్వతీ పరమేశ్వరులు తమ కుమారులకు వివాహం చేద్దాము అనుకున్నారు. అయితే వినాయకుడు, కుమారస్వామి ఇద్దరూ కూడా, ఎవరికి వారు తమకే ముందుగా వివాహం జరగాలి అని పట్టుబట్టారు. ఎన్ని విధాలుగా చెప్పినా లాభం లేకపోయింది. ఎవరూ పట్టు వదలలేదు. దాంతో కుమారులిద్దరినీ పిలిచి, "మీలో ముందుగా భూ ప్రదక్షిణ చేసి వస్తారో, వారికి ముందుగా వివాహం జరుగుతుంది" అన్నారు.

ఆ మాటలు వినగానే కుమారస్వామి నెమలి వాహనం మీద బయలుదేరి వేగంగా వెళ్ళిపోయాడు. కాని వినాయకుడు భారీ శరీరముతో కదలలేక తన తెలివితేటలతో ఆలోచించి జననీజనకులకు మూడుసార్లు ప్రదక్షిణ చేసి నమస్కరించి, "తండ్రీ! జననీ జనకులకు ముమ్మారు ప్రదక్షిణ చేస్తే, భూ ప్రదక్షిణ చేసిన ఫలితము వస్తుంది అని శాస్త్రం చెబుతున్నది. నేను ఆ పని చేశాను అన్నాడు. అతని బుద్ధికుశలతకు సంతసించి పార్వతీ పరమేశ్వరులు వినాయకుడికి సిద్ధి, బుద్ధిలతో వివాహం జరిపించారు.

కుమారస్వామి తిరిగి వచ్చేటప్పటికి వినాయకుడి వివాహం జరిగిపోయింది. తనకు అన్యాయం జరిగిందని అలక పూనాడు కుమారస్వామి.

దాంతో కైలాసం వదలి శ్రీశైలం చేరాడు. తల్లితండ్రులు నారదుడితో కుమారుణ్ణి రమ్మని వర్తమానం పంపారు. కుమారస్వామి వినలేదు. కుమారుణ్ణి వదలలేక పార్వతీదేవే అక్కడికి వచ్చింది. ఆమె వెనుక పరమేశ్వరుడు కూడా వచ్చాడు. కుమారుడు మాత్రం అక్కడి నుంచి రానన్నాడు. చేసేది ఏమీ లేక, కుమారుణ్ణి తీసుకుపోయే మార్గం తెలియక, పార్వతీ పరమేశ్వరులు శ్రీశైలం మీదనే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. ఈ విధంగా పరమేశ్వరుడు శ్రీశైలానికి విచ్చేశాడు.

పూర్వకాలంలో 'చంద్రగుప్తుడు' అనే రాజు ఉండేవాడు. అతడు కడు ధర్మపరుడు, నీతిపరుడు. ఈశ్వరుని అనుగ్రహం వల్ల అతడికి ఒక కుమార్తె కలిగింది. ఆమె పేరు 'చంద్రావతి'. బాలిక పుట్టగానే రాజు యుద్ధానికి వెళ్ళాడు. ఆ యుద్ధం చాలా సంవత్సరాలు జరిగింది. ఎలాగైతేనేం చివరకు శత్రు రాజులు పలాయనం చిత్తగించారు. చంద్రగుప్తుని విజయలక్ష్మి వరించింది.

ఇంటికి తిరిగి వచ్చాడు రాజు. ఇల్లు చేరి చేరగానే ఆ యింట్లో తిరుగుతున్న పదహారు సంవత్సరాల పిల్ల కనిపించింది. ఆమె చూడటానికి చాలా అందంగా ఉంది. రాజు మనసు నిలువలేదు.. పోయి ఆమెను పట్టుకున్నాడు. విదిలించుకుని పారిపోయింది బాలిక. వెంటపడ్డాడు రాజు. ఇంతలో భార్య వచ్చి చూసింది. ఘోరం జరిగిపోతున్నది. తన కన్న కుమార్తె వెంట పడుతున్నాడు తండ్రి. భర్తను వారించటానికి ప్రయత్నించింది. లాభం లేకపోయింది. బాలిక మందిర చివర భాగానికి వెళ్ళి, ప్రక్కనే ప్రవహిస్తున్న కృష్ణానదిలో దూకాలని ప్రయత్నించింది. నది రెండు పాయలుగా చీలిపోయింది. వెనుక నుంచి రాజు తరుముకు వస్తున్నాడు. చేసేది లేక రాజును 'ఆ నదిలో పచ్చల బండవై పడి ఉండు' అని శపించింది. మరుక్షణంలో రాజు పచ్చని బండరాయిగా మారి కృష్ణానదిలో పడ్డాడు. అందుచేతనే శ్రీశైలంలోని కృష్ణనీరు పచ్చగా ఉంటుంది.

రాకుమారి ఇంటి నుంచి బయటకు వచ్చేసింది. ఆ పర్వత శిఖరం మీద వెలసిన శివలింగాన్ని నిత్యమూ అర్చించటం మొదలుపెట్టింది. ఇతర ఆలోచనలు ఏమీ లేవు. ఎప్పుడూ ఈశ్వరుని నామస్మరణమే. ప్రతి నిత్యము ఆ దేవుని సుగంధ పరిమళాలు వెదజల్లే మల్లెపూలతో భగవంతుని ఆరాధించేది. ఈ రకంగా మల్లెపూలతో ఆరాధించబడ్డాడు కాబట్టి స్వామి "మల్లిఖార్జునుడు" పిలవబడ్డాడు.

శ్రీశైలము దివ్యక్షేత్రము. కైలాసములో ఉండేకన్న, శ్రీశైలములో ఉండటము శ్రేయస్కరమని శివుడే చెప్పాడు.

శ్రీశైలానికి ఇంకొక ప్రత్యేకత కూడా ఉన్నది. మల్లిఖార్జునుడు ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకడు అయితే అతని భార్య భ్రమరాంబ అష్టాదశ శక్తి పీఠాలలో ఒకటి. ఇలాంటివి దేశం మొత్తం మీద మూడే ఉన్నాయి. అవి :

శ్రీశైలము - భ్రమరాంబ, మల్లిఖార్జునుడు

కాశి - విశాలాక్షి, విశ్వనాథుడు

ఉజ్జయిని - మహాకాళి, మహాకాళేశ్వరుడు

వీటన్నింటిలోకి శ్రీశైలము ముఖ్యమైనది అంటూ వివరించాడు రత్నాకరుడు.

# మహాకాళేశ్వరుడు



"గురుదేవా! ఉజ్జయినిలో మహాకాళేశ్వరుడు ఉన్నాడు కదా! ఆ జ్యోతిర్లింగ విశేషాలను వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలములో ఉజ్జయినీ పట్టణములో 'వేదప్రియుడు' అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు వేదవేదాంగ విదుడు. యజ్ఞయాగాది కర్మలనాచరించేవాడు. విశేషించి శివభక్తుడు. అతనికి నలుగురు కుమారులు.

ఉజ్జయినికి దగ్గరలోనే 'రత్నమాల' అనే పర్వతము ఒకటున్నది. ఆ పర్వతము మీద 'దూషణుడు' అనే రాక్షసుడు నివాసమున్నాడు. అతడు బ్రహ్మను గురించి తపస్సు చేసి అనేక వరాలు పొందాడు. వరబల గర్వితుడై బ్రాహ్మణులను పీడిస్తున్నాడు. యజ్ఞ యాగాది కర్మలు పాడు చేస్తున్నాడు. ఒకరోజు ఆ రాక్షసుడు ఉజ్జయినీ పట్టణాన్ని ముట్టడించాడు. ఆ రాక్షసుని సేన గ్రామంలో పడి ప్రజలను పీడిస్తోంది. ఆ రాక్షసుడు ఈ బ్రాహ్మణోత్తముని

ఇంట ప్రవేశించి పెద్ద పెద్దగా అరుస్తూ వేదప్రియుణ్ణి చంపటానికి చూస్తున్నాడు. ఆ సమయంలో వేదప్రియుడు ఒక పార్థివలింగాన్ని ఆరాధిస్తున్నాడు. ధ్యానంలో ఉన్న బ్రాహ్మణుణ్ణి చంపటానికి కత్తి ఎత్తాడు రాక్షసుడు. మరుక్షణంలో ఆ శివలింగము నుంచి మహాదేవుడు ఉద్భవించి రాక్షసుణ్ణి చంపేశాడు. రాజు మరణించగానే, అతడి సేన కూడా పలాయనం చిత్తగించింది.

ఈశ్వరుడు వేదప్రియుడితో "వత్సా! నీ భక్తికి మెచ్చాను, నీకు ఏం వరం కావాలో కోరుకో" అన్నాడు. దానికి బ్రాహ్మణుడు "ప్రభూ! భక్తవత్సలా! ఆర్తత్రాణ పరాయణా! నువ్వు మృత్యుంజయుడవు. నీ కృపా విశేషము వల్లనే ఇవ్వాళ నా ప్రాణాలు నిలిచాయి. కాబట్టి నువ్వు ఈ గ్రామంలోనే వెలసి, భక్తులను రక్షించవలసినది" అన్నాడు. ఆ మాటలు విన్న పరమేశ్వరుడు అక్కడ జ్యోతిర్లింగమైనాడు.

ఈ క్షేత్రం శిప్రానదీ తీరములో ఉన్నది. శిప్రా నదిలో స్నానం చేసి, ఇక్కడ మహాకాళేశ్వరుని సేవించినట్లైతే దరిద్రము, అన్ని రకాల దుఃఖాలు, అన్ని భయాలు పారిపోతాయి.

ఇక్కడ ఆలయం ఐదు అంతస్థులుగా ఉంటుంది. క్రింది అంతస్థులో మహాకాళేశ్వరుడు ఉంటాడు. ప్రతిరోజు సూర్యోదయానికి పూర్వమే ఆ లింగానికి అభిషేకం చేసి, చితా భస్మాన్ని లింగానికి అలంకరిస్తారు. గురువు సింహరాశిలోకి వచ్చినప్పుడు శిప్రానదికి పుష్కరాలు వస్తాయి. ఈ గ్రామానికి దేవత 'అదంతిక'. అందుచేతనే ఈ పట్టణాన్ని అవంతి అని కూడా అంటారు.

**ఆకాశే తారకం లింగం పాతాళే హటకేశ్వరం**
**మర్త్యలోకే మహాకాయం లింగత్రయ నమోస్తుతే ॥**

ఆకాశంలో తారకేశ్వర లింగము, పాతాళములో హటకేశ్వర లింగము, భూలోకములో మహాకాళేశ్వర లింగము దేవతలకు కూడా పూజనీయములు అన్నాడు రత్నాకరుడు.



## ఓంకారేశ్వరుడు

"గురుదేవా! వింధ్య పర్వతాలలో ఓంకార క్షేత్రమున్నది అంటారు. ఆ క్షేత్రాన్ని గురించి తెలపండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో ఒకసారి నారదుడు క్షేత్రాలన్నీ దర్శించుకుంటూ, వింధ్య పర్వతము మీదికి వచ్చాడు. నారద మహర్షి రాగానే వింధ్యరాజు ఎదురువెళ్ళి స్వాగత సత్కారాలందించి ఉచిత రీతిన గౌరవించాడు. కుశల ప్రశ్నలు అయిన తరువాత ఇష్టాగోష్టి జరుగుతోంది. ఆ సమయంలో వింధ్యరాజు "నారద మహర్షీ! మీరు త్రిలోక సంచారులు. మీకు తెలియని విషయం ఏదీ లేదు. నా దగ్గర సమస్త సంపదలు, సకల ధాతువులు, బంగారము మొదలైన లోహములు కోకొల్లలుగా ఉన్నాయి. అటువంటప్పుడు పర్వతాలలో సార్వభౌముడు అని చెప్పదగినవాడు నేను గాక ఇంకెవరు?" అన్నాడు.

ఆ మాట విని పెద్ద నిట్టూర్పు విడిచాడు నారదుడు. ఆశ్చర్యపోయాడు వింధ్యరాజు. మహర్షి నిట్టూర్పుకు కారణము ఏమిటి? పర్వతాలలో సార్వభౌముడు తను కాదా? ఈ రకంగా ఆలోచిస్తూ "మహర్షీ! మీ నిట్టూర్పుకు అర్థం ఏమిటి?" అన్నాడు. దానికి నారదుడు "వింధ్యరాజా! నువ్వు చెప్పినదంతా నిజమే. నీ దగ్గర సర్వసంపదలు, సమస్త ధాతువులు, బంగారము మొదలుగా గల లోహాలు ఉన్న మాట నిజమే. కాని మేరుపర్వత శిఖరాలు మహోన్నతములై దేవలోకం దాకా వ్యాపించి ఉన్నాయి. అందుకని ఇంద్రాది దేవతలందరూ అక్కడ విహరిస్తూ ఉంటారు. నీకా భాగ్యము లేదు. అందుకే నాకు విచారము" అన్నాడు.

మేరు పర్వతము కన్న గొప్ప అనిపించుకోవాలంటే ఆ పరమేశ్వరుని ఆరాధించటము కాక మరే మార్గం లేదు అని నిశ్చయించి తపస్సు చెయ్యటానికి ఓంకార యంత్రము ఒకటి తయారుచేసి, దాని మీద పార్థివ లింగము స్థాపించి సంకల్పించాడు. ఆ రకంగా నూరు నెలలు ఘోరమైన తపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి భక్త సులభుడైన పార్వతీపతి ప్రత్యక్షమై 'ఏ వరం కావాలో కోరుకో!' అన్నాడు.

"పరమేశ్వరా! చంద్రమౌళీశ్వరా! పాహిమాం తండ్రీ! పాహిమాం! నీ కరుణ లేశమాత్రము ఉన్నప్పటికీ, న భక్తుల కోరికలు పూర్తిగా తీరిపోతాయి. అలాంటిది నువ్వు ప్రసన్నమైనావు. నాకు ఇంక కావలసినది ఏమున్నది. అయినప్పటికి నాదొక చిన్న ప్రార్థన. మేరువు శిఖరాలు బాగా పెద్దవిగా, దేవతలు విహరించటానికి వీలుగా ఉండటము నాకు భరించలేకుండా ఉన్నది. దేవతలందరూ నీ పాదాలకు నమస్కరిస్తారు కాబట్టి, అటువంటి నువ్వు, నా శిఖరాన సదా నివసించవలసినదిగా నా ప్రార్థన" అన్నాడు వింధ్యరాజు.

ఆ పలుకులు ఆలకించిన శంకరుడు, భక్తుడైన వింధ్యరాజు కోరిక తీరుస్తానన్నాడు. ఇప్పుడు ఓంకార యంత్రము, పార్థివ లింగము రెండుగా అయిపోయినాయి. ఓంకార యంత్రమందు ఉద్భవించినవాడు ఓంకారేశ్వరుడు, పార్థివ లింగమందు ఉద్భవించినవాడు అమలేశ్వరుడు. ఇక్కడ నర్మదానది కూడా రెండు పాయలుగా చీలిపోయింది. ఆ రెండు

పాయల నడుము ఒక శిఖరమున్నది. ఆ శిఖరము మీద సూర్యవంశపు రాజు మాంధాత ఓంకార రూపంలో దేవాలయాలు కట్టించాడు. ఓంకార క్షేత్రానికి వెళ్ళాలి అంటే యాత్రికులు నర్మదా నదిని పడవల మీద దాటి బ్రహ్మపురి, విష్ణుపురి అనే కొండలను దర్శించి వెళ్ళాలి అంటూ వివరించాడు రత్నాకరుడు.



# వైద్యనాథుడు

"గురువర్యా! 'వైద్యనాథుడు' అంటారు కదా! ఆయన ఎక్కడ ఉన్నాడు? ఆయన చరిత్ర వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం మొదలుపెట్టాడు కృష్ణశర్మ.

త్రేతాయుగంలో రావణబ్రహ్మ లంకానగరాన్ని పాలిస్తుండేవాడు. అతడు గొప్ప శివభక్తుడు. ఒకసారి రావణుడు శివుని గూర్చి ఘోర తపస్సు చేశాడు. ఎంతకాలమైనా శివుడు ప్రత్యక్షం కాలేదు. ఇక లాభం లేదు, ఇది కాదు పని అనుకుని హోమగుండాన్ని ప్రజ్వలింపచేసి అందులో తన తలను నరికి వేశాడు. శివుడు ప్రత్యక్షం కాలేదు. రావణుడు ఆగలేదు. ఒకటి తరువాత ఒకటిగా తొమ్మిది తలలు నరికి అగ్నికి ఆహుతి చేశాడు. శివుడు కరుణించలేదు. చివరగా తన పదవ తలను కూడా అహుతి చెయ్యాలనే తలంపుతో నరకబోయాడు. వెంటనే ఈశ్వరుడు ప్రత్యక్షమై "భక్తా! నీ భక్తికి, పట్టుదలకు మెచ్చాను. ఏ వరం కావాలో కోరుకో' అన్నాడు. శివుని అనుగ్రహం కలగగానే రావణుని తలలన్నీ యధాస్థానానికి వచ్చేశాయి. అప్పుడు ఆ భక్తాగ్రేశరుడు.

"దేవదేవా! మహాదేవా! సర్వకాల సర్వావస్థల యందు నిన్ను తనివితీరా చూడాలన్నదే నా కోరిక. నువ్వు కైలాసములో, నేను లంకలో ఉంటున్నాము. భక్తుడు ఉండే చోటనే భగవంతుడు ఉండాలి గాని, భక్తుడు ఒక చోట, భగవంతుడు ఒక చోట ఉండవచ్చునా? అది మంచి పద్ధతి కాదుకదా? అందుకని పత్నీపుత్ర పరివార సమేతంగా నువ్వు నా లంకలోనే ఉండవలసినది" అన్నాడు. ఆ మాటలు విన్న దేవదేవుడు "దానవేంద్రా! నీ కోరిక సమంజసముగానే ఉన్నది. కానీ నేను కైలాసము నుంచి కదలిరావటమనేది దుస్సాధ్యము. అందుచేత నా స్వరూపమైన ఆత్మలింగాన్ని ఇస్తాను. దాన్ని తీసుకుపోయి లంకలో ఉంచుకో. ప్రతినిత్యము ఆ లింగములో నన్ను వీక్షించు. అయితే మార్గమధ్యంలో ఎక్కడా దాన్ని నేల మీద మాత్రం ఉంచకు' అని ఆత్మలింగాన్ని అతని చేతికిచ్చాడు.

రావణుడు ఆ లింగాన్ని తీసుకుని వస్తున్నాడు. మార్గమధ్యంలో ఒక స్మశానం దగ్గర అతడికి మూత్ర విసర్జన చెయ్యవలసిన అవసరం వచ్చింది. ఆత్మలింగాన్ని చేతిలో ఉంచుకుని మూత్రవిసర్జన చెయ్యటం లేదు, అలా అని లింగాన్ని నేల మీద ఉంచలేడు. ఏం చెయ్యాలి? ఇలా ఆలోచిస్తున్న సమయంలో దూరాన ఒక గొల్ల పిల్లవాడు కనిపించాడు. ఆ బాలుణ్ణి పిలిచి, అతడి చేతికి శివలింగమిచ్చి, తాను మూత్ర విసర్జనకు వెళ్ళాడు. అప్పటివరకు చిన్నగా ఉన్న శివలింగము బాలుడి చేతిలోకి వెళ్ళగానే ఆకారము, బరువు పెరగటం మొదలుపెట్టింది. అలా పెరిగిపోయి ... పెరిగిపోయి బాలుడు మోయలేనంతగా అయింది. దాంతో ఆ బాలుడు ఆ లింగాన్ని క్రింద పెట్టేశాడు.

రావణబ్రహ్మ తిరిగి వచ్చాడు. ఆత్మలింగము నేలమీద పెట్టి ఉన్నది. విషయం చెప్పాడు బాలుడు. చేయగలిగింది లేదు. దుఃఖించాడు రావణుడు. లింగాన్ని పైకెత్తటానికి ప్రయత్నం చేశాడు. అది పాతాళ లోకందాకా కూరుకుపోయింది. ఎన్ని విధాల ప్రయత్నం చేసినా ఆత్మలింగాన్ని పైకి తియ్యలేకపోయాడు. ఆఖరుగా ఆ లింగాన్ని పరిపరివిధాల పూజించి లంకానగరానికి వెళ్ళిపోయాడు.

బ్రహ్మాది దేవతలంతా వచ్చి, ఆత్మలింగాన్ని దర్శించి, "దేవదేవా! ఈ స్మశాన భూమిలో వెలిశావు కాబట్టి నిన్ను అర్చించినవారికి రోగాలు కుదిరేటట్లు గాను, వారి ఆరోగ్యాలు కుదుటపడేటట్లుగాను దీవించి వైద్యనాధుడను పేర వెలసిల్లవలసినదిగా ప్రార్థించారు అంటూ వైద్యనాధుని వృత్తాంతము వివరించాడు రత్నాకరుడు.



## భీమశంకరుడు

"గురువర్యా! జ్యోతిర్లింగాలలో భీమశంకరుడు ఒకడు కదా! ఆయన వృత్తాంతమేమిటి?' అని అడిగాడు నారాయణభట్టు చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో సహ్యాద్రి మీద 'భీముడు' అని ఒక రాక్షసుడు ఉండేవాడు. అతని తల్లి పేరు 'కర్కటి'. ఆ రాక్షస బాలుడు ఆటలాడుతూ ఒకనాడు తన తల్లితో 'అమ్మా! నా తండ్రి ఎవరు?' అని అడిగాడు. దానికి ఆ రక్కసి "నాయనా 'కర్కటుడు' అనే రాక్షసుడు నా తండ్రి. 'పుష్కసి' నా తల్లి. నా తల్లితండ్రులకు నేను లేక లేక కలిగిన గారాల బిడ్డను. నన్ను అపురూపంగా పెంచి పెద్దచేసి విరాధుడు అనే దానవుడికి ఇచ్చి వివాహం చేశారు.

శ్రీరాముడు వనవాసానికి వచ్చినప్పుడు నా భర్తను సంహరించాడు. అప్పటికి నాకు పిల్లలు లేరు. భర్తను పోగొట్టుకున్న నేను ఒంటరినై నా తల్లిదండ్రుల పంచన చేరాను. అలా చాలాకాలం గడిచింది. ఒకరోజున భీమానదిలో స్నానం చెయ్యటానికి అగస్త్యుడు శిష్య సమేతంగా వచ్చాడు. నా తల్లితండ్రులు అతన్ని చూసి చంపి తినబోయారు. మహర్షి తన మీదకి వస్తున్న రాక్షసులను చూసి కోపాగ్నితో భస్మం చేసేశాడు. ఇప్పుడు నాకు కట్టుకున్న భర్తా లేడు. కన్నతల్లితండ్రులూ పోయారు. దిక్కులేని అనాథనై పోయాను. అలాగే సహ్యాద్రి మీద కాలం గడుపుతున్నాను. ఇంతలో ఒక రోజున రావణుని తమ్ముడు కుంభకర్ణుడు అటుగా వచ్చి నన్ను చూశాడు. నేను వంటరిగా ఉన్నాను. దాంతో నన్ను బలవంతంగా నన్ను లంకానగరానికి తీసుకువెళ్ళాడు. అతని వల్ల నేను గర్భవతినైనాను. ఆ తరువాత నిన్ను కని, పెంచి, పెద్దవాడిని చేశాను'' అంది.

తన తల్లికి జరిగిన అన్యాయానికి భీముడికి చాలా కోపం వచ్చింది. ప్రతీకారము తీర్చుకోవాలనుకున్నాడు. బ్రహ్మను గురించి ఘోర తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై అతని కోరికలన్నీ తీర్చాడు. వరబల గర్వితుడైన భీముడు దేవతలపైకి యుద్ధానికి వెళ్ళి ఇంద్రుని ఓడించి, స్వర్గాన్నాక్రమించాడు. దేవతలంతా తలా ఒక దిక్కుకూ పారిపోయారు. రాక్షసుడు మునీశ్వరులను, సాధు వర్తనులను నానాబాధలు పెడుతున్నారు. స్వర్గాన్ని వదిలి భూలోకానికి వచ్చాడు భీముడు. అప్పుడు కామరూప దేశాన్ని 'సుదక్షిణుడు' అనే రాజు పాలిస్తున్నాడు. అతన్ని ఓడించి, కారాగృహంలో బంధించాడు. సుదక్షిణుడు పార్థివ లింగాన్ని తయారుచేసి శివపంచాక్షరీ మంత్రాన్ని జపించి, ఆ లింగాన్ని అర్చిస్తున్నాడు. ఇదంతా కారాగృహములోనే జరుగుతోంది.

ఒకనాడు భీముడు కారాగృహానికి వచ్చి శివపూజలో ఉన్న రాజును చూసి ''ఓరి పిచ్చివాడా! మంత్రాలకు చింతకాయలు రాలతాయా? ఈ పూజలు, జపతపాలు వృథా. ఈ మట్టి లింగము నిన్ను కాపాడదు'' అన్నాడు. రాజు సమాధానం చెప్పలేదు. రాక్షసుడికి బాగా కోపం వచ్చింది. రాజు మాట్లాడకపోవటం అవమానముగా భావించాడు. దాంతో 'నీ పూజలు ఆపుతావా? నిన్ను నరికి చంపెయ్యనా?' అన్నాడు. దానికి రాజు ''దానవేంద్రా! శివుడు సాక్షాత్తూ పరమేశ్వరుడు. శివనామము జపిస్తేనే సర్వపాపాలు హరించుకుపోతాయి. శివనింద మహా పాపము'' అన్నాడు. భీముని కోపం కట్టలు తెంచుకున్నది. దాంతో బొందితో కైలాసానికి వెళ్ళేవాడికిమల్లే మాట్లాడతావా? ఈ దెబ్బతో నీ పని సరి' అని కత్తి తీసి ఒక్క వేటు వేశాడు. ఆశ్చర్యము కత్తి మాయమైపోయింది. శివలింగము నుండి ఈశ్వరుడు ప్రత్యక్షమై రాక్షసుణ్ణి భస్మం చేశాడు. ఆ సమయంలో బ్రహ్మాది దేవతలందరూ శివుని పరిపరి విధాల

స్తుతించి, భీముని చంపి మమ్ము కాపాడిన ఓ శంకరా! ఈ సహ్యాద్రి మీదనే నీవు జ్యోతిర్లింగమై ఉండు అని ప్రార్థించారు. వారి ప్రార్థన మన్నించి ఈశ్వరుడు భీమశంకరుడను పేర జ్యోతిర్లింగమైనాడు" అన్నాడు రత్నాకరుడు.



# రామేశ్వరుడు

"గురుదేవా! రామేశ్వరంలో రెండు శివలింగాలున్నాయి కదా! మరి వాటి వృత్తాంతము ఏమిటో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

త్రేతాయుగంలో శ్రీరాముడు రావణ బ్రహ్మను వధించి సీతాలక్ష్మణ హనుమత్సమేతంగా పుష్పక విమానమెక్కి అయోధ్యకు తిరిగి వస్తూ, త్రోవలో గంధమాధన పర్వతం మీద ఆగాడు. అక్కడి మునులందరూ శ్రీరాముడిని చూసి చాలా ఆనందించారు. రావణుని జంపి తమను రక్షించిన శ్రీరామచంద్రుని పరిపరి విధాల ప్రశంసించారు. అప్పుడు శ్రీరాముడు ఆ మునులతో "తాపసోత్తములారా! నేను రావణుని సంహరించాను. అతడు బ్రాహ్మణుడు. కాబట్టి బ్రహ్మహత్యాపాతకం నాకు చుట్టుకుంటుంది. అందుచేత, ఆ పాతకం చుట్టుకోకుండా ఉపాయం చెప్పండి" అన్నాడు. వారందరూ ఆలోచించి 'రామచంద్రా! దీనికి ఒక్కటే మార్గం. శివలింగం ప్రతిష్ఠించి పూజించినట్లైతే బ్రహ్మహత్యాపాతకము సోకదు' అన్నారు. అప్పుడు శ్రీరాముడు ఆంజనేయుడిని పిలిచి "హనుమా! కైలాసాని[illegible] ఒక శివలింగాన్ని తీసుకుని రా! శివలింగాన్ని ప్రతిష్ఠించటానికి మంచి ముహూర్తం చూశారు మునీశ్వరులు" అన్నాడు. చెప్పిన తడవుగా రివ్వున గాలిలోకి ఎగిరిపోయాడు ఆంజనేయుడు.

విధి విధానంగా లింగ ప్రతిష్ఠకు కావలసిన ఏర్పాట్లన్నీ అయినాయి. పండితులు వేద మంత్రాలు చదువుతున్నారు. ముహూర్తం దగ్గరపడింది. హనుమంతుడు రాలేదు. ఎదురు చూస్తున్నారు మునీశ్వరులు. అంతా తలెత్తి హనుమంతుడి రాక కోసం ఆకాశంలోకి చూస్తున్నారు. ముహూర్తం అతి సమీపంలోకి వచ్చింది. ఆంజనేయుడు వస్తున్న ఛాయలు లేవు. ముహూర్తం మించిపోతుందనే అనుమానం వచ్చింది. ఏం చెయ్యాలో పాలుపోవటం లేదు. ఇంతలో మునీశ్వరులకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది. దానితో వారు "రామచంద్రా! సాధ్వీమతల్లి సీతాదేవి అక్కడి ఇసుకను ప్రోగు చేసి లింగాకృతిగా నిల్పితే, దానికే ప్రాణప్రతిష్ఠ చేద్దాము" అన్నారు. సరే అన్నాడు రాముడు. సీత ఇసుకను లింగాకృతిలో

ఏర్పాటు చేసింది. దానికి ప్రాణప్రతిష్ట చేశారు మునీశ్వరులు. ఇంతలో హనుమ వచ్చాడు. శివలింగ ప్రతిష్ట అయిపోయింది. తాను సమయానికి రాలేకపోయాడు. శ్రీరాముని ఆజ్ఞను పాటించలేకపోయాడు. ఈ విధంగా ఆలోచించి బాధపడుతున్నాడు. శ్రీరాముడు ఎంతో ఓదార్చాడు. వినలేదు హనుమ. చివరకు రాముడు 'హనుమా! ప్రాణప్రతిష్ట చేసిన ఇసుక లింగాన్ని పీకెయ్యి. నువ్వు తెచ్చిన లింగాన్నే ప్రతిష్ఠిద్దాము'' అన్నాడు. హనుమ చాలా రకాలుగా ప్రయత్నించినా లింగములోని ఇసుక రేణువు కూడా కదల్లేదు. అప్పుడు శ్రీరాముడు ''హనుమా! చూశావు గదా! ముహూర్త బలం అంటే అది. నేను ప్రతిష్టించిన లింగము రామేశ్వర లింగము అని పిలువబడుతుంది. నువ్వు తెచ్చిన లింగాన్ని కూడా అక్కడే ప్రతిష్టించు అది హనువదీశ్వరలింగము అనే పేరుతో ప్రసిద్ధి చెందుతుంది'' అన్నాడు. హనుమంతుడు సరేనన్నాడు.

ఈ రకంగా రామేశ్వరంలో రెండు లింగాలు ఉన్నాయి అన్నాడు రత్నాకరుడు.



# నాగేశ్వరలింగము

''గురుదేవా! దారుకావనములో నాగేశ్వరలింగమున్నది అంటారు. దాని వివరాలు తెలియజెయ్యండి'' అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో పశ్చిమ సముద్ర తీరంలో 'దారుకుడు' అనే రాక్షసుడు ఉండేవాడు. అతని భార్య దారుకి. ఈ రాక్షసుడు కొన్ని యోజనాల విస్తీర్ణము గల పట్టణాన్ని నిర్మించుకుని, భార్యతో సహా సుఖంగా ఉన్నాడు. సహజమైన రాక్షస బుద్ధితో చుట్టుప్రక్కల గల మానవులందరినీ హింసిస్తున్నాడు. మునీశ్వరులను ముప్పతిప్పలు పెడుతున్నాడు. ముని వాటికలను అగ్నికి ఆహుతి చేస్తున్నాడు. హోమగుండాలను ఆర్పివేస్తున్నాడు. యజ్ఞయాగాలు ధ్వంసం చేస్తున్నాడు. అగ్నికి వాయువు తోడు అన్నట్లుగా అతనితో పాటు అతని భార్య కూడా లోక కంటకురాలయ్యింది. మునులు ప్రశాంతంగా జీవించటం అసాధ్యమైంది. ఆ రోజులలో 'ఔర్యుడు' అనే మహర్షి సుప్రసిద్ధుడు. మునులంతా ఔర్యుని వద్దకుపోయి దారుకుడు పెట్టే బాధల నుంచి తమకు విముక్తి కలిగించమని ప్రార్థించారు. వారి మొర విన్న మహర్షి, ''భూమిపై గల ప్రజలను గాని, మునీశ్వరులను గాని హింసించిన మరుక్షణంలో దారుకుడు సతీ సమేతంగా మరణిస్తాడు'' అని శపించాడు.

ఈ విషయం దారుకుడికి తెలిసింది. అప్పుడు ఆ రాక్షసుడు తన తపశ్శక్తితో సముద్రం మీద పట్టణం నిర్మించుకుని అక్కడ ఉంటూ సముద్రయానం చేసేవారిని పట్టిపీడించసాగాడు.

ఒకనాడు సముద్రం మీద ఒక ఓడ పోతోంది. అందులో సరుకులు, సంచారాలు, ధనము దండిగా ఉన్నాయి. దారుకుడు ఓడ మీదపడి దోచుకుని ఓడలోని వారందరినీ బందీలుగా చేశాడు. ఓడలో 'సుప్రియుడు' అనే వణిక ప్రముఖుడు ఉన్నాడు. అతడు గొప్ప శివభక్తుడు. సదాచార సంపన్నుడు, పరమ నిష్ఠాగరిష్టుడు. కారాగారములో కూడా రుద్రాక్షమాలలు, విభూతి ధరించి శివపూజలు, భజనలు చేస్తున్నాడు. భటులు ఈ విషయాన్ని దారుకుడికి నివేదించారు. శివపూజలు, భజనలు చేసేవారిని తీవ్రంగా హింసించారు. అందరూ పూజలు, భజనలు మానేశారు. సుప్రియుడు మాత్రం మానలేదు. అతన్ని ఒక చిన్న ఖైదులోకి మార్పించాడు దారుకుడు. అతని దగ్గర పూజా సామగ్రి లేకుండా చేశాడు. అయినా సరే సుప్రియుడు భజనలు చేస్తున్నాడు. ఒకరోజు రాక్షసుడు సుప్రియుని వద్దకు వచ్చి "ఓరీ! ఖైదు చేసినా నీ బుద్ధి మారలేదు. నీకు మరణశిక్ష విధిస్తే గాని ఈ పూజలు మానవా?" అన్నాడు. దానికి సుప్రియుడు "దానవేశ్వరా! జీవికి స్వేచ్ఛ, స్వాతంత్ర్యము ఎక్కడివి. తల్లి గర్భమే ఒక నరకము. అది కారాగారము కన్న భయంకరమైనది. ఆ తరువాత ఈ భూమండలమే చెరసాలా. అహంకార, మమకారాలే సంకెళ్ళు. నువ్వు మమ్మల్ని పెద్ద ఖైదు నుంచి చిన్న ఖైదుకు మార్చగలవు. అంతేకాని ఇంకేమి చెయ్యగలవు?" అన్నాడు.

దాంతో దానవుడి కోపం కట్టలు త్రెంచుకుని సుప్రియుడిని చంపబోయాడు. మరుక్షణంలోనే పరమేశ్వరుడు సుప్రియుడికి నాగేశ్వరుని రూపంలో ప్రత్యక్షమై దారుకుని సంహరించి సుప్రియుడిని 'ఏ వరం కావాలో కోరుకో' అన్నాడు. దానికి సుప్రియుడు "దేవదేవా! ఈ దారుకావనములో జ్యోతిర్లింగమై వుండి ప్రజలను రక్షించవలసినది" అని అడిగాడు. అతడి కోరిక ప్రకారము దారుకా వనములో జ్యోతిర్లింగమైనాడు పరమేశ్వరుడు అని చెప్పాడు రత్నాకరుడు.

# విశ్వేశ్వరుడు



"గురుదేవా! కాశీలో విశ్వేశ్వరుడు ఉన్నాడు కదా! మరి దాని కథ ఏమిటి? అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

సృష్టికి పూర్వమే పవిత్రమైన కాశీ పట్టణము ఉన్నది అని చెబుతారు. తేజోరూపుడు, సచ్చిదానంద స్వరూపుడు అయిన పరబ్రహ్మ ఈ లోకాన్ని సృష్టించాలని తలచి, నిరాకారుడుగా ఉన్న తను సాకారుడైనాడు. ఆ తరువాత తన నుండి శక్తిని బయటకు పంపాడు. అదే ప్రకృతి. అప్పుడు ప్రకృతి పురుషుడు ఇద్దరూ ఉన్నట్లయింది. వీరిద్దరూ సంచరించటానికి కొన్ని యోజనాల విస్తీర్ణము కలిగిన కాశీ పట్టణాన్ని నిర్మించాడు పరమేశ్వరుడు.

పురుషుడు పరమాత్మ ఆదేశాన్ననుసరించి ఈ సృష్టి చెయ్యటం కోసం తపస్సు చేస్తున్నాడు. ఆ పురుషుడే శ్రీమన్నారాయణుడు. అతడు తపస్సు చేస్తుండగా అతని శరీరము నుంచి నీరు కాల్వలై ప్రవహించింది. ఆ నీటిని చూసి ఆశ్చర్యపోయి పురుషుడు ఒక్కసారి తల ఊపాడు. ఆ ఊపుకు చెవులకు పెట్టుకున్న కమ్మ ఊడి నేలమీద పడింది. ఆ కమ్మ పడిన చోటునే 'మణికర్ణిక' అంటారు. అది చాలా పవిత్రమైన ప్రదేశం.

విష్ణువు ప్రకృతితో కలిసి నీటి మీద నిద్రిస్తున్నాడు. అతడి నాభి నుంచి కమలాసనుడు ఉద్భవించాడు. అతడు పరమేశ్వరుని ఆజ్ఞ ప్రకారము సృష్టి కార్యక్రమము మొదలుపెట్టాడు. మొదటగా ఐదు వందల కోట్ల యోజనాల విస్తీర్ణము గల బ్రహ్మాండమును సృష్టించాడు. దానికి నాలుగు వైపులా పద్నాలుగు లోకాలు సృష్టించాడు. ఈ బ్రహ్మాండమంతా నీటి మీద పడవలాగా తేలి ఆడుతోంది. దాని అష్టదిగ్గజాలు మోస్తున్నాయి. ఈ బ్రహ్మాండములో సగము భూలోకము 1/4 వంతు ఊర్ధ్వలోకము, 1/4 వంతు అధోలోకము.

ఆది నారాయణుడు, మిగిలిన బ్రహ్మాది దేవతలు, మహర్షులు అందరూ కలిసి ఈశ్వరుణ్ణి ప్రార్థించారు. వారి ప్రార్థనను మన్నించిన ఈశ్వరుడు ప్రత్యక్షమై "ఏ వరం కావాలో కోరుకోండి' అన్నాడు. అప్పుడు వారంతా ముక్త కంఠంతో 'దేవదేవా! పరమ పురుషా! కైలాస వాసా! నువ్వు కాశీ పట్టణంలో జ్యోతిర్లింగ రూపంలో వెలసి శాశ్వతంగా పూజలు అందుకుంటూ ఉండాలి'' అని అడిగారు. భక్తుల కోరికను మన్నించాడు పరమాత్ముడు.

కాశీ పట్టణంలో రెండు నదులు ప్రవహిస్తున్నాయి. అవి 1) వరుణ, 2) అసి. ఈ రెండు నదుల మధ్య ఉన్న ప్రదేశము కాబట్టి వారణాసి అని పిలువబడుతోంది. కాశినే మహా శ్మశానము అని కూడా అంటారు. బ్రహ్మదేవుడు ఈ పట్టణంలోనే యజ్ఞం చేశాడు. ఆ ప్రదేశాన్ని 'దశాశ్వమేథ ఘట్టము' అంటారు. ఇది మహా పవిత్ర క్షేత్రము. ఇక్కడ క్షేత్రపాలకుడు కాలభైరవుడు. ఈ క్షేత్రములో అష్టభైరవులు, నవదుర్గలు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, నవగ్రహాలు, గణపతులు కూడా ఉన్నారు.

కాశీ పట్టణంలో గంగాస్నానం చేసి ఇక్కడున్న దేవతలందరినీ అర్చించాలని లోకంలోని ప్రతి మానవుడు కోరుకుంటాడు. ఆ విశ్వేశ్వరుని అనుగ్రహం లేనిది కాశీ వెళ్ళలేము. కాశీకి

వెళ్ళకపోయినప్పటికీ, కాశి వెడదాము అనుకుంటే చాలు, వెళ్ళినంత ఫలం వస్తుంది. కాశీ యాత్ర చేస్తే ఐదు అశ్వమేధాలు చేసిన ఫలము వస్తుంది.

కాశీలో మరణిస్తే చాలు ఎంతటి క్రూరకర్ముడైనా సరే కైలాసం చేరతాడు. రామేశ్వరములోని ఇసుకను తెచ్చి కాశీలో విశ్వేశ్వరుడికి అభిషేకం చేసినవాడికి పునర్జన్మ ఉండదు. అంతెందుకు యజ్ఞ యాగాదులు చేసి స్వర్గసుఖాలు అనుభవించేకన్నా కాశీలో పిశాచమై తిరగటము మిన్న అని చెబుతారు. అటువంటి మహత్తరమైన ప్రాముఖ్యత గల కాశీలో జ్యోతిర్లింగమే విశ్వేశ్వరుడనే పేరుతో పిలవబడుతోంది అంటూ వివరించాడు రత్నాకరుడు.

# త్ర్యంబకేశ్వరుడు



"గురుదేవా! 'నాసికాత్ర్యంబకము' అంటారు కదా! దానికా పేరు ఎందుకు వచ్చింది? కాస్త వివరించండి' అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

త్రేతాయుగంలో తండ్రి ఆజ్ఞ ప్రకారం శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతంగా వనవాసానికి వెళ్ళాడు. అక్కడ పంచవటియందు పర్ణశాలను నిర్మించుకుని కాలక్షేపం చేస్తున్నాడు. ఆ సమయంలో రావణుని సోదరి శూర్పణఖ శ్రీరాముని చూసి మనసుపడింది. ఆ రాక్షసి ముక్కు, చెవులు కోసి పంపాడు లక్ష్మణుడు. శూర్పణఖ నాసికను ఖండించిన ప్రాంతానికి 'నాసిక' అని పేరు వచ్చింది. అదే ఇప్పటి 'నాసిక్'. ఇది మహారాష్ట్రలో ఉంది. ఈ పంచవటి నాసిక మండలములోనే ఉన్నది. ఇక్కడే బ్రహ్మగిరి అనే పర్వతమున్నది. దాని మీదనే గోదావరి నది పుట్టింది.

పూర్వకాలంలో బ్రహ్మగిరి మీద అహల్యతో కూడి గౌతమ మహర్షి నివసిస్తూ ఉండేవాడు. అతడు గొప్ప తపస్సంపన్నుడు, నిష్ఠాగరిష్ఠుడు. ఎంతటి పనినైనా సాధించగల దీక్ష గలవాడు. ఒకరోజున బ్రహ్మగిరి ప్రాంతంలోని మునీశ్వరులంతా కలిసి "గౌతముడు గొప్ప తపశ్శక్తి సంపన్నుడు. ఆయనకు అసాధ్యమనేది లేదు. కాబట్టి మనమంతా ఏదో ఒక ఉపాయం పన్ని గౌతముని గంగను భూలోకానికి తేవలసినదిగా ప్రేరేపిద్దాము" అనుకున్నారు. గౌతముడు తన భూమిలో వరి పైరు వేశాడు. మునులు తమ తపశ్శక్తితో మాయా గోవును సృష్టించి వదిలారు. అది పైరు మేస్తోంది. అది చూసిన గౌతముడు దర్భపుల్లతో గోవును

అదిలించాడు. మాయా గోవు మరణించింది. దాంతో మునులందరూ గౌతముడికి గోహత్యా పాతకం చుట్టుకుంది అని గోల చేశారు. మర్మము తెలియని గౌతముడు ఆ పాపానికి పరిహారం చెప్పమన్నాడు. అప్పుడు వారందరూ ఆలోచించి, దేవలోకంలో నుండి గంగను తెచ్చి, అందు స్నానం చేస్తే ఆ పాపము పోతుంది అన్నారు. గౌతముడు కొన్ని వేల సంవ్సరాల తపస్సు చేసి, శంకరుని మెప్పించి, గంగను భూమిపైకి తెచ్చాడు. గౌతముడి చేత భూమిపైకి తేబడింది కాబట్టి ఆ నది పేరు 'గౌతమి' అయింది. గోవు ప్రాణాలను వదలిన ప్రదేశము నుండి ప్రవహించింది కాబట్టి 'గోదావరి' అయింది. భాగీరథికి మల్లేనే గోదావరి కూడా పవిత్రమైన జీవనది. ఆ నదీ తీరంలో నివసించినంత మాత్రం చేతనే కోటి సంవత్సరాలు తపస్సు చేసిన ఫలము వస్తుంది.

గౌతముడు తపస్సు చేయగా శంకరుడు ప్రత్యక్షమైనాడు. అప్పుడు గౌతముడు రెండు వరాలు కోరాడు. 1) గంగను భూలోకంలోకి ప్రవహింపచేయటము, 2) పరమేశ్వరుడు నాసికలో త్ర్యంబకేశ్వరుడు అనే పేరుతో జ్యోతిర్లింగముగా వెలసి ప్రజలను రక్షించటము. గౌతముని కోరిక తీర్చాడు శంకరుడు. త్ర్యంబకేశ్వరుడు అనే పేరుతో నాసికలో వెలిశాడు. ఈ రకంగా నాసికలో త్ర్యంబకేశ్వరుడు పూజించబడుతున్నాడు'' అని చెప్పాడు రత్నాకరుడు.



## కేదారేశ్వరుడు

''గురుదేవా! హిమాలయ పర్వతాలలో 'కేదారేశ్వరుడు' అని ఉన్నాడు కదా? కేదార క్షేత్రాన్ని గురించి వివరించండి' అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

హిమాలయ పర్వత ప్రాంతము చాలా పవిత్రమైనది. ఆ పర్వతాల మీద దేవతలు విహరిస్తూ ఉంటారు. అక్కడ ప్రవహించే నదులలో స్నానమాడి, అక్కడ ఉన్న దేవతా విగ్రహాలను అర్చిస్తారు. ఆ పర్వత సానువులలో ఉన్న ముఖ్యమైన క్షేత్రాలు రెండు. 1) బదరి. ఇది నారాయణ క్షేత్రము, 2) కేదారము. ఇది ఈశ్వర క్షేత్రము. ఇక్కడ శివుడు జ్యోతిర్లింగ రూపంలో ఉంటాడు.

కేదారము హిమవత్పర్వత శిఖరము మీద ఉన్నది. ఈ క్షేత్రానికి తూర్పున అలకనంద, పడమర మందాకిని నదులు ప్రవహిస్తున్నాయి. ఈ రెండు నదులూ కొంతదూరం ప్రవహించి, రుద్రప్రయాగలో కలిసిపోయి తరువాత గంగానదిలో కలుస్తాయి.

పూర్వకాలంలో బదరికావనములో నరనారాయణులు నియమనిష్ఠతో చాలాకాలము తపస్సు చేశారు. తరువాత వారు కేదారము వెళ్ళి మందాకిని యందు స్నానము చేసి, అక్కడ ఈశ్వరుని అర్చించేవారు. వారి భక్తి ప్రపత్తులకు మెచ్చి ఈశ్వరుడు వారికి సాక్షాత్కరించాడు. అప్పుడు నరనారాయణులు ఈశ్వరునికి సాష్టాంగ ప్రణామాలర్పించి "దేవదేవా! దీనజన రక్షకా! ఆర్తత్రాణ పరాయణా! నీకు శతకోటి నమస్కారాలు. నీ కరుణ మా మీద ప్రసరింపచేశావు. అంతే చాలు. మాకు ఏ రకమైన కోరికలు లేవు. కాని ఈ క్షేత్రంలో జ్యోతిర్లింగముగా వెలసి, భక్తుల పూజలందుకుంటూ, నిన్ను దర్శించినవారికి మోక్షమివ్వవలసినది అని ప్రార్థించారు. వారి ప్రార్థన మన్నించి ఈశ్వరుడు అక్కడ కేదారేశ్వరుడుగా వెలశాడు అని చెప్పాడు రత్నాకరుడు.

## ఘుశ్మేశ్వరుడు



"గురుదేవా! ఘుశ్మేశ్వర లింగము ఎక్కడ ఉన్నది? దాని వృత్తాంతము వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో దేవగిరికి సమీపంలో 'సుధర్ముడు' అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు వేదవేదాంగ విదుడు. ధర్మపరుడు. ఇతని భార్య 'సుదేహ'. ఈ దంపతులకు సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్నీ ఉన్నాయి. కాని సంతానం మాత్రం లేదు. ఒక రోజున సుధర్ముని ఇంటికి బ్రహ్మజ్ఞానియైన యతీశ్వరుడు ఒకడు వచ్చాడు. భార్యాభర్తలు యతీశ్వరుడికి స్వాగత సత్కారాలు చేశారు. మధ్యాహ్న కాలమైంది. యతీశ్వరుడు భిక్ష స్వీకరించబోతూ సుధర్ముడితో 'నీకెందరు పిల్లలు?' అన్నాడు. బ్రాహ్మణ దంపతుల నోటమాట రాలేదు. అనుకోని ఈ ప్రశ్నకు నిరుత్తరులైపోయారు. కొంతసేపటికి తెప్పరిల్లి తాము సంతానహీనులము అని చెప్పారు. అప్పుడు ఆ యతీశ్వరుడు పీట మీద నుంచి లేచిపోయాడు. దంపతులు అతన్ని బ్రతిమిలాడారు. "స్వామీ! సంతానహీనులమైన మాకు సద్గతులు లేవు. మీరు సిద్ధాన్నము కూడా వదిలి వెడతారా?" అని వాపోయారు. దానికి యతీశ్వరుడు కరుణించి కొంత కాలానికి మీకు సంతానము కలుగుతుంది అని చెప్పి వెళ్ళిపోయాడు.

సుదేహ ఒకసారి గతాన్ని గుర్తుకు తెచ్చుకుంది. వివాహానికి ముందే జాతకులు నీకు

సంతాన యోగం లేదని చెప్పారు. విషయం చెప్పకుండా సుధర్ముడికిచ్చి పెండ్లి చేశారు. సుదేహ ఇప్పుడా విషయాన్ని తన భర్తకు వివరించి తన చెల్లెలు "ఘుశ్మ"ను వివాహమాడి సంతానాన్ని పొందమని చెప్పింది. సుధర్ముడు అందకు ఒప్పుకోలేదు. చివరకు భార్య బలవంతం మీద రెండవ వివాహానికి అంగీకరించాడు.

ఘుశ్మ పరమ పతివ్రత. తన అక్క సుదేహను తల్లిలాగా, భర్తను దైవంలాగా చూసుకునేది. ఉత్తమ ఇల్లాలు అనిపించుకుంది. అచిరకాలంలోనే గర్భవతి అయి ఒక మగశిశువును ప్రసవించింది. పిల్లవాడు దినదినాభివృద్ధి పొందుతున్నాడు.

ఇలా కొంతకాలం జరిగింది. సుదేహలో మార్పు వచ్చింది. చెల్లెలి మీద ఈర్ష్య, పిల్లవాడిపై ద్వేషము పెరిగాయి. క్రమంగా ఆమె వాటికి బానిస అయిపోయింది. సంతానము కలగటం చేతకదా నా చెల్లెలికి ఇంత మర్యాద, మన్నన. ఆ సంతానం లేకపోతే ఇద్దరం ఒక్కటే కదా?" ఈ రకంగా ఆలోచించటం మొదలుపెట్టింది.

ఒక రోజు రాత్రి నిద్రపోతున్న పసివాడి గొంతు కోసి చంపేసింది. తలను మొండేన్ని వేరు చేసి దగ్గరనే ఉన్న చెరువులో పారేసి ఏమీ ఎరుగని దానిలాగా ఇంటికి వచ్చి పడుకుంది. మర్నాటి ఉదయాన్నే లేచి ఘుశ్మ చెరువులో స్నానం చెయ్యటానికి వెళ్ళింది. పసివాడు చెరువులో ఈదుకుంటూ వచ్చి తల్లి కాళ్ళు పట్టుకుని "అమ్మా! నేను చచ్చి మళ్ళీ బ్రతికినట్లు కలగన్నాను" అన్నాడు. ఘుశ్మ అవాక్కయిపోయింది. చిన్నపిల్లవాడు కలగనటము ఏమిటి? చెరువులో నుంచి ఈదుకు రావటమేమిటి? అంతా వింతగా ఉన్నది అనుకుంటూ పిల్లవాణ్ణి తీసుకుని ఈశ్వరుణ్ణి స్మరిస్తూ ఇంటికి బయలుదేరింది. త్రోవలో ఆమెకు పరమేశ్వరుడు ప్రత్యక్షమై "సాధ్వీ! నీ అక్క సుదేహ, నీ పిల్లవాడి గొంతు కోసి చంపింది. నీవు నా భక్తురాలవు కాబట్టి, ఆ పిల్లవాడిని నేను మళ్ళీ బ్రతికించాను. ఇప్పుడు సుదేహను శిక్షిస్తాను" అన్నాడు. ఘుశ్మ పరమేశ్వరుని పరిపరివిధాల స్తుతించి "దేవదేవా! మానవులు పాపపు పనులు చెయ్యటానికి పాడు బుద్ధే కారణము. లోక రక్షకుడవు, దయామయుడవు కాబట్టి మా అక్కకు మంచి బుద్ధిని ప్రసాదించు" అని వేడుకుంది.

ఆ మాటలకు శివుడు ఎంతో ఆనందించి "అమ్మా! నువ్వు కోరినట్లే చేస్తాను. అంతేకాదు పాపులను, దుర్మార్గులను కూడా క్షమించగలిగే మంచితనమున్న నీ పేరున 'ఘుశ్మేశ్వరుడు' అనే పేరుతో నేను ఇక్కడ జ్యోతిర్లింగముగా వెలసి భక్తులను రక్షిస్తుంటాను" అన్నాడు.

ఈ రకంగా ఘుశ్మేశ్వర లింగము వెలసింది. దీన్ని పూజించినవారికి పుత్రశోకము కలుగదు అంటూ ద్వాదశ జ్యోతిర్లింగాల వృత్తాంతము వివరించి సప్తమాశ్వాసాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.



# అత్రేశ్వరుడు

"గురుదేవా! జ్యోతిర్లింగాలు పన్నెండే కదా? మరి అత్రేశ్వరుడు ఎవరు?"" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

భారతదేశానికి దక్షిణ భాగాన 'కామ్యకవనము' ఉన్నది. తపస్సు చేసుకోవటానికి చాలా అనువైన ప్రదేశమది. ఆ వనంలో అత్రి మహర్షి తన్న భార్య అయిన అనసూయాదేవితో కలిసి ఉండేవాడు. ఒకసారి దేశంలో కనీవినీ ఎరుగని కరువు ఒకటి వచ్చింది. పంటలు పండలేదు. తినటానికి తిండి లేదు సరికదా త్రాగటానికి గుక్కెడు నీరు కూడా దొరకలేదు. చాలా భయంకరంగా ఉన్నది పరిస్థితి. చూసింది అనసూయాదేవి. ప్రజలు నానా అగచాట్లు పడుతున్నారు. భరించలేకపోయింది. ఆ మహాతల్లి హృదయం ద్రవించింది. ఒకరోజు భర్తతో "నాథా! ప్రజలు చాలా కష్టాలు పడుతున్నారు. దీనికి నివారణోపాయము ఏమైనా చెప్పవలసినది" అన్నది. ప్రజల దీనస్థితికి మహర్షికి కూడా జాలి వేసింది. ఆయన సమాధి స్థితికి వెళ్ళిపోయాడు. అనసూయాదేవి పార్థివలింగాన్ని తయారుచేసి, నియమనిష్ఠలతో అర్చిస్తున్నది. దేవతలంతా ఆమె దయా గుణాన్ని ప్రశంసించారు.

కొంతకాలం తరువాత మహర్షి సమాధిలో నుండి లేచి త్రాగటానికి మంచినీరు తెమ్మన్నాడు భార్యని. ఆమె కమండలం తీసుకుని బయలుదేరింది. ఎక్కడా చుక్క నీరు లేదు. ఏం చెయ్యాలో పాలుపోవటం లేదు. అలా వెడుతుండగా త్రోవలో ఒక దివ్య స్త్రీ కనిపించి "పతివ్రతా శిరోమణి! నేను గంగాదేవిని. నిశ్చలమైన నీ భక్తికి మెచ్చాను. ఏ వరం కావాలో కోరుకో" అన్నది. దానికి అనసూయా దేవి 'తల్లీ! లోకంలో చుక్క నీరు కూడా ఎక్కడా దొరకటం లేదు. నా భర్త కడు దాహంతో ఉన్నాడు. ఈ కమండలం నింపు చాలు' అన్నది. దానికి గంగ " అమ్మా! ఇక్కడ ఒక గొయ్యి తవ్వు. నేను అందులో ప్రవేశిస్తాను" అన్నది. ఒక గొయ్యి త్రవ్వింది అనసూయ. ఇచ్చిన మాట ప్రకారం అందులో ప్రవేశించింది గంగ. అది పెద్ద జలాశయముగా మారింది. కమండలములో నీరు నింపుకుని తాను తిరిగి వచ్చేవరకు గంగను అక్కడే ఉండమని ఆశ్రమానికి వెళ్ళింది అనసూయాదేవి.

లోకంలో అంతటా క్షామం తాండవిస్తోంది. ఎక్కడా నీటి చుక్క కూడా దొరకటం లేదు. అటువంటి పరిస్థితిలో కొబ్బరినీళ్ళు లాంటి నీరు అనసూయా దేవి తీసుకురావటం చాలా

ఆశ్చర్యం వేసింది అత్రి మహర్షికి. నీరు ఎక్కడిది? అని అడిగాడు. జరిగిన విషయం చెప్పింది భార్య. ఋషి దంపతులు జలాశయం దగ్గరకు వెళ్ళి తనివితీరా స్నానం చేశారు. కడుపు నిండా నీరు త్రాగారు. అప్పుడు గంగాదేవి ఇంక సెలవు తీసుకుంటాను అన్నది. ఆ దంపతులు గంగను అక్కడే ఉండమన్నారు. అనసూయాదేవి ఒక సంవత్సరకాలం చేసిన తపస్సు తనకు ధారపోస్తే అలాగే ఉంటాను అన్నది గంగ. మునిపత్ని అందుకు అంగీకరించింది. అప్పుడు గంగ " ఓ పతివ్రతా! పాపాత్ములు అనేకమంది స్నానాలు చేసి వారి పాపాలు నాకు అంటగడతారు. వారందరి పాపాలూ మూటకట్టుకున్న నేను నీలాంటి పతివ్రతా దర్శనము చేసుకున్నట్లైతే, ఆ పాపాల నుండి విముక్తి పొందుతాను. అందుచేత ఓ అనసూయా! ప్రతిరోజూ నీవు ఈ జలాశయానికి వచ్చి స్నానం చెయ్యి అన్నది. సరేనన్నది సాధ్వీమతల్లి.

అప్పుడు పార్థివ లింగము నుండి శివుడు ప్రత్యక్షమై అనసూయా దేవితో "నీ భక్తికి, సద్బుద్ధికి మెచ్చాను. ఏ వరం కావాలో కోరుకో" అన్నాడు. "స్వామీ! మా ఆశ్రమం దగ్గర 'అత్రేశ్వరుడు' అనే పేరుతో గంగా సమేతంగా వెలసి నీ భక్తులను రక్షించు' అన్నది అనసూయ. ఆమె కోరిక ప్రకారము శివుడు అత్రేశ్వరుడుగా వెలిశాడు. జ్యోతిర్లింగాలలో ఇది ఒకటి కాకపోయినప్పటికీ, ఇది కూడా ఒక మహాక్షేత్రమే అంటూ వివరించాడు రత్నాకరుడు.

## భీమేశ్వరుడు

"గురుదేవా! గోదావరి జిల్లాలో గల ద్రాక్షారామంలో కూడా జ్యోతిర్లింగమున్నది అంటారు కదా? దాని చరిత్ర ఏమిటి?" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో దక్షుడు యజ్ఞం చేసిన ప్రాంతమే ఈ రోజున ద్రాక్షారామము అనబడుతోంది. దీని వృత్తాంతము చెబుతాను వినండి.

వ్యాసభగవానుడు కాశీ పట్టణంలో ఉన్నప్పుడు ఒకసారి ఏడు రోజుల పాటు భోజనం పెయ్యలేదు. ఏ యింటికి వెళ్ళినా భిక్ష వెయ్యలేదు. అందుచేతనే శిష్య సమేతంగా ఉపవాసము ఉన్నాడు. చివరకు ఎనిమిదవ రోజున భిక్షకు బయలుదేరాడు. ఆ రోజున కూడా ఏమీ దొరకలేదు. గత ఏడురోజులుగా ఆహారం లేదు. దాంతో వ్యాసుడి కోపం కట్టలు త్రెంచుకుంది. ఇక లాభం లేదని కాశీ పట్టణాన్ని శపించటానికి పూనుకున్నాడు. ఇంతలో

ఒక వాకిట ముత్తైదువ నిలబడి వ్యాసుని పిలిచింది. వ్యాసుడు ఆ వైపుకు వెళ్ళాడు. "స్వామీ! తమరు శిష్య సమేతంగా మా ఇంటికి భిక్షకు రండి" అని పిలిచింది ఆ యిల్లాలు. మహదానందం చెందాడు వ్యాసుడు. చీకటిలో చిరుదీపం దొరికినట్లయింది. శిష్య సమేతంగా ఇంటికి భిక్షకు బయలుదేరాడు వ్యాసుడు.

ఇంటిలోకి అడుగుపెట్టారు శిష్యులు. పొయ్యిలో పిల్లి లేవలేదు. చడీచప్పుడూ లేదు. అందరి ముఖాలలోను దిగులు, విచారం ఏమి చెయ్యాలో పాలుపోలేదు. ఇంతలో ఇంటావిడ వచ్చి 'మీ అనుష్టానం కానిచ్చి భోజనాలకు లేవండి' అన్నది. అంతవరకు బాగానే ఉంది, లేచి ఏం చెయ్యాలి? సరే చూద్దాం అని అందరూ లేచారు. స్నానము, సంధ్య పూర్తి చేశారు. ఇంటి ఆవరణలో పీటలు వేశారు. ముత్తైదువలు ఆకులు వేశారు. వడ్డనలు చేస్తున్నారు. ఇది ఎలా సాధ్యం. ఇందాక క్షణం క్రితం ఏమీ లేదు. ఇప్పుడు అంతా సిద్ధంగా ఉంది. ఆవురావురమని తింటున్నారు శిష్యగణము. ఈ ఇల్లాలు సాక్షాత్తూ విశాలక్షి తప్ప వేరు కాదు అనుకున్నారు. ఇంతలో సతీ సమేతంగా ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. పార్వతి "బాదరాయణా! అని ముక్త క్షేత్రమైన కాశీని శపించబోయావు. ఇది న్యాయమేనా?" అంది. ఇంతలో ఈశ్వరుడు కోపోద్రిక్తుడై వ్యాసుని కాశీ వదిలిపొమ్మన్నాడు. ఆయన పాదాలపైబడి ఈసారికి క్షమించమన్నాడు వ్యాసుడు. లాభం లేకపోయింది. శివుడు అంతర్ధానమైపోయాడు. పార్వతి మాత్రం "బాదరాయణా! దక్షిణ కాశి అని పేరుగన్న ద్రాక్షారామానికి వెళ్ళి, భీమేశ్వరుని పూజించి తరించు. నీకు శుభం కలుగుతుంది" అన్నది. చేసేది లేక వ్యాసుడు ద్రాక్షారామము చేరాడు.

ద్రాక్షారామములోని భీమేశ్వరుడు స్వయంభువు. పూర్వకాలంలో భరద్వాజుడు మొదలైన మహర్షులు ఇక్కడ భీమేశ్వరలింగాన్ని ప్రతిష్ఠించాలని ముహూర్తం పెట్టుకున్నారు. ఇంతలో దేవుని అభిషేకానికి, స్నానాలకు వీలుగా ఉంటుందని గోదావరీ నదిని ద్రాక్షారామము ప్రక్క నుంచి ప్రవహించమని ప్రార్థించటానికి వెళ్ళారు. వాళ్ళ ప్రార్థన మన్నించింది నదీతల్లి. కాని ఇక్కడకు వచ్చేటప్పటికి కొంత ఆలస్యం అయ్యింది. ఈ లోపల ముహూర్త సమయం మించిపోతుందని ఈశ్వరుడు తనకు తాను ప్రతిష్ఠించుకున్నాడు. ఆ రకంగా ఇది స్వయంభూ లింగము అయింది. ఆకాశంలో సూర్యచంద్రులున్నంతవరకు ఇక్కడ ద్రాక్షారామము దేదీప్యమానముగా ఉంటుందని ఈశ్వరుడు వ్యాసభగవానుడికి వరమిచ్చాడు. అందుచేత భీమేశ్వరుడు జ్యోతిర్లింగము కాకపోయినా మహామహిమోపేతమైనది అన్నాడు రత్నాకరుడు.



# మహాబలేశ్వరుడు

"గురుదేవా! గోకర్ణము చాలా పవిత్ర క్షేత్రము అని చెబుతారు. దీని వృత్తాంతము వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

త్రేతాయుగంలో రావణబ్రహ్మ లంకానగరాన్ని పాలిస్తుండేవాడు. అతని తల్లి కైకసి, ఆమె ప్రతిరోజూ మృణ్మయ లింగాన్ని పూజిస్తూ ఉండేది. అది చూసిన రావణుడు ఒకరోజున ఆమెతో "తల్లీ! రావణబ్రహ్మ యొక్క తల్లి మట్టి లింగాన్ని పూజించటమా? ఎంత అవమానము? నేను కైలాసానికి పోయి ఈశ్వరుణ్ణి, పత్నీ, పుత్ర, పరివార సమేతంగా లంకకు తీసుకువస్తాను. అని కైలాసానికి వెళ్ళి ఆ పర్వతాన్ని పెళ్ళగించటం మొదలుపెట్టాడు. ఆ కుదుపుకు పర్వతం కంపించిపోయింది. పర్వతము మీదనున్న పార్వతీదేవి ఈశ్వరుని వైపు చూసింది ఏమిది? అన్నట్లు.

ఈశ్వరుడు సమాధానంగా 'రావణుని పని' అంటూ కాలితో పర్వతాన్ని అదిమాడు. ఆ దెబ్బతో రావణబ్రహ్మ పర్వతం క్రింద పడి నలిగిపోయి, శివుని ప్రార్థించి బయటపడ్డాడు. తరువాత తన ప్రేగులతో వీణవాయించి శివుని మెప్పించాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై ఏం వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి దశకంఠుడు భగవంతుడు ఒక చోట, భక్తుడు ఒక చోట ఉండటం సరికాదు. కాబట్టి నువ్వు సపరివారంగా లంకకు రావలసినది అన్నాడు. దానికి శంకరుడు "వత్సా! నీవు చెప్పినది సరియైనదే. కాని నేను లంకకు రావటం కష్టమైన పని. అందుచేత నా ఆత్మ లింగాన్ని ఇస్తాను తీసుకువెళ్ళు. అయితే త్రోవలో ఈ లింగాన్ని ఎక్కడా క్రింద పెట్టవద్దు' అన్నాడు. రావణుడు ఆత్మలింగాన్ని తీసుకుని బయలుదేరాడు.

రావణబ్రహ్మ పరమేశ్వరుడి ఆత్మలింగాన్ని తీసుకుపోతున్నాడని విని గణపతిని పంపించాడు. రావణుడు కాలాతీతం కాకుండా త్రికాలముల యందు సంధ్యావందనము చేస్తాడు. సాయంసంధ్య కావస్తోంది. ఆత్మలింగాన్ని నేలమీద ఉంచకూడదు. ఏం చెయ్యాలి? అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో దూరాన ఒక బాలుడు కనిపించాడు. రావణుడు ఆ బాలుని పిలిచి పేరు అడిగాడు. 'గణేశభట్టు' అన్నాడు ఆ బాలుడు. నీ తల్లితండ్రులెవరు? అన్నాడు రావణుడు.

గణపతి : మా నాన్న పేరు 'శివయ్య', అమ్మ పేరు 'గౌరమ్మ'.

రావణుడు : మీ నాన్న ఏం చేస్తాడు.

గణపతి : ఎప్పుడూ రామ మంత్రాన్ని జపిస్తుంటాడు.

రావణుడు : సరే! నీకు కావలసినన్ని అప్పచ్చులు పెడతాను. నేను నది దగ్గర సంధ్య వార్చుకుని వచ్చేదాకా ఈ శివలింగాన్ని పట్టుకో.

గణపతి : కుదరదు, నాకు వేరే పనుంది, వెళ్ళాలి.

రావణుడు : మంచివాడివి కదా! త్వరగా వచ్చేస్తాను. ఒక్క క్షణం.

గణపతి : నువ్వింతగా అడుగుతున్నావు కదా! సరే లింగాన్ని పట్టుకుంటాను. త్వరగా వచ్చేయి. నేను మూడుసార్లు నిన్ను పిలుస్తాను. నువ్వు వెంటనే రావాలి. లేకపోతే ఈ లింగాన్ని క్రింద పెట్టి వెళ్ళిపోతాను.

రావణుడు : బాబ్బాబు! అంత పని మాత్రం చెయ్యకు. నేను వెంటనే వచ్చేస్తాను.

అని రావణుడు నదీ తీరానికి వెళ్ళాడు. మొదటిసారి పిలిచాడు గణపతి. వచ్చేస్తున్నా అని చెయ్యి ఊపి అర్ఘ్యం వదులుతున్నాడు రావణుడు. రెండోసారి పిలిచాడు గణపతి. చెయ్యి ఊపాడు రావణుడు. మూడోసారి పిలిచాడు గణపతి. రావణుడు త్వరగా పరుగు మీద వచ్చేశాడు. ఈ లోపునే లింగాన్ని క్రింద పెట్టేశాడు గణపతి. చాలా విచారించాడు రావణుడు. లింగాన్ని తియ్యటానికి ప్రయత్నించాడు. అది కదిలిరాలేదు. పాతాళం దాకా పాతుకుపోయింది. చేతులతో పీకటానికి ప్రయత్నించాడు. లింగం అరిగిపోయి ఆవుచెవిలా తయారయ్యింది. ఇక లాభం లేదని శివుని గురించి తపస్సు చేశాడు రావణుడు. పరమేశ్వరుడు రావణబ్రహ్మ కోరికలు తీర్చాడు. రావణుడు లంకానగరానికి వెళ్ళిపోయాడు.

ఆత్మలింగము భూమిలో పాతుకుపోయిన చోటనే 'గోకర్ణక్షేత్రము' అంటారు. ఈ క్షేత్రము భూకైలాసంగా ఖ్యాతి పొందింది. ఇక్కడ ఈశ్వరుడు 'మహాబలేశ్వరుడు' అనే పేరుతో పిలువబడతాడు అంటూ వివరించాడు రత్నాకరుడు.



# శ్రీకృష్ణ సంతానం

"గురుదేవా! శ్రీకృష్ణునికి సంతానం కలగలేదని, అప్పుడు ఆయన ఈశ్వరుణ్ణి ప్రార్థించాడనీ, ఈశ్వరుని కృప వల్లనే శ్రీకృష్ణునికి సంతానం కలిగిందనీ చెబుతారు కదా! ఆ విషయాన్ని

వివరించండి అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

ద్వాపరయుగములో దేవకి వసుదేవుల అష్టమ గర్భాన శ్రీకృష్ణ భగవానుడు జన్మించాడు. అతడికి ఎనిమిది మంది భార్యలు. పదహారువేల మంది గోపికలు. వీరందరితోనూ సరససల్లాపాలతో శ్రీకృష్ణ పరమాత్ముడు తేలియాడుతున్నాడు. కాని అతనికి సంతానం మాత్రం కలుగలేదు.

ఒకరోజున అష్ట భార్యలందరూ శ్రీకృష్ణుని చుట్టూ చేరి "నాథా! భువనైక మోహనుడవయిన నిన్ను భర్తగా పొందటం మా అదృష్టం. అయితే స్త్రీకి ఎన్ని సౌఖ్యాలు ఉన్న, భోగభాగ్యాలు ఉన్నా, సంతానం లేకపోవటమనేది చాలా పెద్దలోటు. తల్లి కాని స్త్రీకి లోకంలో గౌరవము లేదు. కాబట్టి మాకు బిడ్డలను ప్రసాదించవలసినది" అన్నారు. ఆ మాటలు విన్న శ్రీకృష్ణ పరమాత్ముడు "శివుని ఆజ్ఞలేనిదే చీమయినా కుట్టదు. ఈశ్వరానుగ్రహం లేనిదే ఏ పనీ జరగదు. అందుచేత నేను తపస్సు చేసి శివుని అనుగ్రహం పొందుతాను" అని తపోవనానికి బయలుదేరాడు.

హిమాలయ పర్వతాలలో ఉప మన్యువు యొక్క ఆశ్రమం ఉన్నది. శ్రీకృష్ణుడు ఆయన ఆశ్రమానికి వెళ్ళి తాను వచ్చిన సంగతి చెప్పాడు. ఉపమన్యువు చాలా సంతోషించి శ్రీకృష్ణునికి శివపంచాక్షరీ మంత్రోపదేశం చేశాడు.

శ్రీకృష్ణుడు నియమనిష్టలతో చాలాకాలం పాటు తపస్సు చేశాడు. ఆయన భక్తికి మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై నీకే వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి శ్రీకృష్ణుడు "చంద్రమౌళీశ్వరాః నీ అనుగ్రహం నా మీద ఉంటే చాలు" అన్నాడు. ఆ మాటలకు మహదానందం చెందినవాడై పరమేశ్వరుడు "శ్రీకృష్ణా! నీవారందరూ సంతానవంతులవుతారు. మొత్తము నీకు స్త్రీ పురుష సంతానము లక్షా ఇరవై ఒక్క వేల రెండు వందలు ఉంటుంది. లోకైక పూజ్యుడవవుతావు. ఇంకా యుద్ధంలో సర్వదా విజయలక్ష్మి నిన్ను వరిస్తుంది" అంటూ 'పాంచజన్యము' అనే శంఖాన్ని, 'కౌముదకి' అనే గదను, 'నందకము' అనే ఖడ్గాన్ని, 'శార్ఙ్గము' అనే ధనస్సునూ అక్షయ తూణీరాలను ఇచ్చాడు. ఇంకా అనేకానేక వరాలు కూడా ఇచ్చి దీవించాడు.

ఆ విధంగా పరమేశ్వరానుగ్రహంతో శ్రీకృష్ణ పరమాత్ముడు సంతానవంతుడైనాడని వివరించాడు రత్నాకరుడు.



# నరక లోక శిక్షలు

"గురుదేవా! పాపం చేసినవారంతా నరకానికి పోతారు. అక్కడ అనేక రకాలుగా శిక్షింపబడతారు అంటారు కదా! ఏ ఏ పాపం చేసిన వాళ్ళు ఏ నరకానికి పోతారు. ఏ రకమైన శిక్ష అనుభవిస్తారో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

మనోవాక్కాయ కర్మల చేత చేసిన తప్పుల వల్ల పాపం కలుగుతుంది. ఆ పాపాలకు మరణానంతరము మానవులు నరకంలో శిక్షలు అనుభవిస్తారు. మొత్తం ఇరవై ఎనిమిది రకాల నరకాలున్నాయి.

1. 'తామిస్ర' నరకము గాఢాంధకారముగా ఉంటుంది. ఇతరులను హేళన చేసేవారు. ఇతరుల ధనాన్ని అపహరించేవారు ఇక్కడ రకరకాలుగా శిక్షింపడతారు.
2. భర్తలను ప్రలోభపెట్టి, లేదా మోసపుచ్చి వారి భార్యలను అనుభవించేవారు 'అంధతామిస్ర' నరకంలో ఘోరంగా శిక్షింపబడతారు.
3. కుటుంబ పోషణ కోసము ఇతరులను మోసం చేసేవారు 'రౌరవ' నరకంలో విషజంతువులచే పీడించబడతారు.
4. దయ, దాక్షిణ్యము లేకుండా ధనార్జన చేసేవారు 'మహారౌరవ' నరకంలో పీడించబడతారు.
5. ఎలుకలను, ఉడతలను చంపి తినేవాళ్ళ 'కుంభీపాక' నరకంలో సలసలా కాగే నూనెలో త్రోయబడతారు.
6. పెద్దలను, పండితులను దూషించేవారు 'కాలసూత్ర' నరకంలో మాడిపోయే ఇసుకలో పడవేయబడతారు.
7. వేద విరుద్ధమైన పనులు చేసేవారు. 'అసిపత్రవ్రతము' అనే నరకంలో కత్తుల బోనులో పడేసి, ఇనుప కొరడాలతో కొట్టబడతారు.
8. అమాయకులను దండించిన న్యాయాధికారులు 'సూకర ముఖము' అనే నరకంలో

శరీరము నుగ్గునుగ్గు అయ్యేటట్లు కొట్టబడతారు.

9. జంతుజాలాన్ని హింసించేవారు 'అంధకూప' నరకంలో శిక్షించబడతారు. తేళ్ళు, జెర్రులు, నల్లులు, దోమలు, వాళ్ళ రక్తం పీల్చి పిప్పి చేస్తాయి.
10. సంపద కలిగి కూడా ఇతరులను ఆదరించనివారు 'క్రిభోజనము' అనే నరకంలో క్రిమి కీటకాలతో బాధించబడతారు.
11. బ్రాహ్మణ ద్రవ్యము, విలువైన వస్తువులు దొంగతనం చేసేవారికి 'సందశన' నరకములో ఎర్రగా కాల్చిన కడ్డీలచే పొడిచి, చర్మము వలచబడుతుంది.
12. వావివరుసలు లేకుండా చరించినవారిని 'తప్తసూర్మి' నరకంలో ఎర్రగా కాల్చిన లోహపు విగ్రహాలను కౌగిలించుకోమంటారు.
13. మదంతో పశువులతో రమించేవారిని 'వజ్రకంటక' నరకంలో ముళ్ళ పొదలలో పడదోస్తారు.
14. అధర్మపరులైన ఉద్యోగులను, వేదబాహ్యులైన బ్రాహ్మణులను 'వైతరిణి' నదిలో తోస్తారు. అది చీము, నెత్తురులతో, క్రిమికీటకాదులతో నిండి ఉంటుంది.
15. కులాచారములు పాటించనివారిని 'పూయాదన' అనే మలమూత్రములతో నిండిన సముద్రంలో తోస్తారు.
16. కుక్కలను పెంచి వేటయే వృత్తిగా గల బ్రాహ్మణులను 'ప్రాణరోధ' నరకంలో కత్తులతో పొడుస్తారు.
17. జంతువులను, పశువులను చంపి తినేవాళ్ళు 'వైశస' నరకంలో పడరాని పాట్లు పడతారు.
18. కామాంధుడై, భార్య నోటియందు వీర్యమును వదిలినవాడికి 'లాలాభక్షణ' నరకంలో వీర్యాన్నే తినిపిస్తారు.
19. ఇళ్ళకు నిప్పు పెట్టేవారు, విషం పెట్టేవారు, దారిదోపిడీ చేసేవారిని 'సారమేయోదన' నరకంలో పదునైన కోరకలు గల కుక్కలు చీల్చి వారి రక్తం త్రాగుతాయి.
20. దొంగ సాక్ష్యాలు చెప్పేవారు, వ్యాపారంలో మోసం చేసేవారు, 'అవిచింత'మనే నరకంలో కొండలమించి తలక్రిందులుగా క్రిందికి త్రోయబడారు.
21. దీక్షలు పూని మద్యపానం చేసే బ్రాహ్మణుని 'అయఃపాన' నరకములో సలసలాకాచిన ఇనుముని త్రాగిస్తారు.

22 .తమకన్నా పెద్దవారిని నిర్లక్ష్యంగా చూసేవారిని 'క్షారకర్ధ' నరకంలో తలక్రిందులుగా వ్రేలాడదీసి బాధిస్తారు.

23. మనుష్యులను, పశువులను చంపేవారిని 'రక్షోగణ బోజన' నరకంలో పదునైన కత్తులతో ముక్కలు ముక్కలుగా నరుకుతారు.

24. అడవి జంతువులను, ఊర జంతువులను చంపేవారిని 'శూలప్రోత' నరకంలో శూలాలతో పొడిచి ఉరి వేస్తారు.

25. సాటి మానవులను హింసించేవారిని 'దండసూకర' నరకములో హింసిస్తారు.

26. మనుషులను చెరబట్టేవారిని, బంధించేవారిని 'అవధ నిరోధనీ' నరకములో పొగలో పడేస్తారు.

27. భోజన సమయంలో వచ్చిన అతిథులను దూషించిన వారిని 'పర్యావర్తన' నరకంలో కళ్ళు కాకులతో పొడిపిస్తారు.

28. ధనగర్వముతో ఇతరులను దూషించేవారిని 'సూచేముఖ' నరకంలో సూదులతో గ్రుచ్చి హింసిస్తారు.

నరకములో ఎన్ని బాధలు పడినా పాపి చావడు. ఎత్తైన కొండ నుండి క్రిందికి పడత్రోసినప్పుడు అతడి శరీరము ముక్కలు ముక్కలవుతుంది. అతడు ఆ బాధ అనుభవిస్తాడు. కాని ఆ ముక్కలన్నీ మళ్ళీ అతుక్కుని, తరువాత శిక్షకు సిద్ధమవుతుంది. అంటూ నరకలోక శిక్షలను వివరించి ఎనిమిదవ అశ్వాసము పూర్తి చేశాడు రత్నాకరుడు.

# వైవస్వత మనువు



"గురుదేవా! వైవస్వతమనువు ఎవరు? అతని వృత్తాంతమేది? వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

సూర్యభగవానుడి భార్య సంజ్ఞాదేవి. వారి కుమారుడు 'వైవస్వత మనువు'. మొత్తం మనువులు 14 మంది. వారిలో ఏడవవాడు వైవస్వత మనువు. మొదటి ఆరుగురు మనువుల పాలనాకాలము ముగిసిపోయిన తరువాత వారంతా దేవతలలో కలిసి స్వర్గానికి

వెళ్ళిపోయారు. అప్పుడు దేవతలు 'వైవస్వతుని' రాజ్యము పాలించమని దీవించారు. కలియుగములోని ప్రథమ పాదములో దేశాన్ని పాలించేవాడు వైవస్వత మనువు.

మన దేశాన్ని పాలించిన వారిలో శ్రేష్ఠమైనవి రెండవ వంశాలు. 1) సూర్య వంశం, 2) చంద్ర వంశము. బ్రహ్మ మానసపుత్రుడు మరీచి. ఇతని కుమారుడు కశ్యపుడు. ఇతడికి 'వివస్వంతుడు' అని కూడా పేరు. కశ్యపుని కుమారుడు సూర్యుడు. సూర్యునికి కుమారుడు వైవస్వతుడు. ఈ రకంగా సూర్యవంశము వృద్ధి పొందింది. వైవస్వతుని కుమారుడే ఇక్ష్వాకువు. ఈ వంశంలో పృథు చక్రవర్తి, మాంధాత, సగరుడు, దిలీపుడు, భగీరథుడు, అజమహారాజు, దశరథుడు, శ్రీరామచంద్రుడు మొదలైనవారు ప్రసిద్ధులు. ఈ వంశంలో అతి ముఖ్యమైనవాడు శ్రీరామచంద్రుడు. త్రేతాయుగము ఆఖరి భాగంలో రావణ సంహారం చేశాడు. ఆయన కుమారులే లవకుశులు.

వైవస్వతమనువు కుమార్తె ఇళ. ఈమెకు చంద్రుని కుమారుడైన బుధుడికి వివాహం జరిగింది. వీరి కుమారుడు పురూరవుడు. ఈ రకంగా చంద్ర వంశము అభివృద్ధి చెందింది. ఈ వంశంలో దుష్యంతుని కుమారుడు భరతుడు, ప్రదీపుడు ఉదయించారు. ప్రదీపుని కుమారుడే శంతనుడు. ఇతని కుమారుడు గాంధేయుడు. శంతనునికి మత్స్యగంధి యందు పుట్టిన వారే విచిత్రవీర్యుడు, చిత్రాంగదుడు. వీరికి అంబిక, అంబాలికలతో వివాహమయ్యింది. కాని వారికి సంతానములేదు. తల్లి ఆనతి ప్రకారము వ్యాసుడికి అంబిక యందు ధృతరాష్ట్రుడు, అంబాలిక యందు పాండురాజు, ఇంటి దాసి యందు విదురుడు జన్మించారు. ధృతరాష్ట్రుని కుమారులు కౌరవులు, పాండురాజు కుమారుడు పాండవులు.

అర్జునుడికి సుభద్ర యందు పుట్టినవాడు అభిమన్యుడు. అభిమన్యుని కుమారుడు పరీక్షిత్తు. ఇతని కుమారుడు జనమేజయుడు, సర్పయాగం చేసిన మహారాజు, మహాభారత వైశంపాయనుడి ద్వారా విన్న మహానుభావుడు ఇతడే.

మహాభారతంలో పాటుగా అష్టాదశ పురాణాలు వ్రాసినవాడు వ్యాసుడు. వశిష్ఠ మహర్షి కుమారుడు శక్తి. అతని కుమారుడు పరాశరుడు. పరాశరుడు దేశాటన చేస్తూ, మార్గమధ్యంలో దాశరాజు కుమార్తె మత్స్యగంధినిని చూసి మోహించాడు. ఆమెకు అనేక వరాలిచ్చి, పగటిని రాత్రిగా మార్చి తన కోరిక తీర్చుకున్నాడు. వారి కుమారుడే వ్యాసుడు. మహాభారతం వ్రాయటమే కాకుండా, అందులోని కథతో ప్రత్యక్ష సంబంధం కలిగినవాడు.

వ్యాసుని కుమారుడు శుకుడు. ఈ రకంగా వైవస్వత మనువు యొక్క సంతానమే సూర్యచంద్ర వంశాలుగా ప్రసిద్ధి చెందినాయి అన్నాడు రత్నాకరుడు.



# సురధుడు - సమాధి

"గురుదేవా! సురధుడు అనే రాజు సమాధి అనే వణిక ప్రముఖుడు ఇద్దరూ కూడా అజ్ఞానంతో ప్రవర్తిస్తుంటే 'సుమేధుడు' అనే ఋషి వారికి జ్ఞానబోధ చేశాడు అంటారు. ఆ వృత్తాంతాన్ని వివరించండి" అన్నాడు నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

సూర్యుని కుమారుడు సావర్ణి. ఇతడే సూర్యసావర్ణి. రెండవ మనువు. సార్వోవిషమన్వంతరములో సావర్ణి 'సురధుడు' అనే మహారాజుగా పుట్టి భూమండలాన్నంతటినీ పాలిస్తున్నాడు. ఇతడు వేదవేదాంగవిదుడు. ధర్మశీలి. ఒకనాడు 'కోలలు' అనే ఆటవికులు సురధుని రాజ్యం మీదకు దండెత్తి వచ్చారు. యుద్ధానికి వచ్చినవారిని చూసి కూడా మంత్రులు, సేనలు ఏమీలేదు సరికదా వీరిలో కొంతమంది శత్రుసేనకు సాయం కూడా చేశారు. సురధుడు యుద్ధంలో ఓడిపోయాడు. రాజుగారి ధనాగారాలన్నీ అతని మంత్రులు, సేనాపతులే కొల్లగొట్టారు. రాజ్యం పోయింది, ధనం పోయింది, గౌరవం పోయింది. ఇంక అక్కడ ఉండటం ఇష్టంలేక రాజుగారు అరణ్యాలకు వెళ్ళిపోయాడు ఆ విధంగా అడవిలో చాలా దూరం వెళ్ళిపోయాడు. అక్కడ సుమేధుని ఆశ్రమం కనిపించింది. ఆశ్రమానికి చేరాడు రాజు. వచ్చిన రాజును సాదరంగా ఆహ్వానించాడు సుమేధుడు. అతిధి సత్కారాలు చేశాడు. ఆశ్రమంలోనే కాలం గడుపుతున్నాడు రాజు.

ఒకరోజు గతాన్ని గుర్తుకు తెచ్చుకున్న రాజు, తన రాజ్యాన్ని, పరివారాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. రాజ్యం ఏవిధంగా ఉన్నదో? ప్రజలు ఏరకంగా కష్టాలు పడుతున్నారో? మంత్రి, సామంతులు సరిగా ఆలోచన చేస్తున్నారో లేదో? ఈ విధంగా ఆలోచిస్తున్న రాజుకు ఆశ్రమ ప్రాంగణం దగ్గర ఒక వైశ్యుడు కనిపించాడు. అతడు చాలా విచారంగా ఉన్నాడు. అతన్ని కలిసి వివరాలు అడిగాడు రాజు. అతడి పేరు 'సమాధి' భార్యాబిడ్డలు అతన్ని

ధనాన్నంతా లాక్కుని ఇంటి నుంచి వెళ్ళగొట్టారు. అయితే ఇప్పుడు భార్యాబిడ్డల క్షేమ సమాచారం తెలియక బాధపడుతున్నాడు. ఇప్పుడు సురథుడు, సమాధి ఇద్దరూ ఆశ్రమంలోకి వచ్చి సుమేధుని దగ్గర కూర్చున్నారు. సుమేధునితో రాజు అంటున్నాడు "బ్రాహ్మణోత్తమా! నా రాజ్యాన్ని అపహరించారు. నా మంత్రులు, సేనానులు, నాకు రాజ్యంలో తావు లేకుండా చేశారు. అయినా నేను వారి గురించే ఆలోచిస్తున్నాను. అలాగే ఇతని ధనాన్ని అపహరించి భార్యాబిడ్డలు ఇతన్ని ఇంటి నుంచి వెళ్ళగొట్టారు. అయినా ఇతడు భార్యాబిడ్డల గురించే ఆలోచిస్తున్నాడు. దీనికి కారణం ఏమిటి?" ఆ మాటలు విన్న సుమేధుడు "రాజా! అదేనయ్యా మాయ అంటే. ఆహార నిద్రామైథునాలు లోకంలోని ప్రాణికోటికంతటికి సమానంగానే ఉంటాయి. కాని మానవుడికి విచక్షణా జ్ఞానము కూడా ఉంటుంది. మాయ ఆవరించటం చేత మానవుడు నేను, నాది అనే భ్రాంతిలో పడిపోతాడు. ఆ మాయ గనుక తొలిగిపోయినట్లైతే మోహాన్ని జయించగలుగుతాడు. ఈ జగత్తులో పరమేశ్వరుడు తప్ప అందరూ మాయకు బద్ధులే. పూర్వకాలంలో మాయ తొలగటం చేతనే విష్ణుమూర్తి మధుకైటభ సంహారం చేశాడు". అంటూ మధుకైటభుల వధ, మహిషాసుర వధ మొదలైన విషయాలు వివరించాడు. ఆ విషయాలను విన్న తరువాత సురథుడు, సమాధి కూడా పరమేశ్వరుణ్ణి ఆరాధించి మాయ నుండి విడివడి మోక్షము పొందారు" అంటూ సురథుడు, సమాధిల వృత్తాంతాన్ని వివరించాడు రత్నాకరుడు.



## మధుకైటభులు

"గురుదేవా! మాయ నుండి విడివడ్డ శ్రీ మహావిష్ణువు మధుకైటభ సంహారము చేశాడు అన్నారు. ఆ వృత్తాంతాన్ని కాస్త వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

సృష్టి ప్రారంభం కాకముందరి మాట. క్షీరసాగరంలో శ్రీ మహావిష్ణువు శేషశాయి అయి నిద్రిస్తున్నాడు. అయన చెవిలో నుంచి వచ్చిన గుబిలి నుండి మధుకైటభులు అనే రాక్షసులు జన్మించారు. వారిద్దరూ నీటిలో ఆడుతూ "ఇంత నీరు ఎక్కడి నుండి వచ్చింది?

ఈ నీటికి ఆధారం ఏమిటి? మన పుట్టుకకు కారణం ఏమిటి?'' అని ఆలోచిస్తున్నారు. ఇంతలో వాగ్బీజం వినిపించింది. దాన్నే మంత్రంగా తీసుకుని వేయి సంవత్సరాలు తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. వారు 'మాకు స్వచ్ఛంద మరణం కావాలి' అన్నారు. 'తథాస్తు' అన్నాడు పరమేశ్వరుడు.

వారావిధంగా నీటిలో తిరుగుతూ పద్మాసనుడైన బ్రహ్మను చూసి 'మాతో యుద్ధానికి రా' అన్నారు. బ్రహ్మ మాటాడలేదు. దాంతో రాక్షసులు రెచ్చిపోయి, 'మాతో యుద్ధం చేస్తావా? లేక ఛస్తావా?'' అంటూ మీదిమీదికి ఎగురుతున్నారు. అది చూసిన బ్రహ్మ పద్మాసనం వదలిపెట్టి, దాని కాడకుండా క్రిందికి దిగాడు. అక్కడ విష్ణుమూర్తి యోగనిద్రలో ఉన్నాడు. 'తండ్రీ! నువ్వు నిద్రలేచి నన్ను రక్షించవలసినది' అన్నాడు బ్రహ్మ. విష్ణువు లేవలేదు. ఎన్నిసార్లు పిలిచినా పలకలేదు. అప్పుడు అర్థమైంది బ్రహ్మకు. విష్ణువును యోగమాయ ఆవరించి యున్నది. ఆ మాయ వదిలితే గాని అతడు నిద్ర లేవడు. బ్రహ్మదేవుడు పరిపరివిధాల ఆ యోగమాయను ప్రార్థించాడు.

బ్రహ్మదేవుని మొర ఆలకించిన యోగమాయ విష్ణువును వదిలింది. తన దగ్గర నిలబడి ఉన్న బ్రహ్మను చూసి "కుమారా! తపస్సు వదలి ఎందుకిలా వచ్చావు?'' అన్నాడు.

జరిగిన విషయం చెప్పాడు బ్రహ్మ. ఇంతలో బ్రహ్మను వెదుక్కుంటూ వచ్చిన రాక్షసులు. 'మమ్మల్ని తప్పించుకు పారిపోదామనుకుంటున్నావా? రా మాతో యుద్ధానికి' అన్నారు. విష్ణుమూర్తి తన కుమారుణ్ణి తన వెనుక దాచివేసి "నేనుండగా అతనిని ఏమీ చెయ్యలేరు'' అన్నాడు. అది అదనుగా తీసుకుని విష్ణుమూర్తితో పోరుకు సిద్ధపడ్డారు రాక్షసులు. ముందుగా మొదటివాడు విష్ణువుతో యుద్ధం చేస్తున్నాడు. చోద్యం చూస్తున్నాడు రెండవవాడు. ఇలా కొన్ని సంవత్సరాలు గడిచినాయి. మొదటివాడు బాగా అలసిపోయాడు. రెండవ వాడు యుద్ధానికి వెళ్ళాడు. మొదటివాడు విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఈ రకంగా ఒకరి తరువాత ఒకరుగా యుద్ధం చేస్తున్నారు. విష్ణుమూర్తికి మాత్రం విశ్రాంతి లేదు.

ఒకసారి విష్ణువు 'మీరిద్దరూ విశ్రాంతి తీసుకుంటూ నాతో యుద్ధం చేస్తున్నారు. మరి నాకు కూడా విశ్రాంతి కావాలి కదా?' అన్నాడు. సరే అన్నారు మధుకైటభులు. విశ్రాంతి తీసుకునే సమయంలో పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు శ్రీ మహావిష్ణువు. 'యోగమాయ నీకు సహకరిస్తుంది. వాళ్ళని మాయోపాయంతో జయించు' అన్నాడు పరమేశ్వరుడు.

ఈసారి యుద్ధం ఆరంభమైంది. ఒక్క దెబ్బతో రాక్షసులను క్రింద పడేశాడు శ్రీ మహావిష్ణువు. వెంటనే "నాతో ఇంతకాలము యుద్ధం చేసినవారు ఎవరూ లేరు. మీ శక్తి యుక్తులకు మెచ్చాను. ఏ వరం కావాలో కోరుకోండి" అన్నాడు. రాక్షసుల అహం దెబ్బతిన్నది. అప్పుడు వారు "నువ్వు మాకు వరాలిచ్చేంతటివాడివా? మేమే నీకు వరమిస్తాం. ఏం కావాలో కోరుకో" అన్నారు. ఆ మాట విన్న శ్రీ మహావిష్ణువు అవకాశం వదలుకోలేదు. "మీరు నా చేతిలో చావాలి" అన్నాడు 'సరే నీరు లేని చోట మమ్మల్ని చంపు" అన్నారు రాక్షసులు. విష్ణువు తన ఆకారం బాగా పెంచేసి రాక్షసులను తన తొడల మీద పడేసి చక్రాయుధంతో వారి తలలు నరికేశాడు అంటూ చెప్పాడు రత్నాకరుడు.



# మహిషాసురుడు

"గురుదేవా! మహిషాసురుడనే రాక్షసుని పరమేశ్వరి వధించింది కదా? ఆ వృత్తాంతము వివరించండి" అన్నాడు నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

బ్రహ్మ మానస పుత్రుడు మరీచి, మరీచి కుమారుడు కశ్యపుడు. ఇతడికి ధనువు నందు రంభుడు, కరంభుడు అని ఇద్దరు కుమారులు కలిగారు. వీరికి సంతానం లేదు. అందుచేత సంతానం కోసం తపస్సు చెయ్యటం మొదలుపెట్టారు. కరంభుడు పీకలోతు నీటిలో దిగి తపస్సు చేస్తున్నాడు. ఆ విషయం తెలిసిన ఇంద్రుడు మొసలి రూపంలో వచ్చి కరంబుణ్ణి చంపేశాడు. రంభుడు పంచాగ్ని మధ్యన ఉండి తపస్సు చేస్తున్నాడు. తన అన్న మరణించిన విషయం తెలుసుకున్న రంభుడు ఇంద్రుని మీద పగ తీర్చుకోవటానికి సరియైన బలాఢ్యుడు, దేవతలను జయించగలిగినవాడు కుమారుడిగా కావాలి అని అగ్నిదేవుని ప్రార్థించాడు. అగ్నిదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి రంభుడు "స్వామీ! అజేయుడు, అపూర్వ బలశాలి, కామరూపి, ముల్లోకాలను జయించగలవాడు అయిన కుమారుడు కావాలి" అన్నాడు. "ఇక్కడ నుండి వెళ్ళేటప్పుడు ముందుగా నీవు ఎవర్ని చూసి మోహిస్తావో, వారి యందు పై లక్షణాలు గల తనయుడు పుడతాడు" అని వరమిచ్చాడు.

రంభుడు ఇంటికి బయలుదేరాడు. త్రోవలో యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుషాది కాంతలు ఎంతోమందిని చూశాడు. అతని మనసు చెదరలేదు. ఒక సెలయేటి వద్దన మహిష్మతి అనే గంధర్వ కాంత శాపవశాన మహిషముగా జన్మించి గడ్డిమేస్తోంది. దాన్ని చూడగానే మనస్సు చలించింది రంభుడికి. ఆ గేదె గర్భం దాల్చింది. ఆ గేదెను ఇంటికి తీసుకుపోయాడు రంభుడు. కొంతకాలానికి మనిషి శరీరము, దున్నపోతు తల కల బాలుని ప్రసవించింది ఆ గేదె. వాడే మహిషాసురుడు. పుత్రోదయం కాగానే శాపవిమోచనమయి గంధర్వ లోకానికి వెళ్ళిపోయింది మహిష్మతి.

మహిషుడు బ్రహ్మను గూర్చి ఘోర తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనాడు. మరణం లేకుండా వరం కావాలన్నాడు మహిషుడు. లాభం లేదు ఇంకేదైనా వరం కోరుకోమన్నాడు బ్రహ్మ. ఆలోచించాడు మహిషుడు. స్త్రీతో తప్ప వేరెవరితోనూ మరణం లేకుండా వరమియ్యమన్నాడు. తథాస్తు అన్నాడు బ్రహ్మ.

వరప్రసాది అయిన మహిషుడు రాక్షస గణాలను చేరదీశాడు. ముల్లోకాలను జయించాలని సంకల్పించి యుద్ధానికి బయలుదేరాడు. భూలోకము అతనికి పాదాక్రాంతమైంది. ఇక దేవదానవ గణాల మధ్య యుద్ధం సాగుతోంది. ఆ యుద్ధంలో దేవతలు పరాజితులై త్రిమూర్తుల దగ్గరకు వెళ్ళారు. త్రిమూర్తులతో సహా దేవతలంతా సభ తీర్చారు. మహిషుణ్ణి గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నారు. దేవతలందరి ముఖాల నుండి వారి శక్తి బయటకు వచ్చి ఒక స్త్రీ మూర్తి అయింది. ఆ స్త్రీ మూర్తి శరీరములో ఒక్కొక్క అంగము, ఒక్కొక్క దేవత యొక్క తేజస్సుతో నిండిపోయింది. ఈ రకంగా మహా తేజస్సుతో విరాజిల్లుతున్న ఆ స్త్రీ మూర్తి తప్పకుండా మహిషుని సంహరిస్తుంది అని భావించారు దేవతలు. అప్పుడు దేవతలందరూ తమ దగ్గర ఉన్న ఆయుధాలను ఆమెకిచ్చారు. హిమవంతుడు సింహాన్ని వాహనంగా ఇచ్చాడు. వివిధ రత్నాలు, ఆభరణాలు ఇచ్చాడు. వాటన్నింటినీ ధరించి ఆ పరమేశ్వరి పెద్దగా అట్టహాసం చేసింది. ఆ అట్టహాసానికి భూనభోంతరాళాలు దద్దరిల్లాయి. ఆ శబ్దం విన్నారు రాక్షసులు. అక్కడ వారికి పరమేశ్వరి కనిపించింది. ఆమెతో యుద్ధానికి తలపడ్డాడు.

రాక్షససేన పరమేశ్వరిని చుట్టుముట్టింది. వారందరినీ పరమేశ్వరి సంహరించింది. మహిషుని సేనాని చిక్షురాక్షుడు మరణించాడు. ఇక లాభం లేదని మహిషుడు పరమేశ్వరికి

ఎదురు నిలిచాడు. వారిద్దరి మధ్య పోరు ఘోరంగా సాగింది. మహిషుడు తన నిజ స్వరూపం ప్రదర్శించాడు. లోకాలన్నీ అతలాకుతలం చేస్తున్నాడు. పరమేశ్వరి కాలితో మహిషుని పీక తొక్కిపట్టి, కత్తితో అతని శిరస్సు ఖండించి వేసింది అంటూ మహిషాసుర వధను పూర్తి చేశాడు రత్నాకరుడు.



## దుర్గాసురుడు

"గురువుగారు! దుర్గాసురుడు అంటే ఎవరు? అతని వృత్తాంతమేదో వివరించండి? అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

కశ్యప ప్రజాపతి కుమారుడు హిరణ్యాక్షుడు అతడి వంశంలో 'రురుడు' అనే దానవుడు పుట్టాడు. అతని కుమారుడు 'దుర్గముడు'. దుర్గములు చాలా క్రూర స్వభావం కలవాడు. కఠినాత్ముడు. ఒకసారి దుర్గముడు తన మంత్రులతో కలిసి ఈ రకంగా ఆలోచించాడు. "దేవ దానవ యుద్ధం చాలాసార్లు జరిగింది. నిజం చెప్పాలంటే దేవతలకన్నా దానవులే బలవంతులు. యుద్ధ నైపుణ్యం గలవారు. అయినప్పటికీ యుద్ధంలో దేవతలే గెలుస్తున్నారు. దీనికి కారణం ఏమిటి?" ఆలోచించగా ఆలోచించగా అతడికి కారణం కనిపించింది. "దీనికంతటికి కారణం వేదాలు. వేదోక్తంగా భూలోకంలోని బ్రాహ్మణులు హోమాలు, యజ్ఞాలు చేస్తున్నారు. వాటిలో హవిర్భాగాన్ని దేవతలకు సమర్పిస్తున్నారు. అందువల్ల దేవతలకు బలం పెరుగుతోంది. ఒకవేళ హవిర్భాగము గనుక దేవతలకు అందకపోతే, వారి బలం పెరుగదు. అప్పుడు దేవతలను సులభంగా జయించవచ్చు. యజ్ఞయాగాదులను జరపాలంటే వేదాలు కావాలి. ఆ వేదాలనే లేకుండా చేస్తే దేవతలకు బలం రాదు కదా?" ఈ రకంగా ఆలోచించి వేదాలను తన ఆధీనం చేసుకోవాలి అనుకున్నాడు. హిమాలయాలకు వెళ్ళి బ్రహ్మదేవుని గూర్చి వేయి సంవత్సరాలు ఘోరమైన తపస్సు చేశాడు. అతడి భక్తికి, పట్టుదలకు, దీక్షకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏం వరం కావాలో కోరుకో అన్నాడు. "ప్రభూ! నీ వద్ద ఉన్న వేదాలను నా వశం కావించు" అన్నాడు దుర్గముడు. "తథాస్తు" అన్నాడు బ్రహ్మ.

ఆ క్షణం నుంచీ బ్రాహ్మణులు వేద ప్రవచనం చెయ్యలేకపోయారు. వేదోక్త విధులు జరగటం లేదు. యజ్ఞయాగాదులు ఆగిపోయినాయి. దానివల్ల వర్షాలు కురవటం మానివేశాయి. చెరువులు, బావులు ఎండిపోయాయి. పంట పొలాలకు నీరు లేదు. పంటలు పండడం లేదు. దేశంలో బ్రహ్మాండమైన కరువు వచ్చింది. హవిర్భాగాలు లేక దేవతలు తేజోహీనులైనారు. ఇదే అదనుగా తీసుకుని రాక్షసులు స్వర్గసీమ మీద దాడి చేశారు. దేవతలు యుద్ధం చేసే శక్తి లేక అరణ్యాలకు పారిపోయారు.

ఆ సమయంలో ప్రజలంతా ఆ పరమేశ్వరిని "అమ్మా! తిండి తిని ఎన్నో రోజులయ్యింది. ఆకలితో మలమలమాడి చచ్చినవారు చావగా, మిగిలినవారము వచ్చి నిన్ను ప్రార్థిస్తున్నాము. దుర్గముడి వల్ల నాకీ దుర్గతి పట్టింది. మమ్మల్ని రక్షించవలసినది" అని ప్రార్థించారు. అప్పుడు ఆమె వళ్ళంతా కళ్ళు చేసుకుని వారందరినీ చల్లగా చూసింది. అందుచేతనే 'శతాక్షి' అని పిలువబడింది. ఆ పరమేశ్వరి ప్రజలు తినటానికి పండ్లు, కూరలు ఇచ్చి వారి ఆకలి తీర్చింది. అందుచేత ఆమె "శాకంభరి" అనబడింది.

ఇంద్రాది దేవతలు అరణ్యాలలోను, కొండ గుహలలోను దాక్కున్నారనే విషయం తెలిసిన దుర్గముడు వారి మీద యుద్ధానికి వచ్చాడు. రాక్షసుల ధాటికి ఆగలేక దేవతలు పరమేశ్వరిని శరణు వేడారు. పరమేశ్వరికి, రాక్షసులకు మధ్య భీకరమైన పోరు జరిగింది. దేవి ఒంటరిగా ఉన్నదని ఊహించి రాక్షసవీరులు అనేకులు ఆమెను చుట్టుముట్టారు. అప్పుడు ఆమె శరీరము నుంచి కాళి, తారిణి, బాల, భైరవి, బగళ, మాతంగి వంటి శక్తులు అనేకానేకములు ఉద్భవించి అసురులను సంహరించాయి.

పదకొండవ రోజున దుర్గముడుకీ, పరమేశ్వరికీ యుద్ధం జరిగింది. పరమేశ్వరి ఆ రాక్షసుడిపై పదిహేను బాణాలు ప్రయోగించింది. నాలుగు బాణాల వల్ల గుర్రాలు, ఒక బాణంతో సారథి మరణించారు. రెండు బాణాలతో దుర్గముడి కనులు పోయినాయి. రెండు బాణాలతో అతడి భుజాలు తెగిపోయినాయి. ఒక బాణంతో రథము విరిగిపోయింది. ఐదు బాణాలతో రాక్షసుడు నెత్తురు కక్కుతూ మరణించాడు. ఈ రకంగా దుర్గముడిని సంహరించింది కాబట్టే ఆమె 'దుర్గాదేవి' అని పిలువబడింది.

దుర్గాదేవిని ప్రసన్నం చేసుకోవటానికి 32 నామాలు గల స్తోత్రం ఒకటి ఉన్నది.

దుర్గా స్తవము

దుర్గా దుర్గా ర్తిశమనీ దుర్గాపద్వినివారిణీ
దుర్గ మచ్ఛేదినీ దుర్గ సాధినీ దుర్గ నాశినీ
దుర్గతోద్ధారిణీ దుర్గ నిహంత్రీ దుర్గమాపహా
దుర్గ మజ్ఞానదా దుర్గదైత్యలోక దవానలా
దుర్గమా దుర్గమాలోకా దుర్గ మాత్మస్వరూపిణి
దుర్గ మార్గప్రదా దుర్గ మవిద్యా దుర్గ మాశ్రితా
దుర్గ మజ్ఞాన సంస్థానా దుర్గ మధ్యాన భాసినీ
దుర్గ మేహా దుర్గమగా దుర్గ మార్థస్వరూపిణీ
దుర్గ మాసుర సంహంత్రీ దుర్గ మాయుధ ధారిణీ
దుర్గమాంగి దుర్గమతా దుర్గమ్యా దుర్గమేశ్వరీ
దుర్గభీమా దుర్గభామా దుర్గభా దుర్గధారిణీ
నామావళి మిమాం యస్తు దుర్గయా మమ మానవః
పఠే త్సర్వ భయాన్ముక్తో భవిష్యతి న సంశయః.

శత్రువులతో బాధింపబడుచున్నప్పుడు గాని, బంధించబడినప్పుడు గాని ఈ స్తవాన్ని చదివితే బాధల నుంచి విముక్తి లభిస్తుంది. ఆపద సమయంలో 108సార్లు దీన్ని పఠిస్తే ఆపదలు తొలగుతాయి.

ఈ స్తవాన్ని వందసార్లు చదివి ఎర్రగన్నేరు పూలతో దుర్గాదేవిని పూజించినట్లైతే కార్యసిద్ధి జరుగుతుంది అంటూ తొమ్మిదో అశ్వాసాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.



# మార్కండేయుడు

"గురుదేవా! మార్కండేయుడు ఎవరు? అతని చరిత్ర ఏమిటో వివరించండి?" అన్నాడు నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో 'మృకండుడు' అని ఒక మహర్షి ఉండేవాడు. ఆయన భార్య 'మరుద్వతీ దేవి' పరమసాధ్వి, మహా పతివ్రత. వారికి సంతానం లేదు. ఒకరోజున మిగిలిన మహర్షులతో కలిసి మృకండుడు సత్యలోకానికి వెళ్ళాడు. అక్కడ "సంతానము లేనివారికి ఉత్తమ గతులు లేవు. అందుచేత నీకు ఈ లోకంలోకి ప్రవేశం లేదు" అంటూ మృకండుని ఆపేశారు ద్వారపాలకులు. చేసేది లేక ఇంటికి వచ్చి జరిగినదంతా భార్యతో చెప్పాడు.

ఆ దంపతులు హిమాలయ పర్వతాలకు వెళ్ళి శివుని గూర్చి ఘోర తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమై "ఏం వరం కావాలో కోరుకోండి! అన్నాడు. ఆ దంపతులు సంతాన భాగ్యము కావాలి అన్నారు. దానికి ఈశ్వరుడు "ఋషి దంపతులారా! మీకు సంతాన యోగంలేదు. అయినా తపస్సు చేసి అర్థించారు కాబట్టి, బుద్ధిమంతుడు, వేదవేదాంగవిదుడు అయిన బాలుని ప్రసాదిస్తాను. కాని అతని ఆయుష్షు పదహారు సంవత్సరాలే ఉంటుంది" అని చెప్పి అంతరార్థనమయినాడు. కొంతకాలానికి మృకండుని భార్య గర్భవతి అయి పండంటి మగబిడ్డను ప్రసవించింది. మునీశ్వరులంతా ఆ బాలుడికి 'మార్కండేయుడు' అని పేరు పెట్టారు.

మార్కండేయుడు మహా శివభక్తుడు. పిల్లవాడికి ఐదవ ఏట అక్షరాభ్యాసం చేశారు. మునీశ్వరులంతా అతన్ని దీర్ఘాయురస్తు అని దీవించారు. బాలుడు అల్పాయుష్కుడు అని ఈశ్వరుడన్నాడు. దీర్ఘాయువు కమ్మని మునీశ్వరులు దీవించారు. ఏం జరుగుతుందో? దైవ సంకల్పం ఏ రకంగా ఉన్నదో? అని ఊరుకున్నాడు మృకండుడు.

మార్కండేయుడు ఏకసంథాగ్రాహి. అందుచేత వేదవేదాంగాలు అన్నింటినీ కొద్ది రోజులలోనే నేర్చేసుకున్నాడు. అతి చిన్నతనంలోనే మహా పండితుడయిన మార్కండేయుని చూసి చుట్టుప్రక్కల వాళ్ళు, తల్లితండ్రులు అందరూ ఆనందించారు.

పిల్లవాడు మహా పండితుడు అనే ఆనందం ఒక ప్రక్క, అల్పాయుష్కుడని బాధ ఇంకొక ప్రక్క. తల్లితండ్రులు మాత్రం ఆశనిరాశల మధ్య ఊగుతున్నారు. ఈ రకంగా పదిహేను సంవత్సరాలు గడిచినాయి. ఒక రోజున నారద మునీంద్రుడు మృకండుని ఆశ్రమానికి వచ్చాడు. అర్ఘ్యపాద్యాదులిచ్చి గౌరవించాడు మృకండుడు. కుశలప్రశ్నల తరువాత, మాటల మధ్యలో మార్కండేయుడిని చూసి "సాముద్రిక లక్షణాలను బట్టి ఈ బాలుడు చాలా గొప్పవాడవుతాడు. భక్త శిఖామణి అవుతాడు. లోకైక పూజ్యుడవుతాడు. కానీ

అతడికి ఇంకొక సంవత్సరమే ఆయుర్దాయమున్నది. విచారించి లాభం లేదు, ఈ బాలుడు శివభక్తుడు, శివుడు భక్త సులభుడు. శివుని భక్తితో మెప్పించి వరాలు పొందటము అతి తేలిక అయిన పని. ఈ సంవత్సర కాలంలో మార్కండేయుడు శివుని మెప్పించగలడు. అని చెప్పి మార్కండేయునితో "నాయనా! గోదావరి నదీతీరములో గౌతముడి సిద్ధాశ్రమమున్నది. పూర్వకాలంలో అదితి, కశ్యపులకు వామనుడు అక్కడే జన్మించాడు. అందుచేత అది 'సిద్ధ జనార్ధన క్షేత్రము' అని కూడా పిలవ బడుతుంది. అక్కడ రాజరాజేశ్వరి, సోమలింగేశ్వరులున్నారు. గతంలో శ్వేతకేతు అనే మహారాజు, శుక్రుడు ఆ ప్రాంతంలోనే పరమేశ్వరుణ్ణి ఆరాధించారు. నువ్వు కూడా అక్కడికి వెళ్ళి శివుని గురించి తపస్సు చెయ్యి' అన్నాడు.

మార్కండేయుడు గౌతమీ తీరం చేరాడు. నదిలో స్నానం చేసి, గౌతముడికి నమస్కరించి తపస్సు చెయ్యటం ప్రారంభించాడు. ఇలా ఒక యేడాది గడిచిపోయింది. మాఘశుద్ధ పంచమి మార్కండేయుని జన్మదినం. ఆ రోజుకి మార్కండేయుడికి పదహారు సంవత్సరాలు నిండినాయి. మార్కండేయుని తీసుకురావటానికి యమధర్మరాజు దూతలను పంపాడు. యమ దూతలను చూసి మార్కండేయుడు శివుని శరణు వేడాడు, శివాలయములోకి వెళ్ళి కూర్చున్నాడు. యమ దూతలు ఆలయ ప్రవేశం చెయ్యబోయారు. కాలభైరవుడు గదతో వారిని అడ్డగించారు. దూతలు జరిగిన విషయాల్ని తమ ఏలికకు విన్నవించారు. మాఘ శుద్ధ సప్తమి యముడు దున్నపోతు నెక్కి మార్కండేయుని కోసం బయలుదేరాడు. నదీ స్నానం చేసి శివుడికి అభిషేకం చేస్తున్నాడు మార్కండేయుడు. మార్కండేయుడిని రమ్మని పిలిచాడు యముడు. పూజ మధ్యలో ఉన్నది. శివపూజకు అంతరాయం కలిగించవద్దు. సకల ధర్మవేత్తవు నీకు తెలియని ధర్మం లేదు కదా? అన్నాడు మార్కండేయుడు.

తను పిలిస్తే ఒక బాలుడు రానన్నాడు. యమధర్మరాజుకు కోపం వచ్చింది వెంటనే చేతిలోని పాశం మార్కండేయుడి మీదకి విసిరాడు. మార్కండేయుడు "ఆర్తత్రాణ పరాయణా! అనాథ రక్షకా! శంకరా! పాహిమాం" అంటూ శివలింగాన్ని ఆలింగనము చేసుకున్నాడు. యముడు కోపంతో పాశాన్ని లాగాడు. ఆ పాశము శివలింగాన్ని కూడా కుదిపివేసింది. ఢమఢమ ధ్వనులతో, పెళ పెళా రావాలతో కోటి సూర్యుల కాంతితో ఐదు ముఖాలు, మూడు కనులు కలిగి ఖడ్గం, పరశువు, శూలము ధరించి గజ చర్మాంబరధారి

అయిన ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. పరమ భక్తితో నమస్కరించాడు మార్కండేయుడు. 'నీకు భయం లేదు, నిశ్చింతగా ఉండు' అని మార్కండేయుడికి అభయమిచ్చాడు శివుడు. పరమేశ్వరుడు యమధర్మరాజుతో "సమవర్తీ! ధర్మ నిర్వహణలో నీవు హద్దు మీరి ప్రవర్తించావు. ఈ బాలుడు నా భక్తుడు. అతడి జోలికి ఎందుకు వెళ్ళావు" అంటూ యముణ్ణి శిక్షించాడు.

బ్రహ్మాది దేవతలందరూ వచ్చి యముడు తన పని, తాను చేశాడు కాబట్టి అతన్ని క్షమించమని వేడగా శివుడు శాంతించి "యమధర్మరాజా! నీ ధర్మాన్ని నువ్వు నిర్వర్తించు. కాని నా భక్తుల జోలికి మాత్రం వెళ్ళకు" అని ఆజ్ఞాపించి మార్కండేయుడికి ఏడు కల్పాల వరకు ఆయుష్షునిచ్చి దీవించాడు.

ఈ విధంగా శివుడు భక్తసులభుడు. అతని భక్తులకు ఎప్పుడూ మేలే జరుగుతుంది అంటూ మార్కండేయ చరిత్రను వివరించాడు రత్నాకరుడు.

# శివ పూజా విధానము



"గురుదేవా! ఈశ్వరుడు భక్త సులభుడని, భోళా శంకరుడని అంటారు కదా! మరి ఆ శివుని పూజించే విధానమేమిటో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం మొదలు పెట్టాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో బ్రహ్మాది దేవతలందరూ కలిసి విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళి "దేవదేవా! దేవతలు గాని, మానవులు గాని వారి పాపములన్నీ సమూలంగా నాశనం కావాలంటే ఎవరిని సేవించాలి? ఏరకంగా సేవించాలో కూడా వివరించమని" అడిగారు. దానికి శ్రీహరి "దేవతలైనా, మానవులైనా నిశ్చలమైన భక్తితో శివుణ్ణి ఆరాధించినట్లైతే, వారి కోరికలు తీరతాయి. శివనామ సంకీర్తన చేసేవారికి, శివ పూజా దురంధరులకు ఈశ్వరానుగ్రహము కలుగుతుంది. సకల శుభములు చేకూరుతాయి. ధన, కనక, వస్తువ, వాహనాలు సమృద్ధిగా కలుగుతాయి. శత్రు బాధలు ఉండవు" అన్నాడు. ఆ మాటలు విని దేవతలు శివ పూజా విధానాము తెలియచేయమని ప్రార్థించారు.

అప్పుడు శ్రీహరి విశ్వకర్మను పిలిచి దేవతలకు వారి వారి యోగ్యతానుసారము లింగము చేయించి ఇచ్చాడు. అంటే ఇంద్రునకు - పద్మరాగముతోను, కుబేరునకు - బంగారము, యమునికి - గోమేధికము, లక్ష్మీదేవికి - స్ఫటిక లింగము, బ్రాహ్మణులకు - పార్థివలింగము, యోగులకు - భస్మ లింగము ఈ రకంగా ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా లింగాలు తయారు చేశారు. ఇప్పుడు వారికి శివపూజా విధానము వివరిస్తున్నారు.

సాధకుడు బ్రాహ్మీ ముహూర్తంలో నిద్రలేచి కొంతసేపు భగవన్నామస్మరణ చెయ్యాలి. ఆ తరువాత కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చేసి శుభ్రమైన వస్త్రాలు ధరించి, ఆచమనం చేసి, భస్మధారణ, సంధ్యావందనము పూర్తి చేసి శివపూజ ప్రారంభించాలి.

ముందుగా గణపతి పూజ చెయ్యాలి. తరువాత కలశపూజ, శంఖుపూజ చేసి, శంఖములోనికి నీటిని పూజా ద్రవ్యాల మీద, తన శిరస్సున జల్లుకోవాలి. తరువాత పీఠపూజ చేసి, పరివార దేవతల ధ్యానించి, శివుని స్మరించి శివునకు అభిషేకం చెయ్యాలి. నమక చమకాలతో ఏకాదశ రుద్రాభిషేకము చెయ్యటము ఉత్తమము. కైవల్య, అథర్వ శిర, శ్వేతాశ్వర ఉపనిషత్తుల మంత్రాలతో అభిషేకించుట శ్రేష్ఠము. ఇవి ఏవీ తెలియనివారు పురుష సూక్తముతో అభిషేకం చెయ్యవచ్చు. అభిషేకం పూర్తయిన తరువాత, లింగాన్ని తుడిచి శ్రీ గంథము, పచ్చ కర్పూరము, కుంకుమపువ్వు లింగానికి రాచి. కుంకుమ, విభూతిలతో అలంకరించాలి. ఆ తరువాత అష్టోత్తరము, సహస్రామాలతో శివుని పూజించాలి. తరువాత ధూప, దీప నైవేద్యములు, తాంబూలము, నీరాజనము, మంత్రపుష్పము సమర్పించి, ఆత్మ ప్రదక్షిణ నమస్కారం చేయాలి. పూజ చేసేటప్పుడు కార్యసిద్ధి కోసం ప్రత్యేకమైన పద్ధతులు కూడా ఉన్నాయి.

ధనం కావాలసినవారు - కమలాలతో గాని, బిల్వ దళాలతో గాని శివుని అర్చించాలి.

పదికోట్ల పూలతో శివుని అర్చించినవాడు రాజవుతాడు.

ఐదుకోట్ల పూలతో శివుని అర్చించినవాడు మంత్రి అవుతాడు.

లక్షపూలతో అర్చిస్తే కారాగారవాసము తప్పిపోతుంది.

ఇరవై ఐదు వేల పూలతో అర్చించిన కన్యలకు సత్వరమే వివాహం జరుగుతుంది.

పన్నెండు వేల పూలతో అర్చిస్తే విద్యాబుద్ధులు అబ్బుతాయి.

పదివేల పూలతో అర్చిస్తే శత్రు బాధ తప్పుతుంది.

రెండు లక్షల పూలతో అర్చిస్తే లోకాలను మోహింప చేయగలుగుతాడు.

వేయి పూలతో అర్చిస్తే వాహన లాభం కలుగుతుంది.

శివ పంచాక్షరీతో పాటు మృత్యుంజయ మంత్రము కూడా జపిస్తే కోరిన కోరికలు తీరుతాయి. పంచాక్షరీ మంత్రం అక్షర లక్ష గనుక చేస్తే పరమేశ్వర సాక్షాత్కారం జరుగుతుంది. మూడు లక్షలు జపం చేసే మనోభీష్టము తీరుతుంది. నాలుగు లక్షలు చేస్తే కలలో ఈశ్వర దర్శనం కలుగుతుంది. రెండు లక్షలు చేస్తే సభా గౌరవము దక్కుతుంది. లక్ష జపం చేస్తే శరీరము పవిత్రమవుతుంది. పది లక్షలు జపం చేస్తే సర్వార్థ సిద్ధి కలుగుతుంది.

మోక్షం కావలసినవారు - దర్భలతోను,

ఆయుష్యు కావలసినవారు - గరికతోను,

పుత్రులు కావాలంటే - ఉమ్మెత్త పూలతోను

లక్షసార్లు ఈశ్వరుని అర్చించాలి. అలాగే

జిల్లేడు పూలు - శత్రు నాశనము

గన్నేరు పూలు - రోగ నాశనము

మంకెన పూలు - బంగారము ప్రాప్తి

జాజిపూలు - వాహనప్రాప్తి

జమ్మిపత్రి - ముక్తి

అడవి మొల్ల, గోరింటపూలు - పాడి పంటలు

కొండ గోగుపూలు - పట్టు వస్త్రములు

వావివిపూలు - మనశ్శాంతి

నువ్వు పూలు - మోక్షము

అక్షితలు - లక్ష్మీ ప్రదము

రోగగ్రస్తులయినవారు ఏకాదశ రుద్రాభిషేకం చేస్తే రోగం తగ్గుతుంది.

మంచినీటితో శివునకు అభిషేకం చేస్తే - సంతానాభివృద్ధి

ఆవునేతితో అభిషేకం చేస్తే - వంశాభివృద్ధి

రుద్రాధ్యాయ మంత్రాలతో పదివేలసార్లు అభిషేకం చేస్తే మేహ, పాండు రోగాలు తగ్గుతాయి.

పాలు, పంచదార కలిపి అభిషేకం చేస్తే బుద్ధి పెరుగుతుంది. వెయ్యిసార్లు అభిషేకం చేస్తే మారణ ప్రయోగాలు నిర్వీర్యమైపోతాయి.

ఈ రకంగా శివుని పూజించినట్లైతే ఇహపర సుఖాలు పొందవచ్చు అని దేవతలకు విష్ణుమూర్తి చెప్పాడని రత్నాకరుడు తన శిష్యులకు వివరించాడు.



## మొగలి పువ్వు

"గురుదేవా! మొగలి పువ్వు పూజకు పనికిరాదు అంటారు. ఎందుకనో కాస్త వివరంగా చెప్పండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

త్రేతాయుగంలో దశరథనందనుడైన శ్రీరామచంద్రుడు పితృవాక్య పరిపాలన కోసం సీతాలక్ష్మణ సమేతంగా అడవులకు వెళ్ళాడు. వారు ఫల్గుణీ నదీ తీరంలో పితృశ్రాద్ధము పెట్టవలసి వచ్చింది. శ్రాద్ధానికి అవసరమైన వస్తువులను తెమ్మని శ్రీరాముడు లక్ష్మణుని దగ్గరలో ఉన్న ముని వాటికకు పంపాడు. కాలాతీతమవుతున్నది. లక్ష్మణుడు తిరిగి రాలేదు. కారణము ఏమిటో అని శ్రీరాముడు కూడా వెళ్ళాడు. అపరాహ్నము దాటిపోతోంది. అపరాహ్నము దాటితే శ్రాద్ధము పెట్టకూడదని శాస్త్రం. ఏం చెయ్యాలో పాలు పోలేదు జానకీదేవికి. సరే ఏదైతే అది అవుతుందని, నదిలో స్నానం చేసి దొరికినవాటితో పిండ ప్రదానము చేసింది.

పితృదేవతలు సంతృప్తి పొంది సీతాదేవికి సాక్షాత్కరించారు. ఆమె ఆశ్చర్యపోయింది. వచ్చినవారెవరో తెలుసుకుందామని 'మహనీయులారా! మీరెవరు?' అన్నది. వచ్చినవారిలో ఒకరు, 'నేను నీ మామ దశరథుడను, ఈయన నా తండ్రి, ఈయన నా తాత. ఈ పిండ ప్రధానముతో మేము తృప్తి చెందాము' అన్నాడు. ఆ మాటలు విన్న సీతాదేవి, 'ఓ మహాత్మా! నేను చాలా ధన్యురాలను. నేను పెట్టిన పిండము మీరు స్వయంగా తీసుకున్నారు అంటే రాముడు నమ్మడు కదా?' అన్నది. దానికి దశరథుడు ఫల్గునీ నదిని, అక్కడ మేత మేస్తున్న ఆవును, అగ్నిని, మొగలిపూవును సాక్షులుగా చెప్పి పితృదేవతలు అంతర్థానమైపోయారు.

శ్రాద్ధానికి కావలసిన వస్తువులు తీసుకుని రామలక్ష్మణులు పరుగు పరుగున వచ్చారు. వస్తూనే రాముడు సీతతో 'వేళ మించిపోతోంది. త్వరగా స్నానం చేసి పదార్థాలు సిద్ధం చెయ్యి' అన్నాడు. సీతాదేవి పితృదేవతలకు తను పిండ ప్రదానము చేసిన సంగతి అంతా వివరించింది.

రాముడా మాటలు నమ్మలేదు. 'ఆబ్దీకము పెట్టటము కొడుకుల పని. పుత్రులు శ్రద్ధా భక్తులతో శ్రాద్ధము నిర్వహించి పితృదేవతలు తృప్తి చెందారు' అని తమలో తాము అనుకుంటారు. అంతేకాని కోడలు తద్దినం పెట్టటం, పితృ దేవతలు దాన్ని అందుకోవటం, ఎక్కడైనా విన్నామా?' అన్నాడు రాముడు. సీతాదేవి నదిని, గోవును, అగ్నిని, మొగలిపువ్వును సాక్ష్యం చెప్పమని కోరింది. సాక్షులు మాట్లాడలేదు. చేసేదిలేక సీతాదేవి స్నానం చేసి వంట చెయ్యటం మొదలుపెట్టింది.

రామలక్ష్మణులు శ్రాద్ధము పెట్టటానికి ఉపక్రమించి పితృదేవతలను ఆహ్వానించారు. "కుమారా! ఇంతకు ముందే సీత శ్రాద్ధము పెట్టింది. మేము తృప్తి చెందాము. ఇక పితృశేషము మీరు భుజించండి" అన్నారు పితృదేవతలు. శ్రీరాముడు సీతను అభినందించాడు. సాక్షులు ఎందుకు సాక్ష్యం చెప్పలేదు అనే ప్రశ్న వచ్చింది. అప్పుడు సీతకు సాక్ష్యం చెప్పనందుకుగాను ఫల్గుణీనది అంతర్వాహినిగా ప్రవహించమని, ఉదయాన్నే ఆవు ముఖం చూడటానికి అయోగ్యమని, మొగలి పువ్వు పూజకు పనికిరాదని, అగ్నిదేవుడు ఉచ్ఛనీచములు లేకుండా సర్వభక్షకుడు అవుతాడని శపించింది.

ఆ కారణం చేత మొగలిపువ్వు పూజకు పనికిరాదు అంటూ వివరించాడు రత్నాకరుడు.

## సంపెంగ పువ్వు



"గురుదేవా! మొగలిపువ్వుతో బాటుగా సంపెంగ పువ్వు కూడా పూజకు పనికిరాదు అంటారు నిజమేనా" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

దక్షిణ దేశములో గోకర్ణము అనే క్షేత్రమున్నది. దానినే 'భూకైలాసము' అని కూడా అంటారు. నారద మునీంద్రుడు ఒకసారి గోకర్ణము వెడుతూ త్రోవలో ఒక సంపెంగ

చెట్టును చూశాడు. అది విరగపూచి ఉంది. ఆ చెట్టు దగ్గర ఒక బ్రాహ్మణుడు ఒక గిన్నెను చేత్తో పట్టుకుని నుంచున్నాడు. అది చూసిన నారదుడు ఆ విప్రుని దగ్గరకు వెళ్ళి! నీవెవరవు? ఇక్కడ ఏం చేస్తున్నావు?' అన్నాడు. దానికి ఆ విప్రుడు 'నేనొక బాటసారిని. త్రోవలో అలసిపోయి ఈ చెట్టు నీడన నిలుచున్నాను' అన్నాడు. నారదుడు గోకర్ణం వెళ్ళి మహాబలేశ్వరుని సేవించి తిరిగి వెడుచుండగా ఆ బ్రాహ్మణుడు ఆ చెట్టు దగ్గరే కనిపించాడు. నారదుడు దగ్గరకు వెళ్ళి 'ఇక్కడ ఏం చేస్తున్నావు' అన్నాడు. 'ఏమీలేదు' అంటూ వెళ్ళిపోయాడు విప్రుడు. నారదుడు సంపంగి చెట్టుతో 'ఓ వృక్ష రాజమా! ఆ బ్రాహ్మణుడెవరు? అతడెక్కడికి వెడుతూన్నడు?' అని అడిగాడు. ఇంతకు ముందే నారదుడు తనను గురించి ఏమడిగినా తెలియదని చెప్పమన్నాడు. అందుచేత సంపంగి చెట్టు 'నాకు తెలియదు' అంది.

నారదుడు ఊరుకోలేదు. మళ్ళీ తిరిగి మహాబలేశ్వరుడి దగ్గరకు వెళ్ళాడు. అక్కడ నూట ఎనిమిది సంపంగి పూలతో స్వామి అర్చించబడి ఉన్నాడు. ఎదురుగా ఒక బ్రాహ్మణుడు ధ్యానం చేసుకుంటున్నాడు. నారదుడు ఆ బ్రాహ్మణని పిలిచి ఈ పూలతో స్వామిని ఎవరు అర్చించారు? అని అడిగాడు. "నారద మహర్షీ! ఈ పూలను ఒక దుష్ట బ్రాహ్మణుడు శివునికి అర్పించాడు. సంపెంగ పూలతో శివుని అర్చించినందుకు ఫలితంగా ఈ దేశపు రాజు అతడికి దాసుడైనాడు. దాంతో ఆ కపటి విశేష ద్రవ్యాన్ని ఆర్జించి కూడా ప్రజలను పీడిస్తున్నాడు" అని చెప్పాడు.

అప్పుడు నారదుడు మహాబలేశ్వరునితో "దేవదేవా! ఆ కపట బ్రాహ్మణుని నీవు కరుణించావు. అందుకే అతడు ఈ పనులు చేస్తున్నాడు" అన్నాడు. ఇంతలో ఓ మధ్యవయస్కురాలు ఆలయంలోకి వచ్చి "ప్రభో! శంకరా! పాహిమాం! పామిమాం" అన్నది. నారదుడు ఆమెతో "నీవెవరు? నీకొచ్చిన అపద ఏమిటి?" అన్నాడు. అప్పుడు ఆమె "మునీంద్రా! నా భర్తకు ప్రమాదంలో ఒక కాలుపోయి అవటివాడైనాడు. మాకు ఒక కుమార్తె ఉంది. కుమార్తె వివాహానికి రాజుగారి సహాయం అర్థించాము. రాజుగారు కొంత నగదు ఇచ్చి, ఒక ఆవును కూడా ఇచ్చారు. ఆ కపట బ్రాహ్మణుడు రాజుగారిచ్చిన నగదులో సగం తీసుకుని, ఆవులో కూడా సగభాగం ఇమ్మంటున్నాడు. ఏం చెయ్యాలో పాలుపోక మహాబలేశ్వరుని శరణు వేడుతున్నాను." అన్నది. ఆ మాటలు విన్న నారదుడు ఈశ్వరునితో "దేవా! ఇంకా ఉపేక్షిస్తావెందుకు? ఆ దుష్టుని శిక్షించు" అన్నాడు. దానికి ఈశ్వరుడు

''నారదా! నా భక్తులు ఎన్ని తప్పులు చేసినా నేను ఉపేక్షిస్తాను. అందుచేత నువ్వే ఆ సంగతేదో చూడు'' అన్నాడు.

నారదుడు ఈశ్వరుని దగ్గర సెలవు తీసుకుని సంపంగి చెట్టు దగ్గరకు పోయి ''ఓ తరురాజమా! నిజం చెప్పు ఆ బ్రాహ్మణుడెవరు? ఎందుకు నీ పూలు తీసుకువెడుతున్నాడు?' అని అడిగాడు. 'నాకు తెలియదు అన్నది సంపంగి చెట్టు'. అప్పుడు నారదుడు 'ఓ సంపంగి చెట్టా! నీ పూలంటే ఈశ్వరుడికి చాలా మక్కువ. కాని నువ్వు విప్రుని విషయం తెలిసీ కూడా తెలియదని అబద్ధం చెప్పావు. అందుచేత నీ పూలు శివపూజకు ఇంక పనికిరావు'' అని శాపం పెట్టాడు. అంతలో ఆ బ్రాహ్మణుడు ఆ చెట్టు దగ్గరకు వచ్చాడు. నారదుడు ఆ కపట బ్రాహ్మణుని చూసి ''ధనాశతో ప్రజలను పీడిస్తున్నావు. నిన్ను క్షమించరాదు. నువ్వు రాక్షసుడిగా జన్మించు'' అన్నాడు. ఆ బ్రాహ్మణుడు మహర్షి కాళ్ళావేళ్ళా పడి బ్రతిమిలాడాడు. అప్పుడు నారదుడు కనికరించి నువ్వు 'విరాధుడు' అనే రాక్షసుడుగా పుట్టు. త్రేతాయుగంలో శ్రీరాముడు నిన్ను సంహరించగానే నీకు శాప విమోచనం కలుగుతుంది' అన్నాడు.

ఆ రకంగా సంపంగి పువ్వు కూడా పూజకు పనికిరాకుండా పోయింది అన్నాడు రత్నాకరుడు.

## భస్మధారణ



''గురువుగారూ! ముఖాన విభూతి పెట్టుకుంటారు కదా? అందులో ఏదైనా ప్రత్యేకత ఉన్నదా? వివరించండి'' అన్నాడు. నారాయణభట్టు చెప్పటం మొదాలుపెట్టాడు.

పూర్వకాలంలో ఒకసారి మందరగిరి పర్వతం మీద ఈశ్వరుడు సభ తీర్చాడు. ఆ సభకి దేవతలు, గంధర్వులు, యక్షులు, దిక్పాలకులు, అష్ట వసువులు అందరూ విచ్చేశారు. ఆ సభలో సనత్కుమారుడు ఈశ్వరుడికి సాష్టాంగ నమస్కారం చేసి 'దేవా! నీ అనుగ్రహం పొందే తేలికపాటి ఉపాయమేదైనా చెప్పవలసినది' అన్నాడు. ఆ మాటలు విన్న ఈశ్వరుడు.

'''భస్మధారణ కన్న నా అనుగ్రహము పొందే ఉపాయము ఇంకోటి ఏదీలేదు. భస్మధారణ ధర్మార్థ కామమోక్ష ప్రదము. ఇది దేవతా ప్రీతికరము. నాకు అత్యంత ప్రీతిదాయకము.

గోమయంతో చేయబడిన భస్మము శ్రేష్టమైనది. భస్మాన్ని సేకరించేటప్పుడు 'సద్యోజాత' మంత్రాన్ని చెప్పాలి. తరువాత భస్మాన్ని 'అగ్నిరీత్యా' అనే మంత్రంతో అభిమంత్రించాలి. 'మానస్తోకే' అనే మంత్రంతో భస్మాన్ని నలిపి 'త్ర్యంబకం' అనే మంత్రంతో భస్మాన్ని శిరసున ధరించాలి. 'మ్ర్యయుషం జమదగ్నే' అనే మంత్రంతో విభూదిని ముఖాన పెట్టుకోవాలి. విభూతి రేఖలు కనుబొమ్మలు చివరలు దాటరాదు. మధ్యమ అనామికలతో పై రేఖ, క్రింది రేఖ ధరించి, బొటనవ్రేలితో కుడి నుంచి ఎడమకు మధ్య రేఖను గియ్యాలి.

విభూది రేఖలు మూడు ఓంకార రూపము. అవి అకార ఉకార మకారాలకు ప్రతీకలు. గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, అహవనీయాగ్ని అనబడే త్రేతాగ్నులు. సత్వరజస్తమో గుణాలు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదములకు ప్రతీక. త్రిమూర్తులకు ప్రతీక. భస్మధారణ చేసినవాడు మోక్షానికి అర్హుడు. బ్రహ్మచారులు, గృహస్తులు, సన్యాసులు అందరూ భస్మాన్ని ధరించవచ్చు. వైదిక కర్మలు చేసేటప్పుడు తప్పనిసరిగా భస్మధారణ చేయాలి.

భస్మధారణ వలన పాపాలు పోతాయి. స్త్రీ హత్య, భ్రూణ హత్య మొదలైన ఘోర పాపాలు నశిస్తాయి. కాని శివ దూషణ, శివుని ధనము అపహరణ వల్ల వచ్చే పాపము మాత్రము పోదు.

విధి విధానము తెలియకుండా విభూతి పెట్టుకున్నప్పటికీ, పాపములు, రోగాలు, పీడలు, బాధలు అన్నీ వదిలిపోతాయి. రుద్రాక్షమాల కంఠసీమను ధరించి, భస్మధారణ చేసినవాడు రుద్రుని వలె పూజ్యుడగును. భస్మధారణ చేసిన వాడికి అన్ని తీర్థములలోనూ స్నానం చేసిన ఫలితము వస్తుంది. ప్రతిదినము భస్మధారణ చేసినవాడు మరణానంతరము కైలాసము పొందుతాడు" అని చెప్పాడు అంటూ భస్మధారణ యొక్క విశేషాన్ని వివరించాడు రత్నాకరుడు.



## శివరాత్రి మహాత్మ్యము

"గురుదేవా! శివరాత్రి వ్రతాన్ని ఎవరైనా చేశారా? అది ఏ విధంగా చెయ్యాలి. దాని ఫలితము ఏమిటి?" అన్నాడు. కృష్ణశర్మ. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో 'గురుద్రుహుడు' అనే బోయవాడు ఉండేవాడు. అతడు పక్షులను, జంతువులను వేటాడి భార్యాబిడ్డలను పోషిస్తూండేవాడు. పుణ్యకార్యము అంటే ఏమిటో కూడా అతడికి తెలియదు.

ఒకరోజున ఆ బోయవాడు వేటకు బయలుదేరాడు. ఆ రోజు మహాశివరాత్రి. అతడి భార్యాబిడ్డలు ఆకలిబాధతో అలమటిస్తున్నారు. తాను వేటాడితే గాని వారి ఆకలి తీరదు. అందుకని వేటకు బయలుదేరాడు బోయవాడు. అదేమి విచిత్రమో ఆ రోజు ఒక్క జంతువు కాని, ఒక్క పక్షిగాని దొరకలేదు. ఏం చెయ్యాలో పాలుపోలేదు వేటగాడికి. ఏమైనా అడవంతా తిరుగుతున్నాడు. సాయంత్రమైంది దూరంగా ఒక సెలయేరు కనిపిస్తోంది. రాత్రిపూట నీరు త్రాగటానికి జంతువులు అక్కడికి వస్తాయి. వాటిని వేటాడి ఇంటికి తీసుకుపోవచ్చు. ఇలా ఆలోచించి తన దగ్గర ఉన్న సొరకాయ బుర్రలో నీరు నింపుకుని యేటి దగ్గర ఉన్న చెట్టుపైకి ఎక్కి కూర్చున్నాడు. అది ఒక బిల్వ వృక్షం.

రాత్రి మొదటి ఝాములో ఒక ఆడు జింక నీరు త్రాగటానికి వచ్చింది. చూశాడు బోయవాడు. ఆ జింకను వేటాడటానికి బాణం వెయ్యాలనుకుని చేత్తో బాణం తీసుకుంటున్నాడు. ఆ సమయంలో సొరకాయ బుర్రలోని నీరు కొంతవలికి క్రిందపడింది. చేతికి తగిలి చెట్టు ఆకులు రెండు క్రిందపడ్డాయి. అవి చెట్టు క్రింద ఉన్న శివలింగం మీద పడ్డాయి.

తనను చంపటానికి ప్రయత్నిస్తున్న వేటగాడితో ఆ జింక 'వ్యాధుడా! నీవు ఏం చేస్తున్నావు' అన్నది. 'ఆకలి బాధతో అలమటించే నా కుటుంబ సభ్యులకు నీ శరీరంతో ఆకలి తీర్చాలనుకుంటున్నాను" అన్నాడు వేటగాడు. దానికి ఆ జింక "ఈ శరీరము అశాశ్వతము. ఇవాళ కాకపోతే రేపయినా పోయేదే. నేను చచ్చిపోయేముందు కొంతమందికి ఆకలి తీర్చటం నా భాగ్యంగా భావిస్తాను. ఇంటి దగ్గర నా భర్త, పిల్లలు, సవితి ఉన్నారు. వెళ్ళి వాళ్ళకు చెప్పివ వెంటనే వచ్చేస్తాను. నన్ను నమ్ము" అంది. సరేనన్నాడు వేటగాడు.

కొంత సమయం గడిచింది. జింక సవితి నీరు త్రాగటానికి వచ్చింది. దాన్ని చంపటానికి బాణం వేయబోయాడు వ్యాధుడు. ఇందాకటి జింకలాగానే ఇది కూడా ఇంటి దగ్గర చెప్పి వస్తాను అన్నది. సరేనన్నాడు వేటగాడు. అతని చెయ్యి తగిలి రెండు ఆకులు, కాసింత నీరు క్రిందపడినాయి. అది రెండో ఝాము.

తన భార్యలు ఇంకా రాలేదు ఎందుకని? అని విచారిస్తూ మగజింక యేటి దగ్గరకు వచ్చింది. దాన్ని చంపబోయాడు కిరాతకుడు. ఇందాకటి జింకల మల్లేనే ఇది కూడా ఇంటి దగ్గర చెప్పి వచ్చి నీకు ఆహారమవుతాను అన్నది. సరే అన్నాడు వేటగాడు. అతని చెయ్యి తగిలి రెండు ఆకులు, కాసింత నీరు మళ్ళీ క్రింద పడినాయి. అది మూడవ ఝాము.

మగ జింక ఇంటికి వెళ్ళింది. భార్యలను కలిసి తాను వ్యాధుడికి ఆహారంగా వెడతాను అన్నది. కాదు ముందుగా నేను మాటిచ్చాను. కాబట్టి నేను వెడతాను అన్నది మొదటి జింక. అందరిలోకి చిన్నదానను కాబట్టి నేను వెడతాను అన్నది రెండో జింక. ఈ రకంగా చర్చించుకుని మూడు జింకలూ సెలయేటి దగ్గరకు వచ్చినాయి. వ్యాధుని వైపు చూసి అతని ఇంటికి తమను ఆహారంగా తీసుకు వెళ్ళమని అర్థించినాయి. ఆశ్చర్యపోయాడు కిరాతకుడు. ఇదివరకు తాను ఎన్నో జంతువులను చంపాడు. తనను చూసిన జంతువులు భయంతో పారిపోయినాయి. కాని విచిత్రం. ఇవి తమని ఆహారంగా స్వీకరించమని అర్థిస్తున్నాయి. అతడి మనసు మారిపోయింది. విల్లంబులు అవతల పారేశాడు. మృగాలను ఇంటికి వెళ్ళి పొమ్మన్నాడు. చెట్టు దిగుతున్నాడు. మళ్ళీ రెండు ఆకులు, సొరకాయ బుర్రలోని నీళ్ళు క్రిందపడినాయి. అనుకోకుండా చెట్టు క్రింద ఉన్న శివలింగానికి నాలుగు ఝాముల యందు అభిషేకము, బిల్వార్చన జరిగింది. ఈశ్వరుడు ప్రసన్నుడై వేటగాడితో "వత్సా! నువ్వు గుహుడనే పేరుతో శృంగభేరి పురాన్ని పాలించు. సమస్త భోగాలు అనుభవించు. శ్రీరామచంద్రునికి ఆతిథ్యమిచ్చి, తరువాత కైలాసము చేరతావు" అని చెప్పి అంతర్ధానమైనాడు.

కాబట్టి తెలసి గాని, తెలియకగాని శివరాత్రి నాడు శివలింగానికి అభిషేకం చేస్తే విశేష ఫలితము వస్తుంది.

ప్రతి మాసములోను అష్టమి, సోమవారము, బహుళ చతుర్దశి శివునికి అత్యంత ప్రీతిపాత్రమైనవి. మాఘ బహుళ చతుర్దశి మహాశివరాత్రి ఆ రోజంతా ఉపవాసముండి రాత్రంతా జాగారం చేసి, ఈశ్వరునికి అభిషేకము, బిల్వాలతో పూజ చేసినవాడికి కైలాసం ప్రాప్తిస్తుంది" అన్నాడు రత్నాకరుడు.

# అభిషేకము, అర్చనా - ఫలితాలు



"గురుదేవా! ఈశ్వరుడు అభిషేక ప్రియుడు అంటారు కదా! ఎందుకని? అర్చన చేసేటప్పుడు ప్రత్యేకంగా ఏ పూలతో, ఏ పత్రాలతో చెయ్యాలి? మాకు వివరంగా తెలియచెయ్యండి అన్నాడు నారాయణభట్టు. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

ఈశ్వరుడు అభిషేకప్రియుడు అనేది నిజం. శివలింగం నెత్తిన ఒక చెంబుడు నీళ్ళు పోసి 'హరహరా' అంటూ నమస్కారం చేస్తే చాలు. ఈశ్వరుడు ఆనందిస్తాడు. అభిషేకము చేస్తే అనంతమైన ఫలితం వస్తుంది.

నమకచమకాలతో ఏకాదశ రుద్రాభిషేకం చేస్తే బాగా ఉన్న జ్వరం తగ్గిపోతుంది.

నేతితో శివునకు అభిషేకం చేస్తే - సంతానం కలుగుతుంది.

పాలతో అభిషేకము చేస్తే - దుఃఖనివృత్తి, బాధానివారణ

చక్కెరతో అభిషేకము చేస్తే - బుద్ధి వికాసము

నూనెతో అభిషేకము చేస్తే - శత్రునాశనము

అత్తరుతో అభిషేకము చేస్తే - భోగప్రాప్తి

తేనెతో అభిషేకము చేస్తే - ఐశ్వర్యము

చెరకు రసముతో అభిషేకము చేస్తే - సంతోషము

గంగా జలముతో అభిషేకం చేస్తే - మోక్షము కలుగుతుంది.

అదే విధంగా పూవులతో అర్చన చేసినప్పుడు కూడా ఫలితము వేరువేరుగా ఉంటుంది.

లక్ష పద్మములతో గాని, బిల్వ దళాలతో గాని అర్చన చేస్తే - సమస్త భోగభాగ్యాలు పొందుతారు.

పదికోట్ల పద్మములతో గాని, బిల్వ దళాలతో గాని, శంఖు పూలతో గాని అర్చన చేస్తే - అఖండ భూమండలానికి అధిపతి అవుతాడు.

లక్ష పద్మములతో లేక బిల్వ దళాలు లేక శంఖుపూలతో పూజిస్తే - కారాగార విముక్తి లభిస్తుంది.

యాభై వేల సంఖ్యలో పూజ చేస్తే - రోగ విముక్తి

ఇరవై ఐదు వేల పూలతో పూజ చేస్తే - కోరిన కన్యను వివాహమాడతారు.

ఐదువేల సంఖ్యలో పూజిస్తే - విద్యాప్రాప్తి.

రెండువేల ఐదువందలు పూజిస్తే - అభీష్టసిద్ధి.

ఈశ్వరుణ్ణి దర్భలతో పూజిస్తే - దీర్ఘాయుష్షు

ఉమ్మెత్తలతో పూజిస్తే - పుత్రసంతానము

అగస్త్య పూలతో పూజిస్తే - కీర్తి

జిల్లేడు పూలతో పూజిస్తే - శౌర్యము కలుగుతుంది, శత్రు నాశనమవుతుంది.

కలువ పూలతో పూజిస్తే - శౌర్యవృద్ధి, శత్రు నాశనము.

మంకెన, గన్నేరు పూలతో పూజిస్తే - శత్రునాశనము

జాజిపూలతో పూజిస్తే - వాహనప్రాప్తి

మల్లెపూలతో పూజిస్తే - భోగము

అవిశెపూలతో పూజిస్తే - పరమేశ్వర సఖ్యము

కొండగోగుపూలతో పూజిస్తే - వస్త్రలాభము

శిరీష పుష్పాలతో పూజిస్తే - సంతోషము

నువ్వు పూలతో పూజిస్తే - యవ్వన ప్రాప్తి

తుమ్మి పూలతో అర్చిస్తే - మోక్షము సిద్ధిస్తుంది.

ఈ రకంగా పరమేశ్వరుని వివిధ రకాల ద్రవ్యాలతో అభిషేకించినా, వివిధ రకాల పుష్పాలతో పూజించినా కూడా వాటి ఫలితము వేరుగా ఉంటుంది అన్నాడు రత్నాకరుడు.



## శివపూజ సర్వార్థ సిద్ధి

"గురువుగారూ! అసలు శివలింగాన్ని పూజిస్తే ఫలితము ఏమిటి అనేదాన్ని వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

ఒకసారి ఇదే అనుమానం వచ్చి బ్రహ్మదేవుడు విష్ణుమూర్తిని అడిగాడు. దానికి శ్రీ మహావిష్ణువు "ఈ జగత్తులో అన్నింటికీ కారణము పరమేశ్వరుడే. అతడు కరుణా సముద్రుడు. భక్త వత్సలుడు. కాబట్టి శివపూజకు సాటియైనది వేరొకటి లేదు. అనుకూలవతి అయిన భార్య కావాలన్నా, మంచి కుమారులు కావాలన్నా, భోగభాగ్యాలు, ఆయురారోగ్య ఐశ్వర్యాలు కావాలన్నా, మోక్షము, కీర్తి కావాలన్నా ఈశ్వరుణ్ణే ఆరాధించాలి. శివుని ప్రతిరూపమే శివలింగము. శివలింగాన్ని పూజించేవారు ఏ రకమైన బాధలు, దుఃఖాలు పొందరు. వేయి కర్మ యజ్ఞాలకన్న - ఒక్క తాపస వ్రతము శ్రేష్టము. వేయి తాపస వ్రతాల కన్నా - ఒక్క ధ్యాన యజ్ఞము ఉత్తమము. ధ్యానయోగికి ఈశ్వరుడు సులభంగా దర్శనమిస్తాడు.

శివలింగము బాహ్యము, అభ్యంతరము అని రెండు రకాలు. బాహ్యము అంటే - స్థూలము. అభ్యంతరము అంటే - సూక్ష్మము. కర్మలు చేసేవారికి బాహ్యమే కావ్వా. అనగా అభిషేకము, పూజ మొదలైనవి చెయ్యాలంటే స్థూలంగా శివలింగముకావాలి. జ్ఞానులకు సూక్ష్మలింగార్చన. కేవలము ఏకాగ్రత కోసం మాత్రమే బాహ్యలింగము. జ్ఞాని సూక్ష్మలింగాన్ని అర్చిస్తాడు. అంటే తనలోనే ఈశ్వరుణ్ణి చూసుకుని పూజిస్తాడు. తానే ఈశ్వరుడు అని భావిస్తాడు. ఈ జగత్తంతా తనలోనే ఉన్నది. ఈశ్వరార్చన చెయ్యకుండా పాపాలు పోవు. జ్ఞానంరాదు గంగ పాపాలను పోగొడుతుంది. కల్పవృక్షము దరిద్రాన్ని పోగొడుతుంది. శివపూజ వీటన్నింటినీ పోగొట్టి భోగభాగ్యాలను, సిరిసంపదలను ఇస్తుంది. [illegible]రుణ్ణి అర్చించినట్లైతే సర్వదేవతలను ఆరాధించినట్లే. ఈశ్వరుడు సర్వదేవాత్మకుడు, సర్వ దేవోత్తముడు, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు. ఆదిమధ్యాంత రహితుడు. కాబట్టి శివపూజ సర్వార్థ శిద్ధిని కలుగచేస్తుంది అంటూ శివపురాణాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

ఈ శివపురాణాన్ని ఆసాంతం విన్న శిష్యులు గురువుగారికి ప్రదక్షిణలు చేసి, సాష్టాంగ నమస్కారాలు ఆచరించి, వారిని వివిధ రకాలుగా సత్కరించి సెలవు తీసుకున్నారు.

హరితస గోత్రీకుడు శ్రీ క్రోవి కృష్ణమూర్తి

శ్రీమతి సత్యపర్వత వర్ధనమ్మ గార్ల జ్యేష్ఠపుత్రుడు అయిన క్రోవి పార్థసారథి

సర్వజనామోదము పొందునట్లుగా, సులభ శైలిలో వ్రాసిన 'శివ పురాణము' సమాప్తము.

సర్వేజనాః స్సుఖినోభవన్తు

ఓం తత్సత్